# ప్రస్తావన.

౧

ఆనందస్వామి మున్నగు మిత్రుల ప్రోత్సాహము వలన సత్యప్రయోగమున కావశ్యకమగు "ఆత్మకథ"ను వ్రాయనారంభించి యుంటిని. ఈ గీతానువాద సందర్భమందు కూడ అట్లే జరిగినది. "మీరొకసారి సంపూర్ణముగ గీతానువాదము చేసి, దానిపై వ్రాయవలసిన వ్యాఖ్యానము వ్రాసి ముగించినచో, మేము దానినంతయు చదివి, పిమ్మట, మీరు గీత కెట్టియర్థమును చెప్పెదరో గ్రహింప గల్గుదుము. కాని అక్కడక్కడి శ్లోకములవలన అహింసను ప్రతిపాదించుట నాకుచితముగా నగపడదు." అని అసహాయోద్యమ సమయమున, ఆనందస్వామి, నాతో పలికియుండెను. నేనంతట "అవకాశము లభించినపుడిది చేయుదును" అని వారికి ప్రత్యుత్తరమిచ్చితిని. పిమ్మట నేను కారాగృహమున కేగితిని. గీతాధ్యయనము మిక్కిలి లోతుగా చేయుట కచ్చట వీలుకలిగినది. లోకమాన్యుని జ్ఞానభండారము చదివితిని. మరాఠీ, గుజరాతీ, హిందీ అనువాదముల నంతకుముందే ఆయన ప్రేమపూర్వకముగ నాకంపించి యుండెను. మరాఠీలో నేను చదువజాలక పోయినను గుజరాతీ యనువాదమునైన చదువవలయునని ఆయన నన్ను నిరోధించి యుండెను. జెయిలు వెలుపల దానిని చదువజాలకపోతిని. కాని జెయిలులో గుజరాతీ యనువాదమును చదివితిని. దీనిని చదివినపిమ్మట గీతను

గుఱించి, అధికముగా చదువవలయునను వాంఛ కలిగెను. గీతకు సంబంధించిన యనేకగ్రంథములను తిరుగ వైచితిని.

క్రీ. శ. 1888-89 సంవత్సరంలో ఎడ్విన్ ఆర్నాల్డు గారి పద్యానువాదముచే గీతాపరిచయము కలిగినది. అందువలన గీతయొక్క గుజరాతీ అనువాదము చదువుటకు తీవ్ర వాంఛ కలిగెను. మఱియు లభించిన యనువాదముల నన్నింటిని చదివివైచితిని. కాని యీపఠనమువలన నా యనువాదమును లోకమునెదుట బెట్టునంతటి యోగ్యత నాకు కలుగలేదు. ఇదిగాక నాకు సంస్కృతభాషాజ్ఞానమల్పము. విద్వత్తునుపట్టి చూచినచో గుజరాతీజ్ఞానముకూడ యేమియును లేదు. అయితే నేననువదించుటకేల సాహసించితిని?

నేను గీతను బోధచేసికొన్న విధముగ నాచరించుటకై నేనును నాతోనుండు కొందఱును సక్రమముగాను తఱుచుగాను ప్రయత్నించుచుంటిమి. గీతమాకొక ఆధ్యాత్మిక నిదానగ్రంథము. దానిప్రకార మాచరించుటలో ప్రతిదినము, మాకు విఫలతయే కలుగుచున్నది. విఫలతయందు సైతము మాప్రయత్నములట్లేయుండును. ఈ విఫలతయందే సఫలతయొక్క ఉదయకిరణములు సుప్రకాశితములై పొడగట్టుచుండెను. ఇట్లు ప్రయత్నించు మాచిన్న సంఘము, ఏయర్థమును నిజాచరణమున వ్యక్తపరచుచున్నదో ఆయర్థమే యీ యనువాద మందుఁగలదు. స్త్రీలు, వైశ్యులు, శూద్రులు, ఇట్టి అక్షరజ్ఞానము లేనివారికొఱకును, మూలసంస్కృతమందు గీతను తెలిసికొనుటకు సమయముగాని వాంఛగాని లేనివారి

కొఱకును, అయినను గీతాసాహాయ్యము మాత్రి మావశ్య కమై యున్నవారికొఱకును, ఈయనువాద మక్కఱకు వచ్చును. గుజరాతీ భాషాజ్ఞానము నాకు స్వల్పమేయున్నను దాని సహాయ్యమున, నావద్దనున్న మూలధనమును, గుజ రాతీకిచ్చి పోవలయునను గాఢవాంఛ సదానాకుండెను. మలినసాహిత్య ప్రవాహము వేగముగ బారుచున్న యీ దినములలో హిందూధర్మ మందద్వితీయముగ నెంచబడిన యీ గ్రంథముయొక్క సులభానువాదము గుజరాతీలకు లభింపవలెననియు, దానివలన వారా ప్రవాహము నెదుర్కొను శక్తిని పొందవలెననియు దృఢసంకల్పము నాకు మిక్కిలి గలదు. ఈ నాయభిలాషయందు ఇతర గుజరాతీ యనువాద ములను తిరస్కరించు భావములేదు. అవియన్నియు నుచిత స్థానములందే యుండనిండు. కాని వానివిషయములో అను వాదకులకు ఆచరణానుభవమున్నట్లు నాకు తోచదు. నా యీ యనువాదమునకు వెనుక 38 సంవత్సరముల యాచర ణానుభవము కలదు. కాబట్టి ధర్మమును ఆచరణలోనికి తె చ్చు కోర్కెగల ప్రతిగుజరాతీ సోదరుడును, సోదరియు దీనిని చదివెదరుగాకయనియు, విచారింతురుగాకయనియు, దానిచే శక్తినార్జింతురుగాక యనియు నేను కోరుచున్నాను.

ఈ యనువాదమందు నాస్నేహితుల శ్రమయును గలదు. నాకుగల సంస్కృతజ్ఞానము కడుస్వల్పమగుటచే శబ్దార్థములందు నాకు నిండునమ్మకము లేకుండెను. కేవల మీకారణమువలననే యీ యనువాదమును, వినోబా,

కాకాకాలేల్కరు, మహాదేవదేశాయి, కిశోరీలాల్ మశరూవాలా, అనువారు సహకరించి యున్నారు.



౨

ఇంక గీతావిషయమును తెలిపెదను.

క్రీ. శ. 1888-89 సంవత్సరములో మొదటిసారి నేను గీతను చదివినప్పుడే యిదియొక యైతిహాసిక గ్రంథము కాదనియు భౌతికయుద్ధ వ్యాజమున ప్రతిమనుష్యుని హృదయమునందు నిరంతరము జరుగు ద్వంద్వయుద్ధముయొక్క వర్ణనమే యందు కలదనియు, మానవయుద్ధరచన, అంతర్యుద్ధమును స్ఫుటపరచుటకై చిత్రించిన కల్పనయనియు నూహించితిని. ధర్మమునుగూర్చియు గీతనుగూర్చియు, దీర్ఘవిచారణ సలిపిన పిమ్మట మొదటి యూహయే దృఢపడెను. మహాభారతము చదివినపిమ్మట ఆయూహ మఱింత బలపడెను. నేను మహాభారతమును ఇతిహాసమని భావింపజాలను. దీనికి ప్రబల ప్రమాణములు ఆదిపర్వమునందే యున్నవి. పాత్రల అమానుషము, అతిమానుషమునగు యుత్పత్తినిగూర్చి వర్ణించి వ్యాసభగవానుడు పాలకపాలితుల యితిహాసమును విధ్వంసము చేసినాడు. అందు వర్ణితములైన పాత్రలు నిజమునకైతిహాసికములే కావచ్చును. కాని వ్యాసభగవానుడు ధర్మమును

ప్రదర్శించు నిమిత్తమే వానిని మహాభారతమునందుపయో గించి యున్నాడు.

మహాభారత గ్రంథకర్త భౌతిక యుద్ధావశ్యకతను సిద్ధాంతము చేయలేదు. దాని నిరర్థకతనే సిద్ధాంతముచేసి యున్నాడు. విజేత నేడ్పించినాడు. పశ్చాత్తాపతప్తుని చేసినా డు. వానికై దుఃఖముతప్ప మఱేదియు మిగల్చలేదు.

ఈమహాగ్రంథములో భగవద్గీత శిరోమణివలె రాజి ల్లుచున్నది. గీతయొక్క రెండవయధ్యాయము భౌతిక యుద్ధ మును బోధించుటకుమారు స్థితప్రజ్ఞుని లక్షణములు బోధించు చున్నది. స్థితప్రజ్ఞునకు భౌతికయుద్ధముతో ఎట్టిసంబంధమును లేదని ఆతని లక్షణములవలన నాకు బోధపడినది. సాధారణ కుటుంబ కలహములయందు మంచిచెడ్డల నిర్ణయించుటకై గీతవంటి గ్రంథము విరచితమగుట యసంభవము.

మూర్తివంతమగు శుద్ధసంపూర్ణజ్ఞానమే గీతాకృష్ణుడు. కాని కల్పితుడు. ఇట్లనుట కృష్ణుడనుపేరుగల యవతారపురు షుని నిషేధించుటకాదు. కేవల సంపూర్ణకృష్ణుడు కల్పితుడు. పిమ్మట సంపూర్ణావతార మారోపించిరి.

శరీరధారియగు పురుషవిశేషుని నవతారమందురు. ప్రతిజీవియు నీశ్వరావతారమే. కాని లోకవ్యవహారమున జీవులనన్నింటిని యనతారములనరు. తనయుగమందెల్లరకంటె పరమధార్మికుడైన వానినే భావిప్రజ అవతారమని పూజిం తురు. ఇందునాకేమియు దోషమగుపడదు. దీనిమూలమున ఈశ్వరమహిమ కెట్టిలోటుగాని సత్యమునకెట్టి హానిగాని

కలుగవు. "ఆదమ్ దేవుడు కాడు; కాని దేవుని తేజస్సునకాదము బిడ్డ కాడు" (యూహాన్సుదీయ మతప్రకారమును, క్రైస్తవ మతప్రకారమును సృష్ట్యాదియందు మనుష్యునిచే నిర్మింపబడిన ప్రథమపురుషుడు ఆదమ్అనువాడు) తనయుగమందందఱు సంపాదించిన ధర్మజ్ఞాన మెవ్వనియందుగలదో వానినే సంపూర్ణావతారమందురు. ఈ భావము ననుసరించియే కృష్ణుడును సంపూర్ణావతారము హిందూధర్మమందు నేడు సామ్రాజ్యమనుభవించుచున్నది. ఈ దృశ్యము మనుష్యుని అంతిమ సుఖాభిలాషను చూపించును. ఈశ్వరరూపుడు కానంతవఱకు మనుష్యునకు సమాధానము కుదరదు. శాంతి కలుగదు. ఈశ్వరరూప సంప్రాప్తికై ప్రయత్నించుటయే సత్యమగు కేవల పురుషార్థము. ఇదియే ఆత్మదర్శనము. ఈ ఆత్మదర్శనము సకలధర్మగ్రంథములయందువలెనే గీతయందు సైతము ప్రధానవిషయమై యున్నది. గీతాకారుడీ విషయమును ప్రతిపాదించు నిమిత్తము గీతరచించలేదు. ఆత్మార్థికాత్మ దర్శనముకొఱకు అద్వితీయోపాయమును చూపుటయే గీతయొక్క ముఖ్యోద్దేశ్యము. హిందూధర్మ గ్రంథముల యందస్పష్టముగనే ధర్మమగుపడుచున్నదో ఆధర్మమునే గీత యనేక రూపములతో, అనేకశబ్దములతో, పునరుక్తిదోషమును స్వీకరించి బాగుగా స్థాపించినది.

ఆఅద్వితీయోపాయమే కర్మఫలత్యాగము.

ఈమధ్య బిందువుచుట్టును గీతయంతయు నిర్మితమైనది. భక్తి, జ్ఞానము మున్నగునవి దానిచేరువను తారామండలముల

వలె నలంకృతములైనవి. దేహమున్నచోట కర్మయుండనే యుండును. దానినుండి ముక్తిపొందినవారులేరు. ఇట్లున్నను దేహమును ప్రభుమందిరముగ భావించి దానివలన ముక్తి పొంద వచ్చునని సకలధర్మములును ప్రతిపాదించుచున్నవి. కాని కర్మయున్నప్పు డందేదోయొక దోషముండకమానదు. ముక్తి నిర్దోషికే కదా లభించును. అట్లయినచో కర్మబాధనము నుండి లేక దోషస్పర్శమునుండి ముక్తి కలుగుటయెట్లు? ఈ ప్రశ్నకు, నిష్కామకర్మచేత, యజ్ఞార్థము కర్మలుచేసి, కర్మ ఫలత్యాగమొనర్చి, సమస్తకర్మలను కృష్ణార్పణమొనరించి అనగా మనోవాక్కాయకర్మలను పరమేశ్వరునియందు హోమముచేసి" అని నిశ్చయాత్మక శబ్దములతో గీత ప్రత్యుత్తర మిచ్చియున్నది.

నిష్కామబుద్ధి, కేవలకర్మఫలత్యాగమేయని పల్క నంతమాత్రమున సిద్ధించునదికాదు. ఇది బుద్ధివలననే యగు నదికాదు. హృదయమథనమువలననే యిది యుత్పన్నమగు చున్నది. ఈత్యాగశక్తిని సంపాదించుటకై జ్ఞానమవసరము. అనేక పండితులయందొక విధమగు జ్ఞానముకలదు. వారికి వేదాములు కంఠస్థములైయుండును. కాని వారియందధిక సంఖ్యాకులు భోగలాలసులై యుందురు. జ్ఞానము కేవల శుష్కపాండిత్యముగ మారిపోవునేమోయని తలచి గీతాకారుడు జ్ఞానముతో భక్తినిచేర్చి దానికి ప్రథమస్థాన మిచ్చియున్నాడు. భక్తివినా జ్ఞానము హానికరము కాబట్టియే "భక్తిచేయుము. జ్ఞానము లభించితీరును" అని పల్కెను. కాని భక్తిసులభ

సాధ్యముకాదు. ఈకారణముచేతనే గీతాకారుడు స్థితప్రజ్ఞుని లక్షణములే భక్తునివిషయమున వర్ణించియున్నాడు. తాత్పర్య మేమన, గీతాభక్తి బాహ్యాచారముకాదు. గుర్తింతనముతో కూడిన శ్రద్ధకాదు. గీతయందు తెల్పిన యుపచారములకును, బాహ్యచేష్టలకు అనగా క్రియలకును సంబంధమేమియును లేదు. జపమాల, తిలకము, అర్ఘ్యము మున్నగుసాధనముల బాగుగానుపయోగించుకొననిమ్ము. అవిమాత్రము భక్తికి లక్షణములుకావు. ఎవ్వడితరులను ద్వేషింపడో, ఎవ్వడు కరుణకు నిధియో ఎవ్వనికహంకారమమకారములు లేవో, ఎవ్వనికిసుఖ దుఃఖములును, శీతోష్ణములును సమములైయున్నవో ఎవ్వడు క్షమాశీలుడైయుండునో, ఎవ్వడు నిత్యసంతుష్టుడైయుండునో ఎవ్వని నిశ్చయము మార్పునొందనిదై సదాయేకరీతి నుండు నో, ఎవ్వడు మనోబుద్ధుల నీశ్వరార్పణము చేసియున్నాడో, ఎవ్వనికిలోకము భయపడదో లోకమున కెవ్వడు భయపడ డో, ఎవ్వడు హర్షశోకభయాదులనుండి ముక్తుడైయుండునో, ఎవ్వడు పవిత్రుడైయున్నాడో, ఎవ్వడు శుభాశుభములను త్యజించి యున్నాడో, ఎవ్వడు శత్రుమిత్రులయందు సమభా వమును కలిగియున్నాడో, ఎవడు మానావమానములయందు సముడైయుండునో, ఎవ్వడు భూషణవలన సంతోషమును దూషణవలన దుఃఖమును పొందకుండునో, ఎవ్వడు మౌన ధారియై యుండునో, ఎవ్వడేకాంతవాస మపేక్షించునో, ఎవ్వడు స్థిరబుద్ధికలిగియుండునో, వాడు భక్తుడు. ఈ భక్తి ఆసక్తులగు స్త్రీపురుషుల హృదయమందు జనింపదు.

ఇవ్విధమున మనకు ఆత్మదర్శనమనగా జ్ఞానమును పొందుటయు, భక్తుడగుటయు మాత్రమేయని తోచుచున్నది. ఆత్మదర్శనము భక్తిజ్ఞానములకు భిన్నమైనదికాదు. ఒక్క రూపాయితో రూపాయి విలువగల విషమును అమృతమును కొనజాలనట్లు భక్తి, లేక, జ్ఞానముచే బంధమోక్షములు రెంటిను లభింపజాలవు. ఇచట సాధనసాధ్యములు పొత్తిగా నొకటి కాకపోయినను దాదాపు ఒకేవస్తువయని యన వచ్చును. సాధనముయొక్క పరాకాష్టయే మోక్షము. మోక్షమునకు గీతార్థము పరమశాంతి.

కాని యిట్టిభక్తిజ్ఞానములు కర్మఫలత్యాగమను గీటు రాయిపై పెట్టవలసియుండును. లౌకికదృష్టికి శుష్కపండితుడు జ్ఞానియనియే తోచును. వాడేకార్యమును చేయ జాలడు. చెంబు చేతితో నెత్తుటయు వానికి కర్మబంధమే. యజ్ఞశూన్యుని జ్ఞానిగా నెంచుచోట చెంబెత్తుటవంటి యల్ప లౌకిక క్రియకు స్థానమెట్లు లభించును? లౌకికదృష్టియందు భక్తుడనగా మాలపట్టుకొని త్రిప్పుచు జపించు బాహ్యాచారి. (బాహ్యాచారమందు లీనుడై యదియే భక్తియని మనసా నమ్మువాడు). సేవాకర్మ చేసినమాత్రమున అతనిజపమాల తిరుగక నిలిచిపోవును. ఈ కారణముచేతనే ఆహారపానీయాది భోగముల ననుభవించు నప్పుడుమాత్రమే యాతడు తనచేతి నుండి జపమాలను విడుచును. తిరుగలి విసురుటకును, వ్యాధి గ్రస్తులకు సేవాశుశ్రూష చేయుటకును జపమాలనెన్నడును విడువడు.

ఈ రెండు తెగలను గీత ఇట్లు స్పష్టముగా తెలిపి నది. "కర్మను విడిచి యెవ్వడును సిద్ధిపొందలేదు. జనకాదులు సైతము కర్మవల్లనే జ్ఞానులైయుండిరి. అతంద్రితుడనై నేను సహాడ కర్మలు చేయకుందునేని లోకములు నశించిపోవును" ఇక లోకులవిషయమై చెప్పవలసిన దేమున్నది?

అయినను ఒకవైపున కర్మ బాధనరూపమై యున్నది. ఇది నిర్వివాదాంశము. రెండవవైపున దేహి ఇచ్ఛతోనేకాక అనిచ్ఛతోసైతము కర్మచేయుచుండును. శారీరిక మానసిక చేష్టలన్నియు కర్మలు. అట్లగుచో కర్మచేయుచున్నను, మను ష్యుడు బంధవిముక్తు డెట్లగును? నేనెఱిగినంతవఱకు ఈ సమ స్యను గీతపరిష్కరించిన విధముగా మఱియేధర్మగ్రంథమును పరిష్కరించి యుండలేదు. "ఫలాసక్తిని విడువుము. కర్మచే యుము." "ఆశారహితుడవై కర్మచేయుము" "నిష్కాము డవై కర్మచేయుము" అని గీతపల్కుచున్నది. ఈ గీతావాక్య ములు మఱపునకు రానివి. కర్మవిడచువాడు పతితుడగును. కర్మచేయుచున్నను దానిఫలము విడచువాడు ఊర్ధ్వగతి కేగును.

ఇక్కడ ఫలత్యాగికి త్యాగఫలము లభింపదని భావింప రాదు. గీతయందిట్టి భావమునకు స్థానములేదు. ఫలత్యాగ మనగా ఫలసంబంధమున ఆసక్తి లేకుండుట. వాస్తవమున ఫలత్యాగికి వేయింతల ఫలములభించును. గీతచెప్పు ఫలపరి త్యాగమందు అమితశ్రద్ధయొక్క పరీక్షకలదు. ఫలితమును గూర్చి విచారించువాని కర్మలు కర్తవ్యములు పలుసారులు

చెడిపోవును. వాని ధైర్యము తొలగిపోవును. దీనివలన వాడు క్రోధవశుడగును. పిదప చేయ తగని కార్యములు చేయ నారంభించును. ఒకకర్మనుండి మఱియొక కర్మకు ఆకర్మనుండి వేరొక కర్మకు ప్రవృత్తుడగుచుండును. ఫలితమును చింతించు వానిస్థితి విషయాంధునిస్థితివలె నగును. తుదకువాడు విషయ లోలునివలె సారాసారముల యొక్కయు న్యాయాన్యాయముల యొక్కయు వివేకమును విడిచి ఫలప్రాప్తికై తనకిష్టములగు సాధనములను గ్రహించి యవియే ధర్మములని విశ్వసించును.

గీతాకారుడు ఫలాసక్తి యొక్క దుష్ఫలితములనుండి అనాసక్తి యొక్క అనగా కర్మఫలత్యాగముయొక్క సిద్ధాంతమునుతీసి మిక్కిలి మనోరంజకమగు భాషయందు ప్రపంచము ముందు పెట్టినాడు. "ధర్మార్థములు రెండును పరస్పర విరుద్ధములు. "వాణిజ్యాది లౌకికవ్యవహారములందు ధర్మపాలనకు వీలు లేదు. అందు ధర్మమునకు స్థానముండజాలదు. ధర్మము కేవలము మోక్షము నిమిత్తమే యుపయోగించగలదు. ధర్మస్థానమందు ధర్మమును, అర్థస్థానమందు అర్థమును రాణించుచున్నవి" అని సాధారణముగా భావింతురు. ఈ భ్రాంతిని గీతాకారుడు తొలగించెనని నా అభిప్రాయము. మోక్షమునకును వ్యవహారమునకును మధ్యనిట్టి భేదముంచలేదు. మీదుమిక్కిలి ధర్మమును వ్యవహారమందు పర్యవసన్నము చేసెను. వ్యవహారమున కుపయోగపడని ధర్మము ధర్మము కాదనుట గీతాభిప్రాయమని నానమ్మిక. అనగా గీతామతాను

సారము ఆసక్తి లేకుండ చేయ వీలులేని కర్మములన్నియు త్యాజ్యములు. ఇట్టి సువర్ణ నియమమనేక ధర్మసందేహముల నుండి మానవుని రక్షింపగలదు. ఈ మతానుసారము హత్య అసత్యము వ్యభిచారము మున్నగు కర్మలు వానియంతట నవియే త్యాజ్యములైపోవును. మానవజీవితము సరళమగును. సరళత్వమందు శాంతి యుదయించును. పరిణామ విషయమున నుపేక్షించుటయు ఫలత్యాగమున కర్థము కానేరదు. మొదట పరిణామము, సాధనము అను రెంటినిగూర్చి విచారించుటయు, తత్సంబంధమగు జ్ఞానముకలిగియుండుటయు మిక్కిలి యావశ్యకము. పిమ్మట పరిణామాపేక్ష లేనివాడై సాధనమందు తన్మయుడై యుండుచో వాడు ఫలపరిత్యాగియగును.

ఇట్లు విచారించుచు పోగాపోగా గీతాశిక్షను కార్యరూపమున పర్యవసన్నము చేయువాడు, తాను స్వయముగా సత్యమును అహింసను పాలించవలసి యుండునని నాకు తోచినది. ఫలాపేక్ష లేనపుడు మనుష్యుడు అసత్యమాడుటకుగాని హింసించుటకుగాని పూనుకొనడు. ఏహింసా కార్యమైనను ఏఅసత్యకార్యమైనను పరీక్షించి చూచితిమేని వానివెనుక పరిణామాసక్తి తప్పక యుండితీరును. అయినను అహింసా ప్రతిపాదనము గీతావిషయముకాదు; గీతాకాలమునకు పూర్వమునైతము అహింసను పరమధర్మమని భావించుచుండెడివారు. అనాసక్తి సిద్ధాంతమును గీత ప్రతిపాదించవలసి యుండవలెను. రెండవ యధ్యాయమునందే యీ విషయము స్పష్టము కాగలదు.

కాని అహింస గీతకు మాన్యమైయున్నను అనాసక్తి యందు సహజముగ నహింసాధర్మ మిమిడియున్నను, గీతా కారుడు భౌతిక యుద్ధమును, ఉదాహరణార్థమైనను, ఏల తీసి కొని యున్నాడు? గీతాయుగమునందహింసాధర్మ మంగీకృతమైయున్నను, భౌతికయుద్ధమొక సామాన్యవిషయముగ నుండుటచే గీతాకారుడట్టియుద్ధము, నుదాహరణముగ దీసి కొనుటకు సంకోచించియుండ లేదు-సంకోచించుట కవకాశమే లేకుండెను.

కాని ఫలత్యాగ మహిమాపరిమాణమును నిశ్చయించునపుడు గీతాకారుని మనస్సునందేయే భావములుండెను? అహింసాగౌరవమున కతడే స్థానము నిశ్చయించి యుండెను? అను నీయంశములనుగూర్చి మనము విచారింపవలసిన యవసరము లేదు. మహత్వసిద్ధాంతములను, కవి ప్రపంచము ముందుంచుచున్నాడు. అంతమాత్రముచేత నాకవి, సదా, తాను వెల్లడించిన సిద్ధాంతముల మహిమను బాగుగా గ్రహించియున్నాడనిగాని గ్రహించినపిదపనే వానినన్నిటిని భాషాబద్ధ మొనరింపగలుగు చున్నాడనిగాని యర్థము చేసికొనరాదు. ఇందు కవియొక్కయు కావ్యముయొక్కయు మహిమ కలదు. కవియొగ్క అర్థమునకంతము లేదు. మనుష్యులవలెనే మహావాక్యముల యర్థమును వికసించుచునే యుండును. భాషాచారిత్రమును పరిశోధించి చూచితిమేని, యనేకములగు గొప్పశబ్దముల యర్థములు నిత్యము నవీనములగుచుండునని మనకు బోధపడగలదు. గీతార్థసంబంధమందుసైతము ఈ

ప్రతిచోటఁ బట్టికొనినది. గీతాయుగమునకు ముందొకానొకప్పుడు యజ్ఞములందు పశుహింసన మాన్యమైయుండినను గీతాయజ్ఞములందా హింసాప్రసక్తియైనఁ గానరాదు. గీతయందలి యజ్ఞములన్నిటిలో జపయజ్ఞము రాజు. పరోపకారమునకు శరీరమును కూడ వినియోగపరచుటయే యజ్ఞశబ్దమునకు ముఖ్యమగు నర్థమని మూడవయధ్యాయము తెలుపుచున్నది. మూడవ నాల్గవ యధ్యాయములు కలిసి మరికొన్ని వ్యాఖ్యలు చేయవచ్చును కాని పశుహింసా సమర్థనము చేయుటకు వీలు లేదు. గీతయందలి సన్న్యాసశబ్దమున కర్థము చేయు విషయమందును ఇట్టి చిక్కులు కలవు. గీతయందలి సన్న్యాసము కర్మత్యాగమంగీకరింపదు. గీత తెలుపు సన్న్యాసి అతికర్మియయ్యు నతఁడకర్మకుడైయున్నాడు. ఇట్లు గీతాకారుడు మహాశబ్దములకు వ్యాపకార్థము చేయుట మనకు నేర్పియున్నాడు. గీతాకారుని భావాక్షరములచే సంపూర్ణకర్మఫలత్యాగి భౌతికయుద్ధము చేయవచ్చునని బాగుగ దోచవచ్చును. కాని గీతాశిక్షను పూర్ణరూపమున, ఆచరణలోనికి తెచ్చుటకై, సుమారు 40 సంవత్సరము లెడతెగక ప్రయత్నించిన నాకు సత్యమును అహింసను పూర్ణరూపమున పాలించనిదే సంపూర్ణకర్మఫలత్యాగము మానవునకసంభవమనితోచినది.

గీత సూత్రగ్రంథముకాదు. గీత యొక మహాధర్మకావ్యము. అందు మీరు లోతుగదిగినకొలదియు క్రొత్త క్రొత్త సొగసైన యర్థములెన్నియో లభించును. గీత సకల జనులకు సంబంధించినది. దానియందొకే విషయ మనేకవిధ

ముల జెప్పబడినది. కావున గీతయందలి మహాశబ్దముల యర్థములు ప్రతియుగమందు మారుచు విస్తృతములగుచుండును. గీతయొక్క మూలమంత్రము మాత్రమెప్పుడును మారజాలదు ఆమంత్రము సిద్ధించురీతిని జిజ్ఞాసువులు తమకుతోచెడి యర్థమును చేసికొనవచ్చును.

గీత విధి నిషేధములను తెలుపునదికూడ కాదు. ఒకనికి విహితమైనది వేరొకనికి, నిషిద్ధముకాగలదు. ఒక సమయమందు విహితమైనది మఱియొక సమయమందును, ఒక దేశమందు విహితమైనది మఱియొక దేశమందును నిషిద్ధముకావచ్చును. నిషిద్ధము కేవలఫలాసక్తి విహితము. కేవలమనాసక్తి.

గీతయందు జ్ఞానమహిమ సురక్షితమైయున్నది. అట్లయ్యు గీతబుద్ధికగమ్యమైనది. హృదయగమ్యమగుటవలన నది అశ్రద్ధగలవారి కొఱకుకాదు. గీతాకారుడే యిట్లుచెప్పెను.

"తపస్వికానట్టియు భక్తుడుకానట్టియు, వినుకోర్కెలేనట్టియు నన్ను ద్వేషించునట్టియు మనుష్యునకు నీవిది (జ్ఞానము) యెప్పుడును చెప్పరాదు" అ. 18, శ్లో. 67.

"కాని యీ పరమరహస్య జ్ఞానమును నాభక్తులకిచ్చువారు నాయందలి పరమభక్తివలన నిస్సందేహముగా నన్ను బడయగలరు" అ. 18, శ్లో. 68.

"మఱియు నేమనుష్యుడు ద్వేషములేనివాడై శ్రద్ధా పూర్వకముగా కేవల మాలకించునో వాడును ముక్తుడై పుణ్యాత్ములు వసించు శుభలోకమును పొందును"

అ. 18, శ్లో. 71.

కౌసాని
౧౯౮౬ ఆషాఢమాస కృష్ణపక్ష
ద్వితీయా సోమవారము
24—6—29

—మోహనదాసు
కరంచందు గాంధి.





# అనాసక్తియోగము

## అర్జున విషాదయోగము.

### ప్రథమాధ్యాయము.



జిజ్ఞాస వినాజ్ఞానముకలుగదు. దుఃఖమువినా సుఖము ప్రాప్తించదు. ధర్మసందేహము-హృదయమథనము సమస్త జిజ్ఞాసువుల కొకసారి తప్పక కలుగుచుండును.

ధృతరాష్ట్రఉవాచ—

శ్లో. ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః,
మామకాః పాండవాశ్చైవ కి మకుర్వత సంజయ. 1

ధృతరాష్ట్రుడు పల్కుచున్నాడు-సంజయా, ధర్మక్షేత్రమగు కురుక్షేత్రమున యుద్ధముచేయుకాంక్షతో కూడుకొనిన నాపుత్రులు, పాండుపుత్రులు నేమిచేసిరో నాకు తెలుపుము.

వ్యాఖ్యానము-ఈశరీరమను క్షేత్రము ధర్మక్షేత్రము. ఎందుకనగా నిది మోక్షమునకు ద్వారముకాగలదు. ఇది పాపమునుండి పుట్టినది. పాపభాజనమే యగుచున్నది. కావున నే యిది కురుక్షేత్రము. కౌరవులనగా ఆసురప్రవృత్తులు. పాండవులనగా దివ్యప్రవృత్తులు. ప్రతిశరీరమందును మంచి వృత్తులకును చెడ్డవృత్తులకును యుద్ధము జరుగుచునే యుండును. ఇది యెల్లరకు విదితమే.

సంజయ ఉవాచ—

దృష్ట్వాతు పాండవానీకం వ్యూఢం దుర్యోధన స్తదా,
ఆచార్య ముపసంగమ్య రాజా వచన మబ్రవీత్. 2

సంజయుడనుచున్నాడు-ఆసమయమున వ్యూహముగ సమర్చబడిన పాండవసైన్యమునుచూచి ధుర్యోధనరాజు ద్రోణాచార్యునివద్దకేగి యిట్లనెను.

పశ్యైతాం పాండుపుత్రాణామాచార్యమహతీంచమూమ్
వ్యూఢాం ద్రుపదపుత్రేణ తవ శిష్యేణ ధీమతా. 3

ఆచార్యా, బుద్ధిమంతుడగు తమశిష్యుడు ద్రుపదపుత్రుడునైన ధృష్టద్యుమ్నునిచే వ్యూహబద్ధమైన పాండవుల యీ గొప్పసైన్యము చూడుడు.

అత్రశూరా మహేష్వాసా భీమార్జున సమాయుధి,
యుయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః. 4

ఇంకను, యుద్ధముచేయుటలో భీమార్జునులతో సమానులైన శూరవీరులు, ధనుర్ధరులునగు యుయుధానుడు (సాత్యకి), విరాటుడు, మహారథుడగు ద్రుపదుడు.

ధృష్టకేతు శ్చేకితానః కాశీరాజశ్చ వీర్యవాన్,
పురుజి త్కుంతిభోజశ్చ శైబ్యశ్చ నరపుంగవః. 5

ధృష్టకేతువు, చేకితానుడు, వీర్యవంతుడగు కాశీరాజు, పురుజిత్తు, కుంతిభోజుడు, నరపుంగవుడగు శైబ్యుడు

యుధామన్యుశ్చ విక్రాంత ఉత్తమౌజాశ్చ వీర్యవాన్,
సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వఏవ మహారథాః. 6

ఇట్టి పరాక్రమమేగల యుధామన్యుడు, బలవంతుడగు నుత్తమౌజుడు సుభద్రాపుత్రుడు (అభిమన్యుడు) మఱియు ద్రౌపదీపుత్రులు, మున్నగు వీరందఱు మహారథులే యయి యున్నారు

అస్మాకంతు విశిష్టాయే తాన్నిబోధ ద్విజోత్తమ,
నాయకా మమసైన్యస్య సంజ్ఞార్థం తాన్ బ్రవీమి తే. 7

ఓద్విజశ్రేష్ఠా, ఇక మనపక్షమందున్న ముఖ్యనాయకులను మీరు తెలిసికొనుడు. మనసేనా నాయకుల నామములను, జ్ఞాపకార్థము మీకు చెప్పుచున్నాను

భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితింజయః
అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తి స్తథైవచ. 8

మీరొకరు, భీష్ముడు, కర్ణుడు, యుద్ధమున జయమొందు కృపాచార్యుడు, అశ్వత్థామ, వికర్ణుడు, మఱియు సోమదత్తుని కొడుకగు భూరిశ్రవుడు

అన్యేచ బహవ శ్శూరా మదర్థే త్యక్తజీవితాః,
నానా శస్త్రప్రహరణా స్సర్వే యుద్ధవిశారదాః. 9

ఇంకను నాకొఱకు ప్రాణముల నర్పించువారై, నానా విధ శస్త్రములతో యుద్ధముచేయు నితరశూరు లనేకులు గలరు. వారందఱును యుద్ధమందు ప్రవీణులై యున్నారు.

అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితమ్,
పర్యాప్తం త్విద మేతేషాం బలం భీమాభిరక్షితమ్. 10

భీష్మరక్షితమగు మన సేనాబల మపూర్ణము. కాని భీమరక్షితమగు వారిసేనాబలము పూర్ణము.

అయనేషుచ సర్వేషు యథాభాగ మవస్థితాః,
భీష్మమేవాభిరక్షంతు భవంత స్సర్వఏవహి. 11

కావున మీరెల్లరును మీమీస్థానములయందు నిలిచి యన్నిమార్గములనుండియు భీష్మపితామహుని బాగుగా కాపాడెదరుగాక! (అని దుర్యోధనుడనెను)

తస్య సంజనయన్ హర్షం కురువృద్ధః పితామహః
సింహనాదం వినద్యోచ్చైశ్శంఖం దధ్మౌ ప్రతాపవాన్. 12

అప్పుడాతని కానందమును గలుగజేయుచు, కురువృద్ధుడును ప్రతాపశాలియునగు పితామహుడు బిగ్గరగా సింహనాదముచేసి శంఖము పూరించెను

తత శ్శంఖాశ్చ భేర్యశ్చ పణవానకగోముఖాః,
సహసైవాభ్యహన్యంత సశబ్ద స్తుములోఽభవత్. 13

అనంతరము, శంఖములు, నగారాలు, డోళ్లు, మృదంగములు, రణభేరులు, ఒక్కసారిగ మ్రోగెను. ఈ ధ్వని భయంకరముగ నుండెను

తతశ్శ్వేతై ర్హయైర్యుక్తే మహతి స్యందనే స్థితౌ
మాధవః పాండవశ్చైవ దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః. 14

ఇంతలో తెల్లగుఱ్ఱముల పెద్దరథముపై గూర్చుండి యున్న కృష్ణార్జునులు దివ్యశంఖములు పూరించిరి

పాంచజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః,
పౌండ్రం దధ్మౌ మహాశంఖం భీమకర్మా వృకోదరః 15

శ్రీకృష్ణుడు పాంచజన్యమను శంఖమును పూరించెను. ధనంజయుడగు నర్జునుడు దేవదత్తమను శంఖమును పూరించెను. భయంకరకర్ముడగు భీముడు పౌండ్రమను మహాశంఖమును పూరించెను.

అనంతవిజయం రాజా కుంతీపుత్రో యుధిష్ఠిరః,
నకుల స్సహదేవశ్చ సుఘోషమణిపుష్పకౌ. 16

కుంతీపుత్రుడగు యుధిష్ఠిర మహారాజు అనంతవిజయమను శంఖమును పూరించెను. నకులుడు సుఘోషమను శంఖమును సహదేవుడు మణిపుష్పకమను శంఖమును పూరించిరి.

కాశ్యశ్చ పరమేష్వాసః శిఖండీచ మహారథః,
ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకి శ్చాపరాజితః. 17
ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీపతే,
సౌభద్రశ్చ మహాబాహుశ్శంఖాన్ దధ్ముః పృథక్పృథక్. 18

మహాధనుర్ధరుడగు కాశీరాజు, మహారథుడగు శిఖండి, ధృష్టద్యుమ్నుడు, విరాటరాజు, అజేయుడగు సాత్యకి, ద్రుపదరాజు, ద్రౌపదీకుమారులు, సుభద్రాపుత్రుడు మహాబా

పాండునకు నభిమన్యుడు, మున్నగువారందఱును ఓరాజా, తమతమ శంఖములను పూరించిరి

స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్,
నభశ్చ పృథివీంచైవ తుములో వ్యనునాదయన్. 19

భూమ్యాకాశముల ప్రతిధ్వనింపజేయు నాభయంకర నాదము కౌరవుల హృదయములను భేదింపజేసెను.

అథ వ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః,
ప్రవృత్తే శస్త్రసంపాతే ధను రుద్యమ్య పాండవః 20
హృషీకేశం తదావాక్య మిదమాహ మహీపతే.

అర్జున ఉవాచ.

సేనయో రుభయోర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత. 21
యావదేతాన్ నిరీక్షేఽహం యోద్ధు కామా నవస్థితాన్,
కైర్మయాసహ యోద్ధవ్య మస్మిన్ రణసముద్యమే. 22

రాజా, హనుమానుని తనధ్వజమందుగల యర్జునుడు యుద్ధసన్నద్ధులైయున్న కౌరవులనుచూచి, ఆయుధప్రయోగమునకై సిద్ధపడు సమయమున, ధనుస్సు నెక్కుపెట్టి, హృషీకేశునితో నిట్లనెను, "అచ్యుతా, నారథము రెండుసేనల మధ్య నిలుపుము"

దానివలన యుద్ధకాంక్షతో నిలిచియున్నవారిని చూచి యీ యుద్ధమున నేనెవరితో బోరవలయునో తెలిసికొందును.

యోత్స్యమానా నవేక్షేఽహం యఏతేఽత్రసమాగతాః,
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధే ర్యుద్ధేప్రియచికీర్షవః. 23

యుద్ధమందు దుష్టబుద్ధియగు దుర్యోధనునకు ప్రియము చేయు కోర్కెగలవారై కూడియున్న యోధులను నన్ను చూడనిమ్ము.

సంజయఉవాచ.

ఏవముక్తో హృషీకేశో గుడాకేశేన భారత,
సేనయో రుభయో ర్మధ్యే స్థాపయిత్వా రథోత్తమమ్. 24
భీష్మద్రోణప్రముఖత స్సర్వేషాంచ మహీక్షితామ్,
ఉవాచ పార్థ పశ్యైతాన్ సమవేతాన్ కురూనితి. 25

సంజయుడు చెప్పుచున్నాడు-రాజా, అర్జునుడు శ్రీకృష్ణునితో నిట్లు చెప్పగానే ఆయన రెండుసేనలమధ్యను, సకల రాజులయొక్కయు, భీష్మద్రోణులయొక్కయు నెదుట ఉత్తమ రథమును నిలిపి యిట్లనెను, "పార్థా, యీకూడియున్న కౌరవులను చూడుము"

తత్రాపశ్యత్ స్థితాన్ పార్థః పితౄ నథ పితామహాన్,
ఆచార్యాన్మాతులాన్ భ్రాతౄన్ పుత్రాన్ పౌత్రాన్సఖీంస్తథా 26
శ్వశురాన్ సుహృదశ్చైవ సేనయో రుభయోరపి,
తాన్ సమీక్ష్యసకౌంతేయ స్సర్వాన్ బంధూనవస్థితాన్ 27
కృపయా పరయావిష్టో విషీద న్నిద మబ్రవీత్,

అక్కడ యుభయసేనల యందున్న మిక్కిలి వృద్ధులను, తాతలను, గురువులను, మేనమామలను, సోదరులను, పుత్త్రులను, పౌత్త్రులను, మిత్రులను, మామలను, స్నేహితులను అర్జునుడు చూచెను. ఈబంధువులందరిట్లు నిలిచియుండంజూచి ఖేదముకల్గినందున దీనుడై కుంతీకుమారుడిట్లనెను.

అర్జున ఉవాచ.

దృష్ట్వేమం స్వజనం కృష్ణ యుయుత్సుం సముపస్థితమ్. 28

సీదంతి మమగాత్రాణి ముఖంచ పరిశుష్యతి,

వేపథుశ్చ శరీరే మే రోమహర్షశ్చ జాయతే. 29

అర్జునుడు చెప్పుచున్నాడు:-కృష్ణా, యుద్ధముచేయు కోర్కెతో కూడియున్న యీస్వజనులగు స్నేహితులను చూడగా నాయవయవములు శిథిలములగుచున్నవి. నోరెండిపోవుచున్నది. శరీరము కంపించుచున్నది. రోమములు గగుర్పొడుచుచున్నవి.

గాండీవం స్రంసతే హస్తాత్ త్వక్చైవ పరిదహ్యతే,

నచశక్నోమ్యవస్థాతుం భ్రమతీవచ మే మనః 30

హస్తమునుండి గాండీవము జారిపోవుచున్నది. మేను దహించుకొని పోవుచున్నది. నిలువజాలను. ఎందుకనగా నా మనస్సు చక్రమువలె తిరుగుచున్నట్లున్నది.

నిమిత్తానిచ పశ్యామి విపరీతాని కేశవ,

నచశ్రేయో ఽనుపశ్యామి హత్వా స్వజన మాహవే. 31

ఇదిగాక, కేశవా, విపరీతలక్షణములు చూచుచున్నాను. యుద్ధమందు స్వజనులను చంపుటచే నాకెట్టి శ్రేయస్సును కాన్పింపదు

నకాంక్షే విజయం కృష్ణ నచ రాజ్యం సుఖానిచ,

కింనో రాజ్యేన గోవింద కింభోగైర్జీవితేనవా. 32

వారినిచంపి విజయమపేక్షింపను. నాకు రాజ్యము

గాని సుఖముగాని అక్కర లేదు. గోవిందా, రాజ్యమెందుకు? భోగమెందుకు? బ్రదికియుండు టెందుకు?

> యేషా మర్థే కాంక్షితం నో రాజ్యం భోగా స్సుఖానిచ,
> తఇమేఽవస్థితా యుద్ధే ప్రాణాం స్త్యక్త్వా ధనానిచ. 33

> ఆచార్యాః పితరః పుత్రా స్తథైవచ పితామహాః,
> మాతులాః శ్వశురాః పౌత్రాః శ్యాలా స్సంబంధినస్తథా. 34

ఎవరికొరకు రాజ్యమును, భోగములను, సౌఖ్యములను మేము కోరవలసి యున్నదో, ఆయాచార్యులు, తండ్రులు, కుమారులు, పితామహులు, మేనమామలు, మామలు, పౌత్రులు, బావమఱదులు, బంధువులును ప్రాణముమీద ధనముమీద నాశవిడిచి యుద్ధముకొరకు నిలిచియున్నారు

> ఏతా న్న హంతు మిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన,
> అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః కింను మహీకృతే. 35

వారు నన్ను చంపుదురుగాక, లేక త్రిలోకరాజ్యము నాకు లభించుగాక, మధుసూదనా, నేను వారిని చంపదలచను. అట్టిచో నొక్క భూశకలమునకై వారినెట్లు చంపుదును.

> నిహత్య ధార్తరాష్ట్రాన్నః కాప్రీతి స్స్యాజ్జనార్దన,
> పాపమేవాశ్రయే దస్మాన్ హత్వైతా నాతతాయినః 36

జనార్దనా, ధృతరాష్ట్రపుత్రులను చంపుటచే నాకెట్టి యానందము కలుగును? వీరాతతాయులైనను వీరిని చంపుటచే మనకు పాపమేతగులును.

తస్మాన్నార్హావయం హంతుం ధార్తరాష్ట్రా న్స్వబాంధవాన్,
స్వజనంహి కథం హత్వా సుఖినస్స్యామ మాధవ. 37

కావున మాధవా, మనబాంధవులేయగు ధృతరాష్ట్రపుత్రులను మనము చంపుట యుచితముకాదు. స్వజనమునే చంపి మనమెట్లు సుఖులము కాగలము.

యద్యప్యేతే నపశ్యంతి లోభోపహతచేతసః
కులక్షయకృతందోషం మిత్రద్రోహేచ పాతకమ్. 38

కథం నజ్ఞేయ మస్మాభిః పాపా దస్మాన్నివర్తితుమ్,
కులక్షయకృతం దోషం ప్రపశ్యద్భి ర్జనార్దన. 39

లోభముచే మతిచెడినవారు కులక్షయము వలనకలుగు దోషమును, మిత్రద్రోహము వలనకలుగు పాపమును బాగుగా తెలిసికొనజాలరు, కాని, జనార్దనా, కులక్షయము వలన కలుగు దోషము నెఱుగు మనమీపాపమునుండి తప్పుకొనుట యేల యెఱుగము?

కులక్షయే ప్రణశ్యంతి కులధర్మా స్సనాతనాః,
ధర్మే నష్టే కులం కృత్స్న మధర్మోఽభి భవత్యుత. 40

కులక్షయమువలన సనాతనకుల ధర్మములు నశించును. ధర్మమునశించినంతనే యధర్మము కులము నావత్తును ముంచివేయును.

అధర్మాభి భవాత్కృష్ణ ప్రదుష్యంతి కులస్త్రియః,
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః. 41

కృష్ణా, అధర్మము వృద్ధియగుటచే కులస్త్రీలు దూషితలగుచున్నారు. వారు దూషితలగుటచే వర్ణసంకర మేర్పడుచున్నది.

సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్యచ,
పతంతి పితరో హ్యేషాం లుప్తపిండోదకక్రియాః. 42

ఇట్టి సంకరమువలన కులఘాతకులకును వారికులమునకును నరకవాసము కలుగును. మరియు పిండోదకక్రియలు లోపించుటచే వారిపితరులకు అధోగతి సంప్రాప్తించును.

దోషై రేతైః కులఘ్నానాం వర్ణసంకర కారకైః,
ఉత్సాద్యంతే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః. 43

కులఘాతకులయొక్క యీవర్ణసంకరమును కలిగించు దోషములవలన సనాతన జాతిధర్మములు, కులధర్మములు నాశమగుచున్నవి.

ఉత్సన్న కులధర్మాణాం మనుష్యాణాం జనార్దన,
నరకే నియతం వాసో భవతీ త్యనుశుశ్రుమ. 44

ఎవ్వని కులధర్మములు నశించునో ఆ మనుష్యున కవశ్యము నరకావాసముప్రాప్తించునని మనము వినుచున్నాము.

అహోబత మహత్పాపం కర్తుం వ్యవసితా వయమ్,
యద్రాజ్యసుఖలోభేన హంతుం స్వజన ముద్యతాః. 45

అయ్యో, ఎంతవిచారకరము! మనము మహాపాపము చేయబూనితిమి. అనగా రాజ్యసుఖలోభమున స్వజనులను జంప నుద్యుక్తులమైతిమి.

యది మామప్రతీకార మశస్త్రం శస్త్రపాణయః,
ధార్తరాష్ట్రా రణే హన్యుస్తన్మే క్షేమతరం భవేత్. 46

శస్త్రధారులగు ధృతరాష్ట్రపుత్రులు శస్త్రహీనుడనై యెదుర్కొనకయున్న నన్ను యుద్ధమందు చంపినను నాకొరకది మిక్కిలి శుభకరమేయగును.

సంజయ ఉవాచ.

ఏవముక్త్వాఽర్జునస్సంఖ్యే రథోపస్థ ఉపావిశత్,
విసృజ్య సశరం చాపం శోకసంవిగ్నమానసః. 47

సంజయుడు చెప్పుచున్నాడు:-ఇంతపల్కి రణభూమియందు శోకముచే వ్యాకులచిత్తుడై, ధనుర్బాణములువిడిచి, రథముయొక్క వెనుకతట్టు అర్జునుడు కూర్చుండెను.

ఓమ్ తత్సత్.

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగ
శాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే అర్జునవిషాద
యోగో నామ ప్రథమోఽధ్యాయః

ఈప్రకారము భగవద్గీత:-ఉపనిషత్ అనగా బ్రహ్మవిద్యాంతర్గత యోగశాస్త్రమందలి శ్రీకృష్ణార్జున సంవాదమందు అర్జునవిషాదయోగమను ప్రథమాధ్యాయము ముగిసినది.



# సాంఖ్యయోగము.

## ద్వితీయాధ్యాయము.



మోహావశుడై మనుష్యుడధర్మమును ధర్మముగ నెంచును. మోహముచేత నర్జునుడు స్వపర భేదమెంచెను. ఈ భేదము మిథ్యయని తెలుపుచు శ్రీకృష్ణుడు దేహాత్మల భిన్నత్వమును చూపుచున్నాడు. దేహముయొక్క యనిత్యత్వమును, పృథగత్వమును ఆత్మయొక్క నిత్యత్వమును, దాని ఏకత్వమును ఆయన తెలుపుచున్నాడు. మనుష్యుడు కేవలము పురుషార్థముల కేకాని తత్పరిణామముల కధికారి కాడు. కావున నాతడు తన కర్తవ్యమును నిశ్చయించుకొని నిశ్చింతగా, నందులగ్నమై యుండవలయును. ఇట్టి పరాయణత్వముచే నతడు మోక్షము పొందగలడు.

సంజయ ఉవాచ.

తం తథా కృపయావిష్ట మశ్రుపూర్ణాకులేక్షణమ్,
విషీదంత మిదంవాక్య మువాచ మధుసూదనః. 1

సంజయుడు చెప్పుచున్నాడు:-ఇవ్విధమున దయాన్వితుడై, కన్నీటితోనిండిన వ్యాకులనేత్రములు గలవాడై దుఃఖించుచున్న యర్జునునితో మధుసూదనుడీ వాక్యముపల్కెను

శ్రీ భగవానువాచ.

కుతస్త్వా కశ్మల మిదం విషమే సముపస్థితమ్,
అనార్యజుష్ట మస్వర్గ్య మకీర్తి కర మర్జున. 2

శ్రీభగవానుడు చెప్పుచున్నాడు:-అర్జునా, ఉత్తమ పురుషులకు తగనిదియు, స్వర్గవిముఖునిగా నుంచునదియు, అపకీర్తి దెచ్చునదియునగు నీమోహ మీవిషమగడియలయందు నీకెచ్చటనుండి దాపరించినది.

క్లైబ్యం మాస్మగమః పార్థ నైతత్త్వయ్యుపపద్యతే
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప! 3

పార్థా, నీవు నపుంసకుడవు కావలదు. ఇది నీకు తగియుండలేదు. నీచమగు హృదయదౌర్బల్యమును విడిచి, పరంతపా, లెమ్ము

అర్జున ఉవాచ:—

కథం భీష్మ మహం సంఖ్యే ద్రోణంచ మధుసూదన,
ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హా వరిసూదన. 4

అర్జునుడు చెప్పుచున్నాడు:-మధుసూదనా, భీష్మద్రోణులను రణభూమియందు బాణములచే నెట్లు కొట్టుదును? వీరు పూజనీయులుగదా

గురూనహత్వాహి మహానుభావాన్
శ్రేయోభోక్తుం భైక్ష్యమపీహ లోకే,
హత్వార్థ కామాంస్తు గురూ నిహైవ
భుంజీయ భోగాన్ రుధిరప్రదిగ్ధాన్. 5

మహాత్ములైన గురుజనులను చంపుటకుమారే లోకమందు భిక్షాన్నము భుజించుటయైనను మంచిది. ఎందుకనగా, గురుజనులను చంపినందువలన, రక్తసిక్తములగు నర్థకామాత్మకములగు భోగములే యనుభవింపవలసి యుండునుగదా?

న చైతద్విద్మః కతరన్నో గరీయో
యద్వా జయేమ యదివా నో జయేయుః,
యానేవ హత్వా న జిజీవిషామ
స్తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః. 6

మనము జయింపవలయునా లేక వారు మమ్ము జయింపవలయునా యను నీరెంటిలో నేదిమంచిదో నాకు తెలియదు. ఎవరినిచంపి బ్రదుకనొల్లనో యాధృతరాష్ట్ర పుత్రులిదిగో యెదుట నిలిచియున్నారు.

కార్పణ్యదోషోపహతస్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢచేతాః,
యచ్ఛ్రేయ స్స్యాన్నిశ్చితం బ్రూహి తన్మే
శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్. 7

కార్పణ్యదోషముచేత నాస్వభావ ముపహతమైనది. కర్తవ్యవిమూఢుడనైతిని. కావున దేనియందు నాశ్రేయస్సు కలదో దానిని నిశ్చయపూర్వకముగా నాకు చెప్పుము. నిన్ను ప్రార్థించుచున్నాను. నీశిష్యుడను. నీశరణు జొచ్చితిని. నాకు మార్గము చూపుము.

నహి ప్రపశ్యామి మమాపనుద్యా
ద్యచ్ఛోకముచ్ఛోషణ మింద్రియాణామ్,

అవాప్య భూమావసపత్న మృద్ధం
రాజ్యం సురాణా మపి చాధిపత్యమ్. 8

ధనధాన్య సంపన్నమగు నిష్కంటక రాజ్యమీలోకమున లభింపనిమ్ము. మఱియు నింద్రాసనము లభింపనిమ్ము. ఇంద్రియములను శోషింపజేయునా దుఃఖమును పోగొట్టగలదేదియు నందు నాకు గానరాదు.

సంజయ ఉవాచ:—

ఏవముక్త్వా హృషీకేశం గుడాకేశః పరంతప
నయోత్స్య ఇతి గోవింద ముక్త్వా తూష్ణీం బభూవహ. 9

సంజయుడు చెప్పుచున్నాడు:-రాజా, గుడాకేశుడగు నర్జునుడు హృషీకేశుడగు గోవిందునితో "నేను యుద్ధము చేయను" అనిపల్కి యూరకుండెను.

తమువాచ హృషీకేశః ప్రహసన్నివ భారత,
సేనయో రుభయో ర్మధ్యే విషీదంత మిదం వచః 10

భారతా, యీ రెండుసేనలమధ్య దుఃఖితుడై కూర్చుండియున్న యర్జునునితో నవ్వుచు హృషీకేశుడీ వచనము పల్కెను.

శ్రీభగవానువాచ:—

అశోచ్యా నన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే
గతాసూనగతాసూంశ్చ నానుశోచంతిపండితాః. 11

శ్రీభగవానుడు చెప్పుచున్నాడు:-నీవు శోకింపదగనివారిగూర్చి శోకించుచున్నావు. మఱియు పండితవాక్యములు

పల్కుచున్నావు. కాని పండితులు చచ్చినవారికొఱకును జీవించియున్నవారి కొఱకును దుఃఖింపరు.

న త్వేవాహం జాతునాసం నత్వం నేమే జనాధిపాః,
న చైవ నభవిష్యామ స్సర్వే వయ మతః పరమ్. 12

ఎందుకనగా, యదార్థముగ చూచితిమేని నేను, నీవు, లేక యీరాజులు ఒకప్పుడు లేనివారముకాము. ముందుండని వారముకాము

దేహినోఽస్మిన్ యథాదేహే కౌమారం యౌవనం జరా,
తథా దేహాంతరప్రాప్తి ర్ధీర స్తత్ర నముహ్యతి. 13

దేహికి శరీరమందు కౌమారము, యౌవనము, వార్ధక్యము ప్రాప్తించురీతిగనే వేఱొక దేహముకూడ ప్రాప్తించును. దానియందు బుద్ధిమంతుడగు పురుషునకు మోహము కలుగదు.

మాత్రాస్పర్శాస్తు కౌంతేయ శీతోష్ణసుఖదుఃఖదాః,
ఆగమాపాయినోఽనిత్యాస్తాం స్తితిక్షస్వ భారత. 14

కౌంతేయా, ఇంద్రియస్పర్శములు శీతోష్ణసుఖదుఃఖములను కలుగజేయునవి. అవి అనిత్యములు. వచ్చును. పోవును. వానిని సహింపుము.

యంహి నవ్యథయంత్యేతే పురుషం పురుషర్షభ,
సమదుఃఖసుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే. 15

పురుషశ్రేష్ఠుడా, సుఖదుఃఖములయందు సముడై యుండునే ధీమంతుని నీవిషయములు వ్యాకులపఱుప జాలవో

ఆతడు మోక్షార్హుడగుచున్నాడు.

నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః,
ఉభయోరపి దృష్టాంత స్త్వనయోస్తత్త్వదర్శిభిః 16

అసత్తునకస్తిత్వము లేదు. మఱియు సత్తునకు నాశనము లేదు. ఈరెంటి నిర్ణయమును జ్ఞానులు గ్రహించిరి.

అవినాశితు త ద్విద్ధి యేన సర్వ మిదం తతమ్,
వినాశ మవ్యయ స్యాస్య నకశ్చి త్కర్తు మర్హతి. 17

ఈసకలజగత్తు దేనిచే వ్యాప్తమైయున్నదో, అది అవినాశియని తెలియుము. ఈయవ్యయమును నాశముచేయుట కెవ్వడును సమర్థుడుకాడు.

అంతవంత ఇమే దేహా నిత్య స్యోక్తా శ్శరీరిణః,
అనాశినోఽప్రమేయస్య తస్మా ద్యుధ్యస్వ భారత! 18

నిత్యమై అనంతమై యవినాశియైయొప్పు దేహియొక్కయీదేహములు నశించునవని చెప్పుదురు. కావున భారతా యుద్ధము చేయుము.

య ఏనం వేత్తి హంతారం యశ్చైనం మన్యతే హతమ్,
ఉభౌతౌ న విజానీతో నాయం హంతి నహన్యతే. 19

ఈదేహిని జంపువానిగను చచ్చినవానిగను తలంచువిరువురేమియు నెఱుగనివారు. ఈయాత్మ చంపదు. చావదు.

నజాయతే మ్రియతే వా కదాచి
న్నాయం భూత్వా భవితా వా న భూయః,

అజో నిత్య శ్శాశ్వతోఽయం పురాణో
నహన్యతే హన్యమానే శరీరే. 20

ఇదెప్పుడును పుట్టదు. చావదు. గతకాలమందుండి భవిష్యత్కాలమందుండక పోవునది కాదు. కావుననిది అజము. నిత్యము. శాశ్వతము. పురాతనము. దేహమునశించినను అది నశించునది కాదు.

వేదావినాశినం నిత్యం య ఏన మజ మవ్యయమ్,
కథం స పురుషః పార్థ కం ఘాతయతి హంతికమ్. 21

పార్థా, ఎవడాత్మను అవినాశి, నిత్యము, అజము, అవ్యయమని గ్రహించుచున్నాడో వాడెవరినెట్లు చంపించును? చంపును?

వాసాంసి జీర్ణాని యథా విహాయ నవానిగృహ్ణాతి నరోఽపరాణి
తథా శరీరాణి విహాయ జీర్ణాన్యన్యాని సంయాతి నవాని దేహీ. 22

మనుష్యుడెట్లు జీర్ణవస్త్రములను విడిచి నూతనవస్త్రములను కట్టుకొనుచున్నాడో యట్లే దేహి జీర్ణమైన దేహము విడిచి వేఱొక నూత్న దేహమును పొందుచున్నాడు.

నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః
నచైనం క్లేదయం త్యాపో న శోషయతి మారుతః 23

దీనిని (ఆత్మను) శస్త్రములు ఛేదింపలేవు. అగ్ని దహింపలేదు. నీరు తడుపలేదు. వాయువు ఎండింపలేదు.

అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయమక్లేద్యోఽశోష్యఏవచ,
నిత్య స్సర్వగతః స్థాణు రచలోఽయం సనాతనః. 24

ఇది ఛేదింప వీలుకలదికాదు. దహింప వీలుకలది కాదు. తడుప వీలుకలదికాదు. ఇది నిత్యము. సర్వగతము. స్థిరము. అచలము. సనాతనము.

అవ్యక్తోఽయమచింత్యోఽయమవికార్యోఽయముచ్యతే,
తస్మాదేవం విదిత్వైనం నానుశోచితు మర్హసి. 25

మఱియు నిది ఇంద్రియములకు మనస్సునకు నగమ్యమైనది. వికారరహితమని చెప్పబడినది. కావున దీనినిట్లు తెలిసికొని నీవు శోకింపతగదు

అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతమ్,
తథాపి త్వం మహాబాహో నైవం శోచితు మర్హసి. 26

మహాబాహూ, ఒకవేళ దీనిని సదాపుట్టుచు చచ్చుచునుండుదానిగ నీవు తలచినను దుఃఖించుట నీకుచితముకాదు.

జాతస్య హి ధ్రువో మృత్యు ర్ధ్రువం జన్మమృతస్య చ,
తస్మాదపరిహార్యేఽర్థే నత్వం శోచితు మర్హసి. 27

పుట్టినదానికొఱకు చావును, చచ్చినదానికొఱకు పుట్టుకయును అనివార్యములు. కావున అనివార్యమగు దానిం గూర్చి శోకించుట యుచితముకాదు.

అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత,
అవ్యక్తనిధనా న్యేవ తత్ర కా పరిదేవనా. 28

భారతా, జన్మమునకుముందును మరణములకు వెనుకనుగల భూతములస్థితిచూడ వీలులేనిది. అది అవ్యక్తము. మధ్యస్థితియే వ్యక్తమగుచున్నది. ఇందు శోకకారణ మేమున్నది?

వాఖ్యానము:-భూతములనగా సృష్టియందలి చరాచరములు.

ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేన
మాశ్చర్యవ ద్వదతి తథైవచాన్యః,
ఆశ్చర్యవ చ్చైన మన్యశ్శృణోతి
శ్రుత్వా ప్యేనం వేద నచైవ కశ్చిత్. 29

ఒకానొకడు దీని నాశ్చర్యమైనదానిగ చూచుచున్నాడు. మఱియొకడాశ్చర్యమైనదానిగా చెప్పుచున్నాడు. చెప్పగా వేఱొకడాశ్చర్యకరమైన దానిగ వినుచున్నాడు. వినియు నొక్కడును దీనిని తెలిసికొనజాలడు.

దేహీ నిత్య మవధ్యోఽయం దే హే సర్వస్య భారత,
తస్మా త్సర్వాణి భూతాని నత్వం శోచితు మర్హసి. 30

భారతా, సమస్త ప్రాణుల దేహములందుండు ఈ దేహధారియగు నాత్మ సదా యవధ్యమైనది. కావున భూతముల గూర్చి దుఃఖించుట నీకనుచితము.

వాఖ్యానము:-ఇంతవఱకు శ్రీకృష్ణపరమాత్మ బుద్ధి ప్రయోగించి యాత్మయొక్క నిత్యత్వమును దేహముయొక్క యనిత్యత్వమును భోధించి, యొకవేళ ఏయవస్థయందైనను దేహనాశముచేయుట యుచితమని తోచెనేని, స్వజనులు పరజనులు అను భేదభావమునుపొంది యనగా కౌరవులు నావారనియెంచి యెట్లుచంపుదునాయని శంకించుట మోహజన్యమగునని తెలిపియున్నాడు. ఇక నర్జునునకేది క్షత్రియధర్మమో చెప్పుచున్నాడు.

స్వధర్మ మపి చావేక్ష్య నవికంపితు మర్హసి,
ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్యనవిద్యతే. 31

స్వధర్మము తెలిసికొనినదైనను నీవు సందేహించుట తగదు. ఎందుకనగా క్షత్రియునకు ధర్మయుద్ధముకంటె మఱి యొకటి యధిక శ్రేయస్కరము కాజాలదు.

యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వార మపావృతమ్,
సుఖినః క్షత్రియాః పార్థ! లభంతే యుద్ధ మీదృశమ్. 32

పార్థా, ఈవిధముగా తనకుతానే సంప్రాప్తమైనట్టియు స్వర్గద్వారమే తెఱచియున్న రీతినున్నట్టిదియునగు నిట్టియుద్ధ మదృష్టవంతులగు క్షత్రియులకుమాత్రమే లభించును.

అథ చేత్త్వ మిమం ధర్మ్యం సంగ్రామం నకరిష్యసి,
తత స్స్వధర్మం కీర్తించ హిత్వాపాప మవాప్స్యసి 33

ఒకవేళ ధర్మప్రాప్తమగు నీయుద్ధమును చేయకపోతి వేని స్వధర్మమును కీర్తిని పోగొట్టుకొని పాపము మూట గట్టుకొందువు

అకీర్తించాపి భూతాని కథయిష్యంతి తేఽవ్యయామ్,
సంభావితస్య చాకీర్తి ర్మరణా దతిరిచ్యతే. 34

విన్నెల్లరు సదా నిందించుచుందురు. సంభావితున కప కీర్తి మరణముకంటెను చెడ్డది.

భయా ద్రణా దుపరతం మంస్యంతే త్వాం మహారథాః,
యేషాం చ త్వం బహుమతో భూత్వా యాస్యసి లాఘవమ్ 35

ఏమహారథులవలన నీవు సన్మానము పొందియుంటివో

వ్యాఖ్యానము:-భూతములనగా సృష్టియం[illegible]
చరములు.

ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేన
మాశ్చర్యవ ద్వదతి తథైవచాన్యః,
ఆశ్చర్యవ చ్చైన మన్యశ్శృణోతి
శ్రుత్వా ప్యేనం వేద నచైవ కశ్చిత్. [illegible]

ఒకానొకడు దీని నాశ్చర్యమైనదానిగ [illegible]డు. మఱియొకడాశ్చర్యమైనదానిగా చెప్పుచున్నాడు. [illegible]గా వేఱొకడాశ్చర్యకరమైన దానిగ వినుచున్నాడు. [illegible] నొక్కడును దీనిని తెలిసికొనజాలడు.

దేహీ నిత్య మవధ్యోఽయం దే హే సర్వస్య [illegible],
తస్మాత్సర్వాణి భూతాని నత్వం శోచితు [illegible]. [illegible]

భారతా, సమస్త ప్రాణుల దేహములు[illegible] ధారియగు నాత్మ సదా యవధ్యమైనది. [illegible] గూర్చి దుఃఖించుట నీకనుచితము.

వ్యాఖ్యానము:-ఇంతవఱకు శ్రీకృష్ణ[illegible] ప్రయోగించి యాత్మయొక్క నిత్యత్వమును [illegible] యనిత్యత్వమును భోధించి, యొకవేళ [illegible] దేహ నాశముచేయుట యుచితమని తోచినని, [illegible] జనులు అను భేదభావమునుపొంది యనగా [illegible] వారనియెంచి యెట్లుచంపుదునాయని [illegible]మగునని తెలిపియున్నాడు. ఇక [illegible] మో చెప్పుచున్నాడు.

స్వధర్మ మపి చావేక్ష్య నవికంపితు మర్హసి,
ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్యనవిద్యతే. 31

స్వధర్మము తెలిసికొనినదైనను నీవు సందేహించుట తగదు. ఎందుకనగా క్షత్రియునకు ధర్మయుద్ధముకంటె మఱి యొకటి యధిక శ్రేయస్కరము కాజాలదు.

యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వార మపావృతమ్,
సుఖినః క్షత్రియాః పార్థ! లభంతే యుద్ధ మీదృశమ్. 32

పార్థా, ఈవిధముగా తనకుతానే సంప్రాప్తమైనట్టియు స్వర్గద్వారమే తెఱచియున్న రీతినున్నట్టిదియునగు నిట్టియుద్ధ మదృష్టవంతులగు క్షత్రియులకుమాత్రమే లభించును.

అథ చేత్త్వ మిమం ధర్మ్యం సంగ్రామం నకరిష్యసి,
తత స్స్వధర్మం కీర్తించ హిత్వాపాప మవాప్స్యసి 33

ఒకవేళ ధర్మప్రాప్తమగు నీయుద్ధమును చేయకపోతి వేని స్వధర్మమును కీర్తిని పోగొట్టుకొని పాపము మూట గట్టు కొందువు

అకీర్తించాపి భూతాని కథయిష్యంతి తేఽవ్యయామ్,
సంభావితస్య చాకీర్తి ర్మరణా దతిరిచ్యతే. 34

నిన్నెల్లరు సదా నిందించుచుందురు. సంభావితున కప కీర్తి మరణముకంటెను చెడ్డది.

భయా ద్రణా దుపరతం మంస్యంతే త్వాం మహారథాః,
యేషాం చ త్వం బహుమతో భూత్వా యాస్యసి లాఘవమ్ 35

ఏమహారథులవలన నీవు సన్మానము పొందియుంటివో

వారేనీవు భయపడి యుద్ధమునుండి పారిపోతివని తలచి నిన్ను చులకన జేతురు.

అవాచ్యవాదాంశ్చ బహూన్ వదిష్యంతి తవాహితాః,
నిందంత స్తవ సామర్థ్యం తతో దుఃఖతరంను కిమ్. 36

మఱియు నీశత్రువులు నీబలమును నిందించుచు నిన్నన రానిమాటలు పెక్కులందురు. ఇంతకంటె నధికదుఃఖకరమైన దేముండును.

హతో వా ప్రాప్స్యసి స్వర్గం జిత్వావా భోక్ష్యసేమహీమ్,
తస్మాదుత్తిష్ఠ కౌంతేయ! యుద్ధాయకృతనిశ్చయః. 37

చచ్చెదవా స్వర్గములభించును. జయించెదవా రాజ్యమనుభవింతువు కావున కౌంతేయా యుద్ధమునకు కృతనిశ్చయుడవై లెమ్ము.

వ్యాఖ్యానము:-ఈ ప్రకారము భగవానుడాత్మయొక్క నిత్యత్వమును, దేహముయొక్క యనిత్యత్వమును తెలిపి పిమ్మట అనాయాసముగ ప్రాప్తించిన యుద్ధము చేయుటచేత క్షాత్రధర్మమునకు హానివాటిల్లదని సైతము బోధించెను. ఈ రీతిని 31 శ్లోకమువలన భగవానుడు పరమార్థముతో తదుప యోగమును చేర్చియున్నాడు. ఇంతవఱకు చెప్పి మరల భగవానుడు గీతయొక్క ప్రధానోపదేశము నొక్క శ్లోకమునందు దిగ్దర్శనము చేయించుచున్నాడు.

సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ,
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాప మవాప్స్యసి. 38

సుఖదుఃఖములు, లాభనష్టములు, జయాపజయములు సమానములని యెంచి యుద్ధముకొఱకు సంసిద్ధుడవు కమ్ము. ఇట్లు చేయుటవలన నీకు పాపమంటదు.

ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధిర్యోగే త్విమాం శృణు,
బుద్ధ్యా యుక్తో యయా పార్థ! కర్మబంధం ప్రహాస్యసి. 39

నేను నీకు సాంఖ్యసిద్ధాంతానుసారము (తర్కవాదానుసారము) నీకర్తవ్యమును తెల్పితిని. ఇప్పుడు యోగవాదానుసారము తెలుపుచున్నాను వినుము. దీని నాశ్రయించుటవలన కర్మబంధనములను త్రెంపివేయగలవు.

నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే,
స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్. 40

ఇందు ప్రారంభనాశముండదు. వ్యతిరేకఫలితము కలుగదు. ఈధర్మముయొక్క స్వల్పపాలనమైనను మహాభయమునుండి రక్షించును.

వ్యవసాయాత్మికా బుద్ధి రేకేహ కురునందన,
బహుశాఖా హ్యనంతాశ్చ బుద్ధయోఽవ్యవసాయినామ్. 41

కురునందనా, యోగవాదియొక్క నిశ్చయాత్మకబుద్ధి యొకేవిధమున నుండునుగాని నిశ్చయములేనివారిబుద్ధులు అనేకశాఖలుగలవియు, అనంతములునై యుండును.

వ్యాఖ్యానము:-బుద్ధి ఏకత్వమునువిడిచి యనేకములు (బుద్ధులు) అగునప్పుడది బుద్ధిగానుండక వాసనాస్వరూపమును దాల్చును. కావున బుద్ధులనగా వాసనలని తాత్పర్యము.

యా మిమాం పుష్పితాం వాచం ప్రవదంత్యవిపశ్చితః,
వేదవాదరతాః పార్థ! నాన్య దస్తీతి వాదినః. 42

కామాత్మాన స్స్వర్గపరా జన్మకర్మఫలప్రదామ్,
క్రియావిశేష బహుళాం భోగైశ్వర్యగతిం ప్రతి. 43

భోగైశ్వర్య ప్రసక్తానాం తయాఽపహృతచేతసామ్,
వ్యవసాయాత్మికాబుద్ధి స్సమాధౌ న విధీయతే. 44

"దీనికంటె మఱేమియు లేదు" అనిపల్కువారు, స్వర్గము శ్రేష్ఠమని తలచువారు, కోర్కెలుగలవారునగు నజ్ఞానులైన వేదవాదులు, జననమరణాత్మకమగు కర్మఫలముల నిచ్చునవియు భోగము, ఐశ్వర్యము ప్రాప్తించుటకు చేయునట్టివియునగు కర్మలనుగూర్చిన పలుకులు కడుచమత్కారముగ బలుకుచుందురు. భోగమందు నైశ్వర్యమందునా సక్తి కలిగియుండు వీరియొక్క ఆబుద్ధి చెడిపోవుచున్నది. వీరిబుద్ధి నిశ్చయమైనదియుగాదు. సమాధియందు స్థిరముగ నుండగలదియునుకాదు

వ్యాఖ్యానము:-యోగవాదమునకు విరుద్ధమగు కర్మకాండమును లేక వేదవాదమునుగూర్చిన వర్ణన పైమూడు శ్లోకములయందు వచ్చినది. కర్మకాండము లేక వేదవాదమనగా ఫలోత్పత్తికొఱకు మథించు నసంఖ్యాకములగు క్రియలు. ఈ క్రియలు వేదరహస్యమునకు, వేదాంతమునకు, భిన్నములు నల్పఫలప్రదములగుటచే నిరర్థకములై యున్నవి.

త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున,
నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్. 45

అర్జునా, వేదవిషయములైయున్న త్రిగుణములచే నలిప్తుడవైయుండుము. సుఖదుఃఖాది ద్వంద్వములనుండి ముక్తుడవుకమ్ము. ఎల్లప్పుడు సత్యవస్తువునందాసక్తి గలిగియుండుము ఏవస్తువు నైనను సంపాదించు జంఝాటముగాని కాపాడు జంఝాటముగాని వదలుకొనుము. ఆత్మపరాయణుడవుకమ్ము.

యావానర్థ ఉదపానే సర్వతః సంప్లుతోదకే,
తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః 46

పెక్కుబావులవలన లభించు ప్రయోజనమంతయు నన్నివిధముల నొక్క సరస్సునందే లభించునట్లు వేదములన్నిటియందు లభించునది, జ్ఞానియగు బ్రహ్మపరాయణున కాత్మానుభవమందే లభించు చున్నది.

కర్మణ్యే వాధికారస్తే మా ఫలేషు కదాచన,
మా కర్మఫలహేతు ర్భూర్మాతే సంగోస్త్వకర్మణి. 47

కర్మలయందే నీకధికారము కలదు వానిచే కలుగు ననేక ఫలములందు ఏమాత్రమును లేదు. నీవు కర్మఫలము హేతువు కాకూడదు. నీవు కర్మచేయకపోవుట యందుసైత మాసక్తి యుండరాదు.

యోగస్థః కురుకర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ!,
సిద్ధ్యసిద్ధ్యోః సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే. 48

ధనంజయా, ఆసక్తి నివిడిచి యోగస్థుడవై అనగా ఫలాఫలములయందు సమభావము కలిగినవాడవై కర్మ చేయుము. సమత్వమునకే యోగమందురు.

దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగా ద్ధనంజయ,
బుద్ధౌ శరణ మన్విచ్ఛ కృపణాః ఫలహేతవః 49

ధనంజయా, సమత్వబుద్ధితో సరిపోల్చి చూచితిమేని కేవలకర్మలు మిక్కిలి నీచమైనవి. నీవు సమత్వబుద్ధి నాశ్రయించుము. ఫలములను హేతువులుగ జేయు మనుష్యులు దయకు పాత్రులైయున్నారు

బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృతదుష్కృతే,
తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్. 50

బుద్ధి యుక్తున కనగా సమత్వబుద్ధిగల పురుషునకిందు పాపపుణ్యములంటవు. కావున నీవు సమత్వమునకై ప్రయత్నించుము. సమత్వమే కార్యకుశలత్వము.

కర్మజం బుద్ధియుక్తాహి ఫలం త్యక్త్వా మనీషిణః,
జన్మబంధవినిర్ముక్తాః పదం గచ్ఛంత్యనామయమ్. 51

ఎందుకనగా సమత్వబుద్ధిగలజనులు కర్మలవలన గలుగు ఫలములను విడిచినవారై జన్మబంధనమునుండి ముక్తులగుచున్నారు. మఱియు నిష్కళంకగతిని-మోక్షపదమును-పొందుచున్నారు.

యదా తే మోహకలిలం బుద్ధి ర్వ్యతితరిష్యతి,
తదా గంతాసి నిర్వేదం శ్రోతవ్యస్యశ్రుతస్యచ. 52

ఎప్పుడు నీబుద్ధి మోహపంకమునుండి దాటిపోవునో అప్పుడు నీవు వినియున్నవాని విషయమందును, వినుటకై శేషించియున్నవాని విషయమందును, నీకు ఉదాసీనత కలుగును.

శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా,
సమాధావచలా బుద్ధి స్తదా యోగ మవాప్స్యసి. 53

వివిధసిద్ధాంతములను వినుటచే కలతనొందిన నీబుద్ధి ఎప్పుడు సమాధియందు స్థిరమగునో యప్పుడే నీకు సమత్వము సిద్ధించును.

అర్జున ఉవాచ:—

స్థితప్రజ్ఞస్య కా భాషా సమాధిస్థస్య కేశవ,
స్థితధీః కిం ప్రభాషేత కిమాసీత వ్రజేత కిమ్. 54

అర్జునుడు పల్కుచున్నాడు:- కేశవా, స్థితప్రజ్ఞుని అనగా సమాధిస్థుని లక్షణము లేవి? స్థితప్రజ్ఞుడెట్లు మాట్లాడును? ఎట్లు కూర్చుండును? ఎట్లు నడచును?

శ్రీభగవానువాచ:—

ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్
ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞ స్తదోచ్యతే. 55

శ్రీభగవానుడు చెప్పుచున్నాడు:- పార్థా, మనుష్యుడెప్పుడు మనస్సున బుట్టుచుండు కోర్కెలనన్నిటిని త్యజించి యాత్మవలననే యాత్మయందు సంతుష్టుడైయుండునో అప్పుడు వానిని స్థితప్రజ్ఞుడందురు.

వ్యాఖ్యానము:- ఆత్మవలననే ఆత్మయందు సంతుష్టుడగుట యనగా ఆత్మానందమును తనలోపల వెదకుట సుఖదుఃఖములను కలిగించు బాహ్యవస్తువులపై ఆనందము కొఱకు ఆధారపడకూడదు. ఆనందము సుఖమునకు భిన్నమైనదను

మాట జ్ఞాపకముంచుకోవలెను. నాకు ధనములభించునపుడందు సుఖముగలదని భావించుట మూఢ్యము. నేను భిక్షుకుడనై ఆహారవిషయమున దుఃఖమనుభవించుచున్నప్పుడు ఏది నా యందుండుటవలన చౌర్యమందు లేక వేరే యితర వ్యసనములయందు జిక్కుకుంటినో యదియే నాకానంద మిచ్చుచున్నది. అది ఆత్మసంతోషమై యున్నది.

దుఃఖే ష్వనుద్విగ్నమనా స్సుఖేషు విగతస్పృహః
వీతరాగభయక్రోధః స్థితధీ ర్మని రుచ్యతే. 56

దుఃఖములవలన దుఃఖితుడు కానివాడు, సుఖమందిచ్ఛ లేనివాడు, రాగము భయము క్రోధము లేనివాడు, నెవ్వడో యాస్థిరబుద్ధియుక్తుని మునియందురు.

యస్సర్వత్రా నభిస్నేహ స్తత్తత్ప్రాప్య శుభాశుభమ్,
నాభినందతి నద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. 57

సర్వత్ర రాగరహితుడై ఏపురుషుడు శుభాశుభ ప్రాప్తియందు హర్షింపకయు శోకింపకయు నుండునో యాతని బుద్ధి స్థిరమైనది.

యదా సంహరతే చాయం కూర్మోఽంగానీవ సర్వశః,
ఇంద్రియాణీంద్రియార్థేభ్య స్తస్యప్రజ్ఞా ప్రతిష్ఠితా. 58

తాబేలు అన్నిప్రక్కలనుండియు నవయవములు ముడుచుకొనునట్లు ఎప్పుడీపురుషుడు విషయములనుండి యింద్రియములను ముడుచుకొనునో అప్పుడు వానిబుద్ధి స్థిరమైనదనబడును.

విషయా వినివర్తంతే నిరాహారస్య దేహినః,
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే. 59

దేహధారి నిరాహారిగా నున్నప్పుడు వానివిషయములు మందగిలి పోవుచున్నవి. కాని రుచిపోవుట లేదు. ఆరుచి యీశ్వరసాక్షాత్కారమగునేని శమించును.

వ్యాఖ్యానము:- ఈ శ్లోకముపవాసాదుల నిషేధించుట లేదు. కాని వాని హద్దును సూచించుచున్నది. విషయములను శమింపజేయుట కుపవాసాదులావశ్యకములు. అయినను వానివేరు అనగా వానియందుగలరుచి ఈశ్వరసాక్షాత్కారము కలిగినపిమ్మటనే శాంతించును. ఈశ్వరసాక్షాత్కారము రుచిచూచినవాడి తరరుచులను మఱచిపోవును.

యతతో హ్యపి కౌంతేయ! పురుషస్యవిపశ్చితః,
ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః. 60

కౌంతేయా, ఇంద్రియములెట్టి క్షోభను కలుగజేయు స్వభావము కలవియనగా వివేకియగు పురుషుడు ప్రయత్నించుచున్నను, ఆతని మనస్సును సైతము బలాత్కారముగా హరించివేయుచున్నవి.

తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః,
వశేహి యస్యేంద్రియాణి తస్యప్రజ్ఞా ప్రతిష్ఠితా. 61

ఈ యింద్రియముల నన్నింటిని వశమందుంచుకొని యోగి నాయందు తన్మయుడై యుండవలెను. ఎందుకనగా

తనయింద్రియములు తనకు స్వాధీనములై యెవనికుండునో వానిబుద్ధి స్థిరమైనది,

వ్యాఖ్యానము:-భక్తి లేకయే-ఈశ్వరసాహాయ్యము లేకయే-మనుష్యప్రయత్నములు వృథాయగునని తాత్పర్యము.

ధ్యాయతో విషయాన్ పుంసః సంగస్తేషూపజాయతే,
సంగాత్సంజాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే. 62

విషయములను చింతించు పురుషునకు వానియందాసక్తి కలుగును. ఆసక్తినుండి కామముపుట్టును. కామమునుండి క్రోధము జనించును

వ్యాఖ్యానము:-కామముగలవారికి క్రోధమనివార్యమైయుండును. ఎందుకనగా కామమేనాటికిని తృప్తి పొందనే పొందదు.

క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్స్మృతివిభ్రమః,
స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి. 63

క్రోధమునుండి యవివేకముదయించును. అవివేకమునుండి స్మృతిభ్రంశము కలుగును. స్మృతిభ్రంశము కలిగినందున జ్ఞానము నశించును. ఎవనిజ్ఞానము నశించెనో వాడు చచ్చినవానితో సమానుడగును.

రాగద్వేషవియుక్తైస్తు విషయానింద్రియైశ్చరన్
ఆత్మవశ్యైర్విధేయాత్మా ప్రసాదమధిగచ్ఛతి. 64

అయినను, ఎవ్వనిమనస్సు వానియధీనమునందుండునో ఎవ్వనియింద్రియములు రాగద్వేషరహితములై వానివశమం

నుండునో ఆమనుష్యు డింద్రియవ్యాపారములు నడుపుచుండి యును చిత్తప్రసన్నతను బొందుచున్నాడు.

ప్రసాదే సర్వదుఃఖానాం హాని రస్యోపజాయతే,
ప్రసన్నచేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతే. 65

చిత్తము ప్రసన్నమయియుండునేని వాని సకలదుఃఖములును దూరమైపోవును. ప్రసన్నచిత్తుడైన వానిబుద్ధి త్వరగా స్థిరపడును.

నాస్తి బుద్ధి రయుక్తస్య నచాయుక్తస్య భావనా,
నచా భావయత శ్శాంతి రశాంతస్య కుత స్సుఖమ్. 66

సమత్వములేనివానికి వివేకముండదు. వివేకములేనివానికి భక్తియుండదు. భక్తిలేనివానికి శాంతియుండదు. శాంతిలేనిచోట సుఖమెట్లుండును?

ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే,
తదస్య హరతి ప్రజ్ఞాం వాయు ర్నావ మివాంభసి. 67

విషయములయందు సంచరించు నింద్రియములవెంట నెవ్వనిమనస్సు పరువెత్తుచుండునో, ఆతనిమనస్సు, సముద్రమందు నౌకను వాయువెట్లు లాగుకొనిపోవునో యట్లే వాని బుద్ధిని తలచినచోటికెల్ల లాగికొనిపోవును.

తస్మాద్యస్య మహాబాహో నిగృహీతాని సర్వశః,
ఇంద్రియా ణీంద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. 68

కావుననో మహాబాహూ, నలుప్రక్కలనుండు విషయములనుండి యెవ్వని యింద్రియములు మరలివచ్చి తనకు వశమగునో వానిబుద్ధి స్థిరమగుచున్నది.

యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ,
యస్యాంజాగ్రతిభూతాని సానిశా పశ్యతో మునేః. 69

ప్రాణులన్నియు నిద్రించుచున్నప్పుడు సంయమి మెలకువతో నుండును. ప్రాణులు మేల్కొనియున్నప్పుడు జ్ఞానియగు ముని నిద్రించుచుండును.

వ్యాఖ్యానము:-భోగాసక్తులగు మనుష్యులు రాత్రి పండ్రెండుగంటలు లేక యొంటిగంటవఱకు నృత్తగీతములు, ఆహారపానములు మున్నగువానియందు తమకాలము గడుపుచున్నారు. పిమ్మట ప్రాతఃకాల మేడెనిమిది గంటలవఱకు నిద్రించుచున్నారు. ఇంద్రియనిగ్రహముకలవారు రాత్రులం దేడెనిమిదిగంటలకు నిద్రించి యర్ధరాత్రమున లేచి యీశ్వరుని ధ్యానించుచున్నారు. భోగి సంసారప్రపంచమును పెంచుకొని యీశ్వరుని మఱచిపోవుచున్నాడు. కాని సంయమి సంసార ప్రపంచమును మఱచి యీశ్వర సాక్షాత్కారము చేసికొనుచున్నాడు. ఇవ్విధమున నిద్దఱిమార్గములు వేర్వేరని యీ శ్లోకమున భగవానుడు తెలిపియున్నాడు.

ఆపూర్యమాణ మచల ప్రతిష్ఠం
సముద్ర మాపః ప్రవిశంతి యద్వత్,
తద్వ త్కామాయం ప్రవిశంతి సర్వే
సశాంతి మాప్నోతి న కామ కామీ. 70

నదులు ప్రవేశించుటచే నిండుచుండియు సముద్రమచలమైయున్నట్లు ఎవ్వనియందైహిక భోగములు ప్రవేశించి

పోవునో ఆమనుష్యునకే శాంతిలభించుట. కామములుగల మనుష్యునకు కాదు.

విహాయ కామాన్ యస్సర్వాన్ పుమాంశ్చరతి నిస్స్పృహః,
నిర్మమో నిరహంకార స్స శాంతి మధిగచ్ఛతి. 71

కోర్కెలన్నియు విడిచి ఇచ్ఛ, మమత్వము, అహంకారము, లేనివాడయి వర్తించువాడే శాంతిపొందుచున్నాడు.

ఏషా బ్రాహ్మీస్థితిః పార్థ నైనాం ప్రాప్య విముహ్యతి,
స్థిత్వాఽస్యా మంతకాలేఽపి బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి. 72

పార్థా, ఈశ్వరుని తెలిసికొనువానిస్థితి యిట్టిదిగా నుండును. ఆస్థితి పొందినతరువాత వాడు తిరిగి మోహవశుడు కాడు. మరణకాలమందునైన నిట్టిస్థితియే యున్నచో వాడు బ్రహ్మనిర్వాణము పొందుచున్నాడు.

ఓమ్ తత్సత్.

ఇతి శ్రీభగవద్గీతా సు పనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగ
శాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే సాంఖ్యయోగో నామ
ద్వితీయోఽధ్యాయః.

ఈప్రకారము శ్రీమద్భగవద్గీతలయందు-ఉపనిషత్” అనగా బ్రహ్మవిద్యాంతర్గత యోగశాస్త్రమందలి శ్రీకృష్ణార్జున సంవాదమందు సాంఖ్యయోగమను రెండవయధ్యాయము ముగిసినది.



# కర్మయోగము.

## తృతీయాధ్యాయము.



గీతాస్వరూప మెఱుగుటకీ యధ్యాయము కీలక మన వచ్చును. కర్మ ఎట్లాచరింపవలయును? ఎట్టికర్మ యాచరింప వలయును? దేనిని సత్కర్మయనవలయును? అనువిషయము లిందు స్పష్టపఱపబడినవి. మఱియు నిజమగు జ్ఞానము పార మార్థిక కర్మలయందు పరిపక్వమై తీరవలయునని యిందు తెలిపియున్నాడు.

అర్జున ఉవాచ:—

జ్యాయసీ చేత్కర్మణస్తే మతా బుద్ధిర్జనార్దన,
తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ! 1

అర్జునుడు చెప్పుచున్నాడు:-జనార్దనా, కేశవా, కర్మ కంటె బుద్ధి శ్రేష్ఠతరమని భావింతువేని నన్నీ ఘోరకర్మయం దేల నియమించుచున్నావు?

వ్యాఖ్యానము:-బుద్ధియనగా సమత్వబుద్ధి.

వ్యామిశ్రేణేవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే,
తదేకంవద నిశ్చిత్య యేన శ్రేయోఽహమాప్నుయామ్. 2

నీమిశ్ర భాషణములచే నీవునాబుద్ధిని సంశయ నిలయ ముగ జేయుచున్నవానివలె నున్నావు. కావున నావిషయ

మున కల్యాణకరమగు నొకేవాక్యము నిశ్చయించి నాకు తెలుపుము.

వ్యాఖ్యానము:-అర్జునుడు చిక్కులోపడిపోవును. కారణమేమనగా భగవానుడతని నిరుత్సాహము నొకవైపున నిరసించును. వేరొకవైపున రెండవయధ్యాయమందలి 49-50 శ్లోకములలో కర్మత్యాగభావము వచ్చును. లోతుగా విచారించినచో అట్లులేదని భగవానుడు ముందు తెలుపును.

శ్రీభగవానువాచ:—

లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయాఽనఘ,
జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్. 3

శ్రీభగవానుడు చెప్పుచున్నాడు:-పాపరహితుడా, నేనిదివఱకీలోకమందు రెండు నిష్ఠలను చెప్పియుంటిని. మొదటిది జ్ఞానయోగులవలన సాంఖ్యులది. రెండవది కర్మయోగమువలన యోగులది.

న కర్మణామనారంభాన్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే,
న చ సన్న్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి. 4

మనుష్యుడు కర్మలను ప్రారంభింపక పోవుటచేత నైష్కర్మ్యానుభవము పొందడు. కేవలము కర్మల బాహ్యత్యాగమువలన మోక్షము పొందడు.

వ్యాఖ్యానము:-నైష్కర్మ్యమనగా మనోవాక్కాయ కర్మలచే కర్మనాచరింపకుండుట. ఇట్టినైష్కర్మ్యానుభవము కర్మఆచరింపనిదే యెవ్వరికిని సిద్ధింపదు. దీని అనుభవమెట్లు కలుగునో చూడవలసి యున్నది.

నహి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠ త్యకర్మకృత్,
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః. 5

వాస్తవముగా నెవఁడును నిమిషమేని కర్మనాచరింపక యుండఁజాలఁడు. పరవశుఁడై యున్న ప్రతిమనుష్యునిచేతను ప్రకృతిజన్యగుణములు కర్మలచేయించుచున్నవి.

కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్,
ఇంద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచారస్స ఉచ్యతే. 6

ఏమనుష్యుఁడు కర్మేంద్రియములను నిగ్రహించుచుండియు, ఆయింద్రియ విషయములను మనస్సున చింతించుచుండునో, వానిని మూఢుఁడనియు మిథ్యాచారియనియు చెప్పుదురు.

వ్యాఖ్యానము:-ఎవఁడు వాక్కును మాత్రము నిగ్రహించి మనస్సునందు పరుని దూషించుచుండునో వాఁడు నిష్కర్ముఁడు కాఁడు. కేవలమిథ్యాచారియే యగును. మనోనిగ్రహము కలుగనంతవరకు శరీరమును నిగ్రహించుట నిరర్థకమని దీనితాత్పర్యము కాదు. శరీరమును నిరోధింపనిదే మనస్సు వశమునకు రాదు. అయినను శరీరనిగ్రహముతోఁబాటు మనోనిగ్రహమునకుఁగూడ ప్రయత్నించుచుండవలయును. భయము మొదలగు బాహ్యకారణములవలన శరీరమును నిరోధించుచు మనస్సు నిరోధించక యుండువారును, మనస్సుతో విషయముల ననుభవించుచుండుటయేగాక సమయము లభించినప్పుడు శరీరముతోసైత మనుభవించుచుండువారు నగు నిట్టి మిథ్యా

వారలనుగూర్చి నిరసన మిందుగలదు. ముందుశ్లోకమందు దీనికి వ్యతిరేక భావమును తెలుపుచున్నాడు.

యస్త్వింద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున
కర్మేంద్రియైః కర్మయోగ మసక్త స్సవిశిష్యతే. 7

కాని యర్జునా, యేమనుష్యుడింద్రియములను మనస్సువలన వశపఱచుకొని సంగరహితుడై కర్మేంద్రియములచే కర్మయోగము నారంభించుచున్నాడో వాడుత్తమపురుషుడు.

వ్యాఖ్యానము:-ఇందు బాహ్యమును ఆంతర్యమును కలిపియున్నాడు. మనస్సును వశమందుంచుకొనియు మనుష్యుడు శరీరముతో అనగా కర్మేంద్రియములతో కొద్దిగనో గొప్పగనో ఏదోయొక కర్మచేయనేచేయును. కాని యెవ్వని మనస్సు వశమందుండునో వాని చెవులు దూషిత భాషణములు వినక యీశ్వరభజనమునే యాకర్ణించును. సత్పురుషుల గుణకీర్తనము వినును. ఎవ్వనిమనస్సు స్వాధీనమైయుండునో వాడు, మనము విషయమని దేనిని తలచుచున్నామో దానిని రుచిచూడడు. ఇట్టిమనుష్యుడు ఆత్మకల్యాణ కరములగు కర్మలనే చేయును. ఇట్టికర్మలను చేయుటయే కర్మమార్గము. ఏ యత్నమువలన ఆత్మకు శరీరబంధనమునుండి విమోచనము కలుగుచున్నదో దానినే కర్మయోగమందురు. ఇందు విషయాసక్తికి స్థానమే లేదు.

నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః,
శరీరయాత్రాపి చ తే న ప్రసిద్ధ్యే దకర్మణః. 8

కాబట్టి నీవు నియతకర్మలను చేయుము. కర్మచేయక పోవుటకంటె చేయుటయే మిక్కిలి మంచిది. నీశరీరవ్యాపార మైనను కర్మవిడిచి సాగనేరదు.

వ్యాఖ్యానము:-నియతశబ్దము మూలశ్లోకమందున్నది. దానిసంబంధము వెనుకటిశ్లోకముతో కలదు. అందు మనస్సు ద్వారా యింద్రియములను నియమమునందుంచుచు సంగరహితుడై కర్మచేయువాని స్తుతికలదు. ఇక్కడ నియతకర్మలు అనగా ఇంద్రియములను నియమమందుంచి చేయుకర్మలు ప్రోత్సహింపబడినవి.

యజ్ఞార్థా త్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబంధనః,
తదర్థం కర్మ కౌంతేయ! ముక్తసంగ స్సమాచర. 9

యజ్ఞార్థము చేయుకర్మల వలన తప్ప యితర కర్మల వలన నీలోకమంతు బంధనము కలుగుచున్నది. కావున కౌంతేయా, నీవు రాగరహితుడవై యజ్ఞార్థము కర్మచేయుము.

వ్యాఖ్యానము:-యజ్ఞమనగా పరోపకారార్థమును, ఈశ్వరార్థమును చేయుకర్మలు.

సహయజ్ఞాః ప్రజా స్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః,
అనేన ప్రసవిష్యధ్వ మేష వోఽస్త్విష్టకామధుక్. 10

యజ్ఞములతోకూడా ప్రజలను సృష్టించి ప్రజాపతి బ్రహ్మ "ఈయజ్ఞమువలన మీకభివృద్ధి యగుగాక! ఇది మీ మనోభీష్టములనిచ్చుగాక!" అని పలికెను.

దేవా న్భావయతాఽ నేన తే దేవా భావయంతువః,
పరస్పరం భావయంత శ్శ్రేయః పర మవాప్స్యథ. 11

మీరు యజ్ఞములవలన దేవతలను పోషింపుడు. దేవతలు మిమ్ము పోషింతురుగాక! ఇట్లొకరినొకరు పాలించుకొనుచు పరమకల్యాణమును పొందుడు.

ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యంతే యజ్ఞభావితాః,
తైర్దత్తా నప్రదాయైభ్యో యో భుంక్తే స్తేన ఏవ సః. 12

యజ్ఞములవలన సంతుష్టులైన దేవతలు మీకు సమ్మతములగు భోగముల నియ్యగలరు. వారికి మరలనీయక వారిచ్చినవాని ననుభవించువాడు చోరుడేయగును.

వ్యాఖ్యానము:-ఇచ్చట దేవతలనగా ఈశ్వరసృష్టియందలి ప్రాణులు. ప్రాణిసేవయే దైవసేవ. అదియే యజ్ఞము.

యజ్ఞశిష్టాశిన స్సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః,
భుంజతే తే త్వఘం పాపా యే పచన్త్యాత్మకారణాత్. 13

యజ్ఞశేషమును భుజించువారు సకల పాపములనుండి విముక్తి పొందుదురు. తమనిమిత్తమే పాకముచేసికొనువారు పాపమును భుజించుచున్నారు.

అన్నా ద్భవంతి భూతాని పర్జన్యా దన్నసంభవః,
యజ్ఞా ద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః 14

అన్నమునుండి భూతములుపుట్టుచున్నవి. అన్నము వర్షమునుండి యుత్పన్నమగుచున్నది. వర్షము యజ్ఞమువలన కలుగుచున్నది. యజ్ఞము కర్మవలన నగుచున్నది.

కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షరసముద్భవమ్,
తస్మాత్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్. 15

కర్మ ప్రకృతివలన నుత్పన్నమగుచున్నదనియు ప్రకృతి యక్షరబ్రహ్మనుండి పుట్టుచున్నదనియు తెలిసికొమ్ము. ఈ కారణముచేత సర్వవ్యాపకమగు బ్రహ్మము సదా యజ్ఞమం దు ప్రతిష్ఠితమై యున్నది.

ఏవం ప్రవర్తితం చక్రం నానువ ర్తయతీహ యః,
అఘాయు రిన్ద్రియారామో మోఘుం పార్థ సజీవతి. 16

ఓ పార్థా, ఇట్లు ప్రవర్తితమైన చక్రమునననుసరించి ప్ర వర్తింపని మనుష్యుడు తనయాయువును పాపభూయిష్ఠముగ జేయుచున్నాడు. మఱియు నింద్రియసుఖములలో తగుల్కొని యుండుటచేత వ్యర్థముగా జీవించుచున్నాడు.

యస్త్వాత్మరతిరేవ స్యా దాత్మతృప్తశ్చ మానవః,
ఆత్మ న్యేవచ సంతుష్టస్తస్య కార్యం న విద్యతే. 17

కాని యాత్మయందు రతుడై యాత్మయందు తృప్తుడై యాత్మయందు సంతుష్టుడై ఏమనుష్యుడుండునో వానికి చేయు టకేదియు నుండదు.

నైవ తస్య కృతే నార్థో నాకృతే నేహ కశ్చన,
న చాస్య సర్వభూతేషు కశ్చిదర్థ వ్యపాశ్రయః. 18

చేయుటయందును చేయకపోవుటయందును వానికి ప్రయోజనమేమియు లేదు. సకలభూతములయందును వానికి స్వప్రయోజనమేమియు లేదు.

తస్మా దసక్త స్సతతం కార్యం కర్మ సమాచర,
అసక్తో హ్యాచరన్ కర్మ పర మాప్నోతి పూరుషః. 19

కావున నీవు అనాసక్తుడవై నిరంతరము కర్తవ్యములగు కర్మలు చేయుము. అసంగుడైయుండియే, కర్మలు చేయు పురుషుడు మోక్షము పొందును

కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః
లోకసంగ్రహ మేవాపి సంపశ్యన్ కర్తు మర్హసి. 20

జనకాదులు కర్మములవల్లనే పరమసిద్ధిపొందియుండిరి. లోకసంగ్రహ దృష్టితోనైనను నీకు కర్మాచరణ యుచితమైనది.

యద్య దాచరతి శ్రేష్ఠ స్తత్తదే వేతరో జనాః,
స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే. 21

ఉత్తమపురుషు లేవేవి యాచరింతురో వానినే యితరులనుకరింతురు. వారు వేనిని ప్రమాణములుగ నెంతురో వానినే లోకులు ప్రమాణములుగ దలచి యనువర్తింతురు.

నమే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన,
నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవచ కర్మణి. 22

పార్థా, నాకు ముల్లోకములందు చేయవలసినదేదియును లేదు. పొందనిదిగాని పొందతగినదిగాని ఏవస్తువయును లేదు. అయినను కర్మలయందు వర్తించుచున్నాను.

వ్యాఖ్యానము:-సూర్యుడు, చంద్రుడు, పృథివి మున్నగువాని అవిరామమగు క్రమగతి ఈశ్వరకర్మలను సూచించుచున్నది. ఈకర్మలు మానసికములుకావు. శారీరకములని యెంచబడును. ఈశ్వరుడు నిరాకారుడైయుండియు శారీరక

కర్మ లెట్లు చేయును? అని శంకించుట కవకాశము లేదు. ఎందుకనగా అతడశరీరుడైయున్నను శరీరివలెనే యాచరించుచుండుట కాన్పించుచున్నది. కావున నాతడు కర్మలనాచరించుచుండియు అకర్ముడు, అలిప్తుడునై యున్నాడు. ఎట్లు ఈశ్వరుని ప్రతివృత్తియు యంత్రమువలె కార్యముచేయుచున్నదో అట్లే మనుష్యుడుకూడా బుద్ధిపూర్వకముగ యంత్రమువలెనే నియమబద్ధుడై కార్యములు చేయవలయునను విషయమును ప్రతివాడును గుర్తింపవలయును. మనుష్యునకు, యంత్రగతిని నిరాదరించి స్వేచ్ఛాచారియగుటలో విశేషత లేదు. బాగుగా గ్రహించి ఆగతిననుకరింపవలయును. వాడు నిర్లిప్తుడై యసంగుడై కార్యములాచరించుచో క్షీణింపజాలడు. మరణించు వఱకు నిర్మలుడైయుండును. దేహనియమానుసారము దేహము సమయమున జారిపోవును. కాని యందుండు ఆత్మ యథాప్రకారముగానే యుండును.

యది హ్యహం నవర్తేయం జాతు కర్మణ్యతంద్రితః,
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ! సర్వశః. 23

పార్థా, నేనొకప్పుడును ఆవలింత తీయుటకైన నాగిపోక కర్మములలో వర్తింపకుందునేని జనులన్నివిధముల నా యాచరణ ననుసరించియే వర్తింప నారంభింతురు.

ఉత్సీదేయు రిమేలోకా నకుర్యాం కర్మచేదహం,
సంకరస్యచ కర్తా స్యా ముపహన్యా మిమాః ప్రజాః. 24

నేను కర్మములు చేయకుందునేని యీలోకములు

భ్రష్టములగుదు. నేను సంకరముచేసిన వాడనగుదును. ఈ జనులను పాడుచేసిన వాడనగుదును.

సక్తాః కర్మ ణ్యవిద్వాంసో యథా కుర్వంతిభారత,
కుర్యా ద్విద్వాం స్తథా సక్త శ్చికీర్షు ర్లోకసంగ్రహమ్. 25

భారతా, అజ్ఞానులాసక్తితో కార్యములు చేయునట్లే జ్ఞాని అనాసక్తుడై లోకకల్యాణేచ్ఛతో కర్మలు చేయవలెను.

న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసంగినామ్,
జోషయేత్సర్వకర్మాణి విద్వాన్ యుక్తస్సమాచరన్. 26

కర్మల యందాసక్తిగల యజ్ఞానమానవుల బుద్ధిని జ్ఞాని చలింప జేయరాదు. కాని తాను సమత్వబుద్ధితో లెస్సగా కర్మలను చేయుచు వారిచేగూడ సకలకర్మలను చేయింపవలయును.

ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః,
అహంకారవిమూఢాత్మా కర్తాహ మితి మన్యతే. 27

ప్రకృతి గుణములచేత సమస్తకర్మలు చేయబడిన వగుచున్నవి. కాని యహంకారమువలన మూఢుడైయున్న మనుష్యుడు "నేను కర్తను" అని తలచుచున్నాడు.

తత్త్వవిత్తు మహాబాహో గుణకర్మవిభాగయోః,
గుణాగుణేషు వర్తంత ఇతి మత్వా నసజ్జతే. 28

మహాబాహూ, గుణకర్మవిభాగరహస్యమెఱిగిన పురుషుడు "గుణములు గుణములయందు వర్తించుచున్నవి" అని తలచి దానియందాసక్తుడుకాడు.

వ్యాఖ్యానము:-ఉచ్ఛ్వాశ నిశ్వాసాదిక్రియలు వాని యంతట యవి జరుగుచుండగా మనుష్యుడు వానియందాసక్తుడై యుండడు కాని తదంగములకేదేని రోగము జనించునప్పుడే వాని విషయమున చింతింపవలసియో వాని యస్తిత్వమునుగూర్చి విచారింపవలసియో వచ్చును. అట్లే స్వాభావికర్మలు వా నియంతట నవియే జరుగుచున్నయెడల వానిపై నాసక్తి కలుగదు. ఉదారస్వభావము కలవాడు తన యందున్న యౌదార్యము నెఱుగనేయెఱుగడు. కాని వాడు దానముచేయక యుండజాలడు. అనాసక్తియొక్క యిట్టి అభ్యాసము ఈశ్వరకృపవలననే కలుగుచున్నది.

ప్రకృతే ర్గుణసమ్మూఢా స్సజ్జంతే గుణకర్మసు,
తా నకృత్స్నవిదో మందాన్ కృత్స్నవి న్నవిచాలయేత్. 29

ప్రకృతిగుణములచే మోహితులైన మనుష్యులు గుణములచే గల్గుకర్మలయందాసక్తులై యుందురు. ఇట్టి అజ్ఞానుల మందబుద్ధులగువారిని జ్ఞానులు చలింపజేయరాదు.

మయి సర్వాణి కర్మాణి సన్న్య స్యాధ్యాత్మచేతసా,
నిరాశీ ర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః. 30

అధ్యాత్మ వృత్తికలవాడవై సమస్తకర్మలను నాకు సమర్పించి ఆసక్తిని మమత్వమును విడిచి రాగరహితుడవై యుద్ధము చేయుము.

వ్యాఖ్యానము:-యజమానునిపేర కార్యముచేయుచు అంతయు యజమానునకే యర్పించి సేవకునివలెనే దేహా

నుండున్న యాత్మను గుర్తించి అది పరమాత్మాంశమని తెలిసి కొన్నవాడు సమస్తమును భగవంతున కర్పించును.

యే మే మత మిదం నిత్య మనుతిష్ఠంతి మానవాః,
శ్రద్ధావంతోఽనసూయంతో ముచ్యంతే తేఽపికర్మభిః. 31

శ్రద్ధకలిగి ద్వేషమునువిడిచి ఏమానవులీ నామతమను సరించి వర్తించుచున్నారో వారును కర్మబంధనమునుండి ముక్తులయ్యెదరు.

యే త్వేతదభ్యసూయంతో నానుతిష్ఠన్తి మే మతమ్,
సర్వజ్ఞానవిమూఢాం స్తాన్ విద్ధి నష్టాన చేతసః. 32

కాని యెవరు ఈ నాయభిప్రాయమున దోషములెంచి దాని ననుసరింపరో వారు జ్ఞానములేని మూఢులు. వారు తప్పక నశించిరనుకొమ్ము.

సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతే ర్జ్ఞానవానపి,
ప్రకృతిం యాంతి భూతాని నిగ్రహః కిం కరిష్యతి. 33

జ్ఞానిసైతము తనస్వభావానుసారమే వర్తించు చున్నాడు. ప్రాణులు తమస్వభావము ననుసరించుచున్నప్పుడు నిగ్రహమేమి చేయగలదు?

వ్యాఖ్యానము:-ఈశ్లోకము రెండవయధ్యాయమందలి 61-68 శ్లోకములకు విరుద్ధమైనదికాదు. ఇంద్రియములనదే పనిగ నిగ్రహించుచు మనుష్యుడు విసుగక శ్రమపడవలసినదే. కాని యిట్లు చేసినను సుఫలితములేనిచో నిగ్రహము అనగా బలాత్కారము నిరర్థకము. ఇందు నిగ్రహమును నిందించ

లేదు. స్వభావ సామ్రాజ్యమును చూపించినాడు. తన స్వభావమని చెప్పి నేరముచేయువాడీ శ్లోకార్థమును తెలిసికొనజాలడు. స్వభావమును మనము కనుగొనలేము. అలవాటులన్నియు స్వభావములుకావు. ఆత్మయొక్క స్వభావమూర్ధ్వగమనము. ఆయాత్మ క్రిందివైపునకు దిగునపుడు దానిని నిరోధించుట కర్తవ్యము. ఇందువల్లనే యీక్రిందిశ్లోక మిట్లు తెలియపఱచుచున్నది.

ఇంద్రియస్యేంద్రి యస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ,
తయో ర్నవశ మాగచ్ఛేత్తౌ హ్యస్య పరిపంథినౌ. 34

తమతమ విషయముల సంబంధమందింద్రియములకు రాగద్వేషములుండుచునే యుండును. మనుష్యుడు వానికి వశుడు కాకూడదు. ఎందుకనగా అవి మనుష్యుని మార్గమునకు బాధకములై యున్నవి.

వ్యాఖ్యానము:- చెవియొక్క విషయము వినుట. ఇష్టముగువానిని వినుటయందుగల యిచ్ఛయే రాగము. అనిష్టములగు వానిని వినుటయందు గలిగిన రోతయే ద్వేషము. ఇది స్వభావము అనిచెప్పి రాగద్వేషములకు లొంగిపోకూడదు. వానిని నిరోధించవలయును. సుఖదుఃఖముల నంటక యుండుటయే ఆత్మస్వభావము. మనుష్యుడా స్వభావముదనుక చేరవలసి యున్నది.

శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మా త్స్వనుష్ఠితాత్,
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః 35

పరధర్మము సులభముగనున్నను దానికంటె దోష సహితమైనను స్వధర్మముత్తమము. స్వధర్మమందు చచ్చుట మంచిది. పరధర్మము భయావహము.

వ్యాఖ్యానము:- సమాజమందొకని ధర్మము ఊడ్చుటయు వేఱొకని ధర్మము జమాఖర్చులు వ్రాయుటయునై యుండవచ్చును. లెక్కలువ్రాయువానిని గొప్పవాడని యెంచ నిమ్ము. ఊడ్చువాడు తనధర్మము విడిచినచో వాడు భ్రష్టు డగుటయేగాక సమాజమునకు హానికలిగించు వాడగును. ఈశ్వరసాన్నిధ్యమున వారివురి సేవకులకు తగిన ఫలితము వారినిష్ఠననుసరించి అంచనాచేయబడును. అచట ప్రతివృత్తికి విలువ సమానమే. ఇద్దఱును ఈశ్వరార్పణ బుద్ధితోడ తమకర్తవ్యమును పాలించిరేని సమానముగా మోక్షాధి కారులగు చున్నారు.

అర్జున ఉవాచః—

అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః,
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ! బలాదివ నియోజితః. 36

అర్జునుడు చెప్పుచున్నాడు:- వార్ష్ణేయా, తనకిష్టము లేకున్నను బలాత్కారముగా నియోజితునివలె మనుష్యుడు పాపము చేయుచున్నాడు. దేని ప్రేరణవలన?

శ్రీభగవానువాచః—

కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః,
మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్. 37

శ్రీభగవానుడు చెప్పుచున్నాడు:-రజోగుణమువలన నుత్పన్నమగు నిది (ప్రేరకము) కామమైయున్నది. క్రోధమై యున్నది. దానికి కడుపేనిండదు. ఇది మహాపాపస్వరూప మైనది. ఈలోకమందు దీనిని శత్రువుగా భావింపుము.

వ్యాఖ్యానము:-లోపలనున్న మన యదార్థ శత్రువును, మీయిష్టము, కామమనుడు, క్రోధమనుడు, అదియే.

ధూమే నావ్రియతే వహ్ని ర్యథాఽఽదర్శో మలేనచ,
యథోల్బే నావృతో గర్భస్తథా తేనేద మావృతమ్. 38

పొగచేనిప్పు, మురికిచేనద్దము, మావిచేగర్భము నావృతములై యుండునట్లు కామాది శత్రువులచే ఈజ్ఞాన మావృతమై యున్నది.

ఆవృతం జ్ఞాన మేతేన జ్ఞానినో నిత్యవైరిణా
కామరూపేణ కౌంతేయ! దుష్పూరే ణానలేనచ. 39

ఓ కౌంతేయా, తృప్తిపఱచబడజాలని యీ కామరూపాగ్ని, నిత్యశత్రువై యున్నది. ఇది జ్ఞానియొక్క జ్ఞానము నావరించి యుండును.

ఇంద్రియాణి మనోబుద్ధి రస్యాధిష్ఠాన ముచ్యతే,
ఏతైర్విమోహయ త్యేష జ్ఞానమావృత్య దేహినమ్. 40

ఇంద్రియములు, మనస్సు, బుద్ధి-ఈశత్రువునకు నివాసస్థానములు. వీనివలన జ్ఞానము నావరించి యీ శత్రువు దేహిని విస్మృతుని జేయును.

వ్యాఖ్యానము:-ఇంద్రియములందు కామము వ్యాపి

చినందున మనస్సు మలినమగుచున్నది. అందుచే వివేకశక్తి మందగిలుచున్నది. అందున జ్ఞానము నశించుచున్నది. చూడుము. 2 వ అ. 62-64 శ్లో.

తస్మాత్త్వ మిన్ద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ,
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనమ్. 41

కావున భరతర్షభా, నీవు ముందుగ ఇంద్రియములను నియమించుకొని యీ జ్ఞానానుభవములను నాశమొనరించెడి యీ పాపిష్ఠి దానిని విడువుము.

ఇన్ద్రియాణి పరాణ్యాహు రింద్రియేభ్యః పరం మనః,
మనసస్తు పరా బుద్ధి ర్యోబుద్ధేః పరతస్తు సః. 42

ఇంద్రియములు సూక్ష్మములు. వానికంటె నధిక సూక్ష్మమైనది మనస్సు, దానికంటె మిక్కిలి సూక్ష్మమైనది బుద్ధి బుద్ధికంటెనుకూడా అత్యంత సూక్ష్మమైనది ఆత్మయే.

వ్యాఖ్యానము:-ఇంద్రియములు వశమందున్నచో సూక్ష్మమగు కామమును జయించుట సులభసాధ్యమగునని తాత్పర్యము.

ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మాన మాత్మనా,
జహి శత్రుం మహాబాహో! కామరూపం దురాసదమ్. 43

మహాబాహూ, ఈ విధమున బుద్ధికంటె పరమైన ఆత్మను గుర్తించి ఆత్మవలన మనస్సును వశపఱచుకొని, కామస్వరూపమైనదగు దుర్జయ శత్రువును సంహరింపుము

వ్యాఖ్యానము:-మనుష్యుడు శరీరమందున్న యాత్మను

తెలిసికొన్నచో మనస్సు వానికి వశమై యుండగలదు. ఇంద్రియముల వశమందుండ నేరదు. మనస్సు జయింపబడెనేని కామమేమి చేయగలదు?

ఓమ్, తత్సత్.

ఇతి శ్రీభగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే కర్మయోగో నామ
తృతీయోఽధ్యాయః

ఈప్రకారము శ్రీమద్భగవద్గీత ఉపనిషత్ అనగా బ్రహ్మవిద్యాంతర్గత యోగశాస్త్రమందలి శ్రీకృష్ణార్జున సంవాదమందు కర్మయోగమను మూడవయధ్యాయము ముగిసినది.



# జ్ఞాన కర్మ సన్న్యాసయోగము

## చతుర్థాధ్యాయము



ఈ యధ్యాయమందు మూడవ అధ్యాయమును గుఱించిన విచారణ విశేషముగనున్నది. మఱియు వివిధములగు ననేకయజ్ఞముల వర్ణన కలదు.

శ్రీ భగవానువాచ.

ఇమం వివస్వతే యోగం ప్రోక్తవా నహ మవ్యయమ్,
వివస్వాన్ మనవే ప్రాహ మను రిక్ష్వాకవేఽబ్రవీత్. 1

శ్రీభగవానుడు చెప్పుచున్నాడు:-నాశనము లేని యీ యోగమును వివస్వంతునకు (సూర్యునకు) చెప్పితిని. అతడు మనువునకును ఆమనువు ఇక్ష్వాకునకును తెలిపెను.

ఏవం పరంపరా ప్రాప్త మిమం రాజర్షయో విదుః,
స కాలే నేహ మహతా యోగో నష్టః పరంతప. 2

ఈ ప్రకారము పరంపరగా ప్రాప్తించినదియు రాజర్షులకు తెలిసినదియు నగు నీయోగము బహుకాలము గతించుటచే నశించిపోయినది.

స ఏవాయం మయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః,
భక్తోఽసి మే సఖా చేతి రహస్యం హ్యేతదుత్తమమ్. 3

ఆపురాతనయోగమునే నేడు నీకు తెలిపితిని. ఎందు

కనగా నీవునాకు భక్తుడవు. మఱియు నీ యోగ ముత్తమరహస్యమైన విషయము.

అర్జున ఉవాచ:—

అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వతః,
కథ మేత ద్విజానీయాం త్వ మాదౌ ప్రోక్తవా నితి. 4

అర్జునుడు చెప్పుచున్నాడు:-నీజన్మ మిప్పుడైనది. వివస్వంతునిది మునుపేయయియుండెను. ఇట్టిచో నీవాయోగమును వివస్వంతునకు చెప్పియుంటివని నేనెట్లు తెలియుదును?

శ్రీభగవానువాచ:—

బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున,
తా న్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరంతప. 5

శ్రీభగవానుడు చెప్పుచున్నాడు:-అర్జునా, నాకును నీకును అనేకజన్మలు గతించినవి. వాని నన్నిటిని నేనెఱుగుదును. నీవెఱుగవు.

అజోఽపి స న్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపిసన్,
ప్రకృతిం స్వా మధిష్ఠాయ సంభవా మ్యాత్మమాయయా. 6

పుట్టుకలేనివాడనై యున్నను, నాశము లేనివాడనై యున్నను, సకలభూతములకు నీశ్వరుడనైయున్నను, స్వకీయమగు స్వభావమును చేకొని నామాయచేత జన్మమెత్తుచున్నాను.

యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత!
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజా మ్యహమ్. 7

భారతా, ఎపుడెపుడు ధర్మము క్షీణించుచున్నదో అధర్మము ప్రబలమగుచున్నదో యపుడపుడు నేను జన్మించుచుందును.

పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతామ్,
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే. 8

సాధువులను రక్షించుటకొఱకును దుష్టులను సంహరించుట కొఱకును ధర్మమును పునరుద్ధరించుట కొఱకును ప్రతియుగమందు నేను పుట్టుచుందును.

వ్యాఖ్యానము:-ఇందు శ్రద్ధాళువునకూరడింపుగలదు. సత్యము-ధర్మము యొక్క స్థిరత్వమునుగూర్చిన ప్రతిజ్ఞ కలదు. ఈప్రపంచమునందు పోటుపాటులు తటస్థించుచునే యుండును. కాని తుదకు ధర్మమునకే జయము చేకూరును. సాధువులు నశింపరు. ఎందుకనగా సత్యమునకు నాశము కలుగదు. దుష్టులు నాశనమేయగుదురు. ఎందుకనగా అసత్యమునకస్తిత్వము లేదు. ఇది యెఱిగి మనుష్యుడు తనకర్తృత్వాభిమానముచే హింసచేయరాదు. దుష్కార్యము లాచరింపరాదు. గభీరమగు నీశ్వరమాయ తనపని చేయుచునే యుండును. ఇదియే అవతారము లేక యీశ్వరజన్మ. వస్తుతః ఈశ్వరునకు జన్మింపవలసిన యావశ్యకత కలుగదు.

జన్మ కర్మ చ మే దివ్య మేవం యో వేత్తి తత్త్వతః,
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోఽర్జున. 9

ఇట్లు దివ్యములగు నాజన్మకర్మల రహస్యమునుగూర్చి

యెవడు తెలిసికొనునో వాడు, అర్జునా, శరీరమును విడిచియు పునర్జన్మమును పొందడు. కానినన్ను పొందును.

వ్యాఖ్యానము:-ఎందుకనగా ఈశ్వరుడు సత్యమునకే జయముకలిగించునని మనుష్యునకెప్పుడు దృఢవిశ్వాసము కలుగుచున్నదో అప్పుడతడు సత్యమును విడువడు. ధైర్యము కలిగియుండును. దుఃఖములు సహించును మమకార రహితు డగుటవలన జనన మరణ చక్రమునుండి తొలగి ఈశ్వరునే ధ్యానించుచు నందే లీనుడైపోవును.

వీతరాగభయక్రోధా మన్మయా మా ముపాశ్రితాః,
బహవో జ్ఞానతపసా పూతా మద్భావ మాగతాః. 10

రాగమును, భయమును, క్రోధమును, పోగొట్టుకొన్న వారై నన్నే ధ్యానించుచు నన్నే యాశ్రయించు వారనేకులు జ్ఞానరూపమగు తపస్సుచే పవిత్రులై నాస్వరూపమును పొంది యున్నారు.

యే యథా మాంప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహం,
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ! సర్వశః 11

పార్థా, ఎవరేవిధముగా నన్నాశ్రయించుచున్నారో ఆప్రకారమే నేను వారికి ఫలమునిచ్చుచున్నాను. సర్వప్రకారముల మనుష్యులు నామార్గమునే యనుసరించుచున్నారు. నాశాసనమున కధీనులై మెలగుచున్నారు.

వ్యాఖ్యానము:- ఈశ్వరశాసనమును ఎవడును ఉల్లంఘింపజాలడు. ఎట్లు విత్తుచున్నాడో యట్లే కోయుచున్నాడు.

చేతకుతగిలిన ఫలితమే లభించును. ఈశ్వరుని చట్టమందు అనగా కర్తృనియమమునందు ఏవిధమగు నపవాదమును లేదు. అందఱకు సమానముగా అనగా ఎవరి యోగ్యతకు తగినట్లు వారికి న్యాయము దొరకును.

కాంక్షంతః కర్మణాం సిద్ధిం యజంత ఇహదేవతాః,
క్షిప్రంహి మానుషే లోకే సిద్ధిర్భవతి కర్మజా. 12

కర్మసిద్ధి కోరువారికి లోకమందు దేవతలను పూజించుచున్నారు. ఇందుచే వారికి కర్మజనిత ఫలితము తక్షణమిూ మానవలోకమందే లభించుచున్నది.

వ్యాఖ్యానము:-దేవతలనగా స్వర్గమందున్న యింద్రుడు వరుణుడు మొదలగు వ్యక్తులు కారు. దేవతయనగ ఈశ్వరునిలోని నానావిధమగుశక్తి. ఈయర్థమున మనుష్యుడుకూడా దేవతయే. అవిరి మెఱుపు మొదలగు మహాశక్తులును దేవతలే. వాని నారాధించిన ఫలము వెంటనే ఈలోకమందే లభించుటను మనము చూచుచున్నాము. ఆఫలము క్షణికమైనది. అది ఆత్మకు సంతుష్టి నొసగజాలదు. అట్లయినచో మోక్షము నెట్లీయగలదు?

చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః,
తస్యకర్తార మపి మాం విద్ధ్యకర్తార మవ్యయమ్. 13

గుణకర్మల విభాగానుసారము నేను నాలుగు వర్ణములు సృజించితిని. వానికికర్తనైయుండినను, నీవు, నన్నవినాశినిగాను, అకర్తనుగాను తెలిసికొనుము.

న మాం కర్మాణి లింపంతి నమే కర్మఫలే స్పృహా,
ఇతి మాం యోఽభిజానాతి కర్మభి ర్న స బధ్యతే. 14

కర్మలు నన్నంటవు, నాకు తత్ఫలమందాసక్తి లేదు. ఇట్లు నన్ను బాగుగా తెలిసికొన్నవారు కర్మబంధనమున బడరు.

వ్యాఖ్యానము:-ఎందుకనగా, కర్మచేయుచు అకర్మయైయుండు సర్వోత్తమమగు దృష్టాంతము మనుష్యునిముందు కలదు. సమస్తమున కీశ్వరుడేకర్త. మనము నిమిత్తమాత్రులము. అయినచో కర్తృత్వాభిమాని యెట్లుకాగలడు?

ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః,
కురు కర్మైవ తస్మాత్త్వం పూర్వైః పూర్వతరం కృతమ్. 15

ఇట్లు తెలిసికొని పూర్వమందు ముముక్షువులు కర్మలు చేసి యుండిరి. కావున పూర్వులు సదా చేయుచువచ్చిన రీతినే నీవును చేయుము.

కిం కర్మ కి మకర్మేతి కవయోఽప్యత్ర మోహితాః,
తత్తేకర్మ ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్. 16

కర్మయననేమి? అకర్మయననేమి? అను విషయమై బుద్ధిమంతులుసైతము భ్రమించియుండిరి. ఆకర్మముల విషయమున నీకు బాగుగా తెలిపెదను. దాని నెఱిగి యశుభము నుండి తప్పించుకొనగలవు.

కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యంచ వికర్మణః,
అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః.

కర్మ, నిషిద్ధకర్మ, అకర్మ, అను వానిభేదమును తెలిసికొనవలయును. కర్మగతి నిగూఢమైనది.

కర్మణ్యకర్మ యః పశ్యే దకర్మణి చ కర్మయః,
స బుద్ధిమాన్మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్. 18

ఎవడు కర్మమునందు అకర్మభావమును, అకర్మమునందు కర్మభావమును చూచుచున్నాడో వాడు లోకులలో బుద్ధిమంతుడని యెంచబడును. వాడు యోగి. వాడు సమస్త కర్మలు చేయువాడు.

వ్యాఖ్యానము:-కర్మ చేయుచున్నను కర్తృత్వాభిమాన మెవ్వని కుండదో వానికర్మ యకర్మయే యగును. పైకి కర్మలు చేయుట మానియును, మనస్సునందా కర్మలనుగూర్చి యెప్పుడు చింతించుచుండునో వానియకర్మ కర్మయే యగుచున్నది. పక్షవాతరోగి కోరి యభిమానపూర్వకముగా స్తంభించియున్న తన యవయవము నెప్పుడు కదలించునో యప్పుడే యా యవయవము కదలును. ఈరోగి యవయవమును కదలించుటయను క్రియకు కర్తయగుచున్నాడు. ఆత్మయొక్క గుణము అకర్తృత్వము. మోహగ్రస్తమై తానే కర్తననుకొను ఆత్మ పక్షవాతరోగగ్రస్తుని వంటిది. అది అభిమానియై కర్మచేయు చుండును. ఇవ్విధమున కర్మగతి నెఱిగిన వివేకి యగు యోగియే కర్తవ్య పరాయణుడని యెంచబడును. "నేను చేయుచున్నాను" అనుకొనువాడు కర్మ వికర్మల భేదమును మఱచిపోవును. మఱియు సాధనల మంచిచెడ్డలు విచా

రింపడు. స్వాభావికముగ నాత్మ యూర్ధ్వగతి కలది. కాబట్టి మనుష్యు డెప్పుడు నీతిమార్గమునుండి తొలగునో అప్పుడు వానియందు “అహం” కలదనవచ్చును. అభిమానరహితుని కర్మలు సదా సాత్త్వికములై యుండును.

యస్య సర్వే సమారంభాః కామసంకల్పవర్జితాః,
జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణం త మాహుః పండితం బుధాః. 19

ఎవ్వని ప్రయత్నములన్నియు కామసంకల్ప శూన్యములై యున్నవో వానికర్మలు జ్ఞానరూపాగ్నిచే భస్మమై పోయినవి. జ్ఞానులిట్టి వానిని పండితుడందురు.

త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః,
కర్మణ్యభి ప్రవృత్తో౽పి నైవ కిఞ్చి త్కరోతి సః 20

కర్మఫలాసక్తి నివిడిచి సదాసంతుష్టుడై యెవ్వడుండునో ఎట్టియాశ్రయమునుగాని యెవ్వడాసించడో అట్టివాడు కర్మలయందు పూర్ణముగ మగ్నుడైయున్నను, ఏమియు చేయుటయే లేదని చెప్పవచ్చును.

వ్యాఖ్యానము:-అనగా నతడు కర్మబంధ మనుభవింప బని లేదు.

నిరాశీ ర్యతచిత్తాత్మా త్యక్తసర్వపరిగ్రహః,
శారీరం కేవలంకర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్. 21

ఎవ్వడాశారహితుడై యున్నాడో, ఎవ్వని మనస్సు స్వాధీనమై యున్నదో ఎవ్వడు సకల సంగ్రహములను విడిచి వేసెనో, ఎవ్వనిశరీరము మాత్రమే కర్మలను చేయుచున్న

నో, అట్టివాడు చేయుచున్నను దూషితుడు కాడు.

వ్యాఖ్యానము:-అభిమానసహితముగ చేయబడిన కర్మయంతయు నెంతటి సాత్త్వికమైననుకూడా బంధనము కలుగ చేయునదియే యగును. అది యీశ్వరార్పణబుద్ధితో నభిమానరహితముగ చేయునదయ్యేనేని బంధనము కలిగింపనిదిగా నగుచున్నది. ఎవ్వని "అహం" శూన్యమైపోయినదో వానిశరీరము మాత్రమే కర్మచేయుచున్నది. నిద్రించు మనుష్యుని శరీరముమాత్రమే కర్మచేయుచున్నదని చెప్పవచ్చును. ఎవడేని యొకఖైదీ వివశుడై తనకిష్టములేనిదే నాగలిదున్నుచున్నచో కేవలమతని దేహముమాత్రమే యాపని చేయుచున్నదగును. నిజేచ్ఛతో నెవ్వడీశ్వరుని బందీయయ్యెనో అట్టివాని శరీరము మాత్రమే పనిచేయుచున్నది. తాను శూన్యుడైపోయెను. ప్రేరకు డీశ్వరుడైయున్నాడు.

యదృచ్ఛాలాభసంతుష్టో ద్వంద్వాతీతో విమత్సరః
సమః సిద్ధావసిద్ధౌ చ కృత్వాపి న నిబధ్యతే. 22

లభించినదానితో సంతృప్తి పొందువాడు, సుఖదుఃఖాది ద్వంద్వములనుండి విముక్తుడైపోయినవాడు, ద్వేషభావములేనివాడు ఫలాఫలములయందు తటస్థుడై యున్నవాడు, నగు మనుష్యుడు కర్మలుచేయుచున్నను బంధనమున చిక్కడు.

గతసంగస్య ముక్తస్య జ్ఞానావస్థితచేతసః,
యజ్ఞాయాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే. 23

అనాసక్తుడై జ్ఞానమయచిత్తుడై ముక్తుడై యజ్ఞార్థము మాత్రమే కర్మలు చేయువాడై యెవ్వడుండునో యట్టిమనుష్యుని కర్మలన్నియు నశించుచున్నవి.

బ్రహ్మార్పణం బ్రహ్మహవి ర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతమ్,
బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మకర్మ సమాధినా. 24

(యజ్ఞమందలి) అర్పణము బ్రహ్మము. హవనపదార్థము-హవిస్సు బ్రహ్మము. బ్రహ్మమను నగ్నియందు హోమము చేయువాడును బ్రహ్మము. ఎవడిట్లు కర్మతో బ్రహ్మమును కలుపుచున్నాడో వాడు బ్రహ్మమునే పొందుచున్నాడు.

దైవమేవాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే,
బ్రహ్మాగ్నా వపరే యజ్ఞం యజ్ఞేనై వోపజుహ్వతి. 25

కొందఱుయోగులు దేవతలను పూజించుటయను యజ్ఞము చేయుచున్నారు. మఱికొందరు బ్రహ్మాగ్నియందు యజ్ఞమువలన యజ్ఞమునే హోమము చేయుచున్నారు.

శ్రోత్రాదీ నీంద్రియా ణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి,
శబ్దాదీ న్విషయా నన్య ఇన్ద్రియాగ్నిషు జుహ్వతి. 26

కొందఱు శ్రవణాద్యింద్రియములను నిగ్రహించుట యను యజ్ఞము చేయుచున్నారు. మఱికొందఱు శబ్దాదివిషయముల నింద్రియాగ్నియందు హోమము చేయుచున్నారు.

వ్యాఖ్యానము:- మొదటిదివినుట మొదలగు క్రియలు నిగ్రహించుట. రెండవది ఇంద్రియముల నుపయోగించుచు తద్విషయములను ప్రభుప్రీత్యర్థము భజనాదులు వినుచుంద

మున వినియోగించుట. వస్తుతః రెండునొక్కటియే.

సర్వాణీంద్రియకర్మాణి ప్రాణకర్మాణి చాపరే,
ఆత్మసంయమ యోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే. 27

కొందఱింద్రియ కర్మములనన్నింటిని, ప్రాణకర్మముల నన్నింటిని జ్ఞానదీపములవలన ప్రజ్వలితమైయున్న యాత్మనిగ్రహమను యోగాగ్నియందు హోమము చేయుచున్నారు.

వ్యాఖ్యానము:-పరమాత్మయందు తన్మయులవ్వెదరని భావము.

ద్రవ్యయజ్ఞా స్తపోయజ్ఞా యోగయజ్ఞా స్తథాపరే,
స్వాధ్యాయ జ్ఞానయజ్ఞాశ్చ యతయ స్సంశితవ్రతాః. 28

ఇవ్విధమున కొందఱు యజ్ఞమునకై ద్రవ్యమిచ్చువారగుచున్నారు. కొందఱు తపస్సు చేయువారగుచున్నారు. కొందఱష్టాంగ యోగములను సాధించువారగుచున్నారు. కొందఱు స్వాధ్యాయము, జ్ఞానయజ్ఞము చేయుచున్నారు. వీరందఱును కఠినవ్రతధారులును ప్రయత్నశీలురునగు యాజ్ఞికులై యున్నారు.

అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేఽపానం తథాపరే,
ప్రాణాపానగతీ రుద్ధ్వా ప్రాణాయామపరాయణాః. 29

ప్రాణాయామ తత్పరులైయుండు మఱికొందఱు అపానమును ప్రాణవాయువునందును, ప్రాణము నపానవాయువునందును హోమము చేయుచున్నారు. కాదేని ప్రాణాపానముల రెంటిని నిరోధించుచున్నారు.

వ్యాఖ్యానము:- ప్రాణాయామముయొక్క మూడు విధములివి. రేచకము, పూరకము, కుంభకము. సంస్కృతమందలి ప్రాణవాయువు గుజరాతీయందు మనమనుకొను ప్రాణవాయువునకు విరుద్ధమైనది. ఈప్రాణవాయువు (సంస్కృతమందలిది) లోపలినుండి బయటకు వెడలునది. మన మనుకొనునది బయటినుండి లోనికి బోవునది. దీనినే ఆక్సిజన్ అందుము.

అపరే నియతాహారాః ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి
సర్వేఽప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపితకల్మషాః. 30

మఱికొందరాహారము నిగ్రహించి ప్రాణములను ప్రాణములందే హోమముచేయుచున్నారు. ఎవరు యజ్ఞములవలన తమ పాపములు నశింపుచేసికొనిరో వారందరును యజ్ఞవేత్తలై యున్నారు.

యజ్ఞశిష్టామృతభుజో యాంతి బ్రహ్మ సనాతనమ్,
నాయంలోకోఽస్త్యయజ్ఞస్య కుతోఽన్యః కురుసత్తమ. 31

కురుసత్తమా, యజ్ఞశేషామృతము భుజించువారు సనాతన బ్రహ్మమును పొందుచున్నారు. యజ్ఞముచేయనివానికీలోకమే లేనప్పుడు పరలోకమెక్కడిది?

ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే,
కర్మజాన్విద్ధి తాన్సర్వా నేవం జ్ఞాత్వా విమోక్ష్యసే. 32

ఇట్లు వేదములయందనేక విధములగు యజ్ఞములు వర్ణితములైయున్నవి. వీనినన్నిటిని కర్మసముత్పన్నములనియే

తెలిసికొనుము. ఇవ్విధమున నన్నియు నెఱిగిన నీవు మోక్షము పొందెదవు.

వ్యాఖ్యానము:-ఇక్కడ కర్మకు వ్యాపకమని యర్థము. అనగా దైహికము, మానసికము, ఆత్మికము. ఇట్టికర్మలు చేసినదే యజ్ఞము కానేరదు. యజ్ఞమువినా మోక్షములభించదు. ఈవిధమెఱిగి దీనిననుసరించి వర్తించుటయే యజ్ఞములని తెలిసికొనుట. తాత్పర్యమేమనగా మనుష్యుడు తనశరీరమును బుద్ధిని ఆత్మను ప్రభుప్రీత్యర్థము, లోకసేవార్థము, ఉపయోగించనిచో దొంగయై మోక్షమున కనర్హుడగుచున్నాడు. ఎవడు కేవలమొక బుద్ధిబలమునే యుపయోగించుచు దేహాత్మల దాచుకొని యుండునో యట్టివాడు సంపూర్ణయాజ్ఞికుడు కాజాలడు. ఈశక్తులు (దేహబలము, ఆత్మబలము) పొందనిదే పరోపకారమునకై బుద్ధిబలముపయోగ పడజాలదు. కాబట్టి ఆత్మశుద్ధిలేనిది లోకసేవ యసంభవమై యున్నది. సేవకుడు, శరీరము, బుద్ధి, ఆత్మ, నీతి అను మూటిని సమానముగా వికసింప జేయుట కర్తవ్యము.

శ్రేయాన్ ద్రవ్యమయా ద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరంతప,
సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే. 33

పరంతపా, ద్రవ్యమయమగు యజ్ఞముకంటె జ్ఞానయజ్ఞము మిక్కిలి శ్రేష్ఠమైనది. ఎందుకనగా, పార్థా, కర్మములన్నియు జ్ఞానమునందే పరాకాష్ఠను జేరుచున్నవి.

వ్యాఖ్యానము:-పరోపకారభావముతో నిచ్చిన ద్రవ్య

నైనను జ్ఞానపూర్వకముగ నీయనిచో తఱుచుగా దానివలన హానియే కలుగును. దీని యనుభవమెవరికి తెలియదు? సద్భావమున జరుగు కర్మములన్నియు జ్ఞానయుక్తములగునపుడే శాంతించును. కావున కర్మలపూర్ణాహుతి జ్ఞానమందేకలదు.

తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా,
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః. 34

నీవు తత్త్వవేత్తలగు జ్ఞానులను సేవించుచు నమ్రతతో వివేకయుతుడవై సారెసారెకు వారిని ప్రశ్నించుచు దీనిని తెలిసికొనుము. వారు నీజిజ్ఞాసను తృప్తిపఱతురు.

వ్యాఖ్యానము:-జ్ఞానసంపాదనమునకుగల ప్రణిపాతము, పరిప్రశ్నము, సేవ, యను మూడు నిబంధనల నీయుగమందు తప్పక జ్ఞాపకముంచుకొన దగినవి. ప్రణిపాతమనగా నమ్రత, వివేకము; పరిప్రశ్నమనగా సారెసారెకు ప్రశ్నించుట. సేవారహితమగు నమ్రత ముఖస్తుతిగా పరిణమించవచ్చును. అన్వేషణలేనిది జ్ఞానమసంభవము. కాబట్టి తెలియనంతవఱకును, అనగా తెలియువఱకును శిష్యుడు గురువును వినయపూర్వకముగ ప్రశ్నించుచుండుటయే జిజ్ఞాసలక్షణము. అందు శ్రద్ధయొక్క ఆవశ్యకతకలదు. ఎవ్వనిపై శ్రద్ధయుండదో వానిపట్ల హృదయపూర్వకమగు విధేయతయు నుండదు. వానిసేవ యెట్లు కొనసాగగలదు?

యజ్జ్ఞాత్వా న పునర్మోహ మేవం యాస్యసి పాండవ,
యేన భూతాన్యశేషేణ ద్రక్ష్యస్యాత్మన్యథో మయి. 35

పాండవా, ఈజ్ఞానమును పొందినపిమ్మట మరల ఇట్టి మోహము నీకు కలుగదు. ఈ జ్ఞానమువలన ఆత్మయందును నాయందును నీవు సకలభూతములను చూడగలవు.

వ్యాఖ్యానము:-"యథాపిండే తథా బ్రహ్మాండే" అను దానికిదియే యర్థము, ఆత్మసాక్షాత్కారము కలిగినవాడు తనయాత్మయందును, బయలయాత్మయందును భిన్నత్వమును చూడడు.

అపిచే దసి పాపేభ్య స్సర్వేభ్యః పాపకృత్తమః,
సర్వం జ్ఞానప్లవే నైవ వృజినం సంతరిష్యసి. 36

పాపులందఱిలో నీవు కడు పాపివైనను జ్ఞానమనునౌక వలన పాపములనన్నిటిని తరింపగలవు.

యథైధాంసి సమిద్ధోఽగ్ని ర్భస్మసాత్కురుతేఽర్జున,
జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా 37

అర్జునా, ప్రజ్వలితాగ్ని సమిధలను భస్మముచేయు విధమున జ్ఞానాగ్ని సమస్తకర్మలను భస్మము చేయుచున్నది.

నహి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే,
తత్స్వయం యోగసంసిద్ధః కాలే నాత్మని విందతి. 38

జ్ఞానముతో సమానమగు పవిత్రమైనదీ ప్రపంచమందు వేరొకటిలేదు. యోగమందు-సమత్వమందు-పూర్ణత్వము చెందిన మనుష్యుడు సమయమున తనలోతానా జ్ఞానమును పొందుచున్నాడు.

శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పర స్సంయతేంద్రియః,
జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతి మచిరే ణాధిగచ్ఛతి. 39

శ్రద్ధకలవాడు, ఈశ్వరపరాయణుడు, జితేంద్రియుడు నగు పురుషుడు జ్ఞానమును పొందుచున్నాడు. జ్ఞానముపొందిన వెంటనే పరమశాంతి పొందుచున్నాడు.

అజ్ఞశ్చాశ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి,
నాయం లోకోఽస్తి న పరో న సుఖం సంశయాత్మనః 40

అజ్ఞానియై, శ్రద్ధారహితుడై, సంశయాత్మకుడై యుండువాడు నశించుచున్నాడు. సంశయాత్మున కిహమైనను పరమైనను లేదు. వాని కెచ్చటను సుఖము లేదు.

యోగసన్న్యస్తకర్మాణం జ్ఞానసంఛిన్న సంశయమ్,
ఆత్మవంతం న కర్మాణి నిబంధ్నంతి ధనంజయ. 41

సమత్వమనెడి యోగమువలన కర్మలను అనగా కర్మ ఫలములను త్యజించి జ్ఞానమువలన సందేహములను రూపుమాపియున్న ఆత్మదర్శికి ధనంజయా, కర్మములు బంధనరూపములు కాజాలవు.

తస్మా దజ్ఞాన సంభూతం హృత్ స్థం జ్ఞానాసినాత్మనః,
ఛిత్త్వైనం సంశయం యోగమాతిష్ఠోత్తిష్ఠ భారత. 42

కావున, భారతా, హృదయమందజ్ఞానముచే నుత్పన్నములైన సందేహముల నాత్మజ్ఞానమను ఖడ్గముచేత నఱికివేసి, యోగము-అనగా సమత్వమునుపొంది లెమ్ము.

ఓమ్, తత్సత్.

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే జ్ఞానకర్మసన్న్యాసయోగో నామ చతుర్థోఽధ్యాయః.

ఈ ప్రకారము శ్రీమద్భగవద్గీతా ఉపనిషత్ అనగా బ్రహ్మవిద్యాంతర్గత యోగశాస్త్రమందలి శ్రీకృష్ణార్జున సంవాదమందు జ్ఞానకర్మ సన్న్యాసయోగమను పేరుగల నాలుగవ అధ్యాయము ముగిసెను.



# కర్మసన్న్యాసయోగము

## పంచమాధ్యాయము

—೦೫೫೦—

కర్మయోగము లేనిది కర్మసన్న్యాసము కలుగనేకలుగదనియు వస్తుతః రెండు నొక్కటియేయనియు ఈ యధ్యాయము తెలుపుచున్నది.

అర్జున ఉవాచ:—

సన్న్యాసం కర్మణాం కృష్ణ! పునర్యోగంచ శంససి,
యచ్ఛ్రేయ ఏతయోరేకం తన్మే బ్రూహి సునిశ్చితమ్. 1

అర్జునుడు చెప్పుచున్నాడు:-కృష్ణా, కర్మత్యాగమును మరల కర్మయోగమును ప్రశంసించుచున్నావు. ఈ రెంటియందేది శ్రేయస్కరమో స్పష్టముగా నిశ్చయపూర్వకముగా నాకు చెప్పుము.

శ్రీభగవానువాచ:—

సన్న్యాసః కర్మయోగశ్చ నిశ్శ్రేయసకరా వుభౌ,
తయోస్తు కర్మసన్న్యాసా త్కర్మయోగో విశిష్యతే. 2

శ్రీభగవానుడు చెప్పుచున్నాడు:-కర్మలయొక్క త్యాగయోగములు రెండును మోక్షదాయకములే అయినను వీనిలో కర్మసన్న్యాసముకంటె కర్మయోగము విశేషమైనది.

జ్ఞేయ స్స నిత్యసన్న్యాసీ యో న ద్వేష్టి న కాంక్షతి,
నిర్ద్వంద్వోహి మహాబాహో సుఖం బంధాత్ప్రముచ్యతే. 3

ఇచ్ఛాద్వేషములు లేని మనుష్యుని నిత్యసన్న్యాసియని భావింపవలయును. సుఖదుఃఖాది ద్వంద్వములనుండి ముక్తుడైనవాడు సులభముగా బంధనవిముక్తుడగును.

వ్యాఖ్యానము:-అనగా కర్మత్యాగము సన్న్యాసము యొక్క ప్రధానలక్షణముకాదు. ద్వంద్వాతీతుడైయుండుటయే ముఖ్యలక్షణము. ఒకమనుష్యుడు కర్మచేయుచుండియు సన్న్యాసికావచ్చును. మఱియొకడు కర్మచేయకయే మిథ్యాచారుడు కావచ్చును. ( 3 అధ్యాయమందలి 6 శ్లోకము చూడు)

సాంఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదంతి నపండితాః,
ఏక మప్యాస్థిత స్సమ్య గుభయో ర్విందతే ఫలమ్. 4

సాంఖ్యయోగములు అనగా జ్ఞానకర్మలు రెండును వేఱువేఱని యజ్ఞానులందురుకాని పండితులనరు. ఒకదాని యందు సుస్థిరుడైయుండువాడుకూడా రెంటిఫలమును పొందుచున్నాడు.

వ్యాఖ్యానము:-జ్ఞానయోగి లోకసంగ్రహరూపమగు కర్మయోగముయొక్క విశేషఫలమును సంకల్పమాత్రమున పొందుచున్నాడు. కర్మయోగి తన అనాసక్తి కారణమున బాహ్యకర్మ మాచరించుచుండియు జ్ఞానయోగిపొందు శాంతి నే అనాయాసముగా ననుభవించుచున్నాడు.

యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగై రపిగమ్యతే.
ఏకం సాంఖ్యంచ యోగంచ యః పశ్యతి స పశ్యతి. 5

సాంఖ్యుడు పొందుస్థానమునే యోగిసైతము పొందుచున్నాడు. కాబట్టి సాంఖ్యయోగములు రెండు నొక్కటియని చూచువాడే నిజము కనుగొనువాడు.

సన్న్యాసస్తు మహాబాహో దుఃఖ మాప్తుమయోగతః.
యోగయుక్తో మునిర్బ్రహ్మ నచిరేణాధిగచ్ఛతి. 6

మహాబాహో, కర్మయోగమువినా కర్మత్యాగము కష్టసాధ్యము కాని సమత్వముగలమౌని శీఘ్రముగా మోక్షమును పొందుచున్నాడు.

యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేంద్రియః,
సర్వభూతాత్మభూతాత్మా కుర్వన్నపి నలిప్యతే. 7

యోగమును సాధించినవాడు, హృదయమును శుభ్రపఱచుకొనినవాడు, మనస్సు నింద్రియములను జయించినవాడు, సకలభూతములను తనవలెనే యెంచువాడు, నగు మనుజుడు కర్మములాచరించుచున్నను వానినుండి నిర్లిప్తుడై యుండును.

నైవకించి త్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్,
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్నశ్నన్గచ్ఛన్ స్వపన్ శ్వసన్, 8

ప్రలపన్ విసృజన్ గృహ్ణ న్నున్మిష న్నిమిషన్నపి,
ఇంద్రియా ణీంద్రియార్థేషు వర్తంత ఇతి ధారయన్. 9

చూచుచు, వినుచు, తాకుచు, ఆఘ్రాణించుచు, తినుచు, నడచుచు, నిద్రించుచు ఊపిరితీయుచు, మాట్లాడుచు, విడుచుచు, తీసికొనుచు, కనులు తెఱచుచు, మూయుచు

నుండియు తత్త్వజ్ఞుడగు యోగి "కేవలమింద్రియములే తమ పనిని చేసికొనుచున్నవి" అని భావించి "నేనేమియు చేయుట లేదు" అని అనుకొనును.

వ్యాఖ్యానము:-అభిమానమున్నంతవఱకిట్టి నిర్లిప్తస్థితి లభింపనేరదు. కావున విషయాసక్తుడు "నేను విషయముల ననుభవించుటలేదు. ఇంద్రియములు తమపని చేయుచున్నవి" అని తప్పించుకొనజాలడు. ఇట్టి యనర్థ మొనరించువాడు గీతను గ్రహింపనేరడు, సరికదా ధర్మమునైన గ్రహింప జాలడు. ఈవిషయమును క్రిందిశ్లోకము స్పష్టము చేయుచున్నది.

బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతి యః,
లిప్యతే న స పాపేన పద్మపత్రమివాంభసా. 10

ఏమనుష్యుడు కర్మలను బ్రహ్మార్పణచేసి ఫలాపేక్ష వదలి యాచరించుచున్నాడో వాడు నీటియందున్న కమల పత్రము నిర్లిప్తమైయుండునట్లు పాపముచే నలిప్తుడైయుండును.

కాయేన మనసా బుద్ధ్యా కేవలై రింద్రియై రపి,
యోగినః కర్మ కుర్వంతి సంగం త్యక్త్వాஉஉత్మశుద్ధయే. 11

యోగులు శరీరముచేతను, మనస్సుచేతను, బుద్ధిచే తను, లేక కేవల మింద్రియములచేతనుకూడా ఆసక్తిరహితు లై యాత్మశుద్ధికొఱకు కర్మలు చేయుచున్నారు.

యుక్తః కర్మఫలం త్యక్త్వా శాంతి మాప్నోతి నైష్ఠికీమ్.
అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే. 12

సమత్వముకలవాడు కర్మఫలములను విడిచి పరమ

శాంతి పొందుచున్నాడు. అస్థిరచిత్తుడు కామయుక్తుడగు కారణమున ఫలాసక్తికిజిక్కి బంధనమొందుచున్నాడు.

సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖం వశీ,
నవద్వారే పురే దేహీ నైవకుర్వ న్న కారయన్. 13

జితేంద్రియుడగు పురుషుడు మనస్సుచేత సకలకర్మములవిడిచి తొమ్మిది ద్వారములుగల పట్టణమువంటి శరీరమందు వసించుచున్నను ఏమియు చేయకయు చేయింపకయు సుఖముగా నుండును.

వ్యాఖ్యానము:- రెండుముక్కులు, రెండు చెవులు, రెండు కండ్లు, మలములను వెలుపలకుత్రోయు రెండుస్థానములు నోరు ఇవి శరీరమునకు తొమ్మిది ముఖ్యద్వారములు. చర్మమందలి యసంఖ్యాకములగు బెజ్జములన్నియు ద్వారములే. ఈద్వారముల పాలకుడు, లోపలికి రాకపోకలుచేయు నధికారులనుమాత్రమే రానిచ్చుచు పోనిచ్చుచు తనధర్మము ననుష్ఠించుచున్నప్పుడు, అట్లుజరుగు రాకపోకలయందువాడు భాగస్థుడుకాడు కాని సాక్షిమాత్రుడైయుండును. కాబట్టి వాడు చేయుటలేదు. చేయించుటలేదు.

న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః
న కర్మ ఫలసంయోగం స్వభావస్తు ప్రవర్తతే. 14

జగత్ప్రభువు కర్తృత్వమునుగాని కర్మలనుగాని సృజించుటలేదు. కర్మఫల సంయోగమును కలిగించుటలేదు. ప్రకృతియే సర్వము చేయుచున్నది.

వ్యాఖ్యానము:-ఈశ్వరుడు కర్త కాడు. కర్మయొక్క నియమము అచలము ననివార్యమునై యున్నది. చేసినదానిని భరింపవలసియే వచ్చుచున్నది. ఇందీశ్వరుని యుత్కృష్టమగు కరుణయు న్యాయమును వెలయుచున్నవి. నిర్మలమగు న్యాయమందు నిర్మలమగు దయకలదు. న్యాయవిరుద్ధముగచూపు దయ దయకానేరదు. అది క్రూరతయేయగును. కాని మనుష్యుడు త్రికాలజ్ఞుడుకాడు. కావున వానికి దయయు, క్షమయు న్యాయమైయున్నవి. అతడు స్వయముగ నెల్లప్పుడు న్యాయపాత్రుడై క్షమను యాచించువాడైయున్నాడు. క్షమవలననే పరులకు న్యాయము తీర్పగలడు. క్షమయను గుణమును వికసింపజేసినపిమ్మట తుదకు అకర్తయును యోగియును, సమభావుడును కర్మకుశలుడును కాగలడు.

నాదత్తే కస్యచి త్పాపం న చైవ సుకృతం విభుః,
అజ్ఞానే నావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః. 15

ఈశ్వరుడు ఒకనిపాపమునుగాని పుణ్యమునుగాని తనపై నుంచుకొనడు. జ్ఞానమజ్ఞానావృతమై యున్నందున లోకులు మోహమున జిక్కిపోవుచున్నారు.

వ్యాఖ్యానము:-అజ్ఞానమువలన, "నేను చేయుచున్నాను" అను వృత్తివలన మనుష్యుడు కర్మబాధనమును బంధించుకొను చున్నాడు. అట్లయ్యును వాడు సుకృత దుష్కృత ఫలములను ఈశ్వరునియందారోపించు చున్నాడు. ఇది మోహజాలము.

జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశిత మాత్మనః,
తేషా మాదిత్యవ ద్జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్. 16

కాని ఎవని యజ్ఞానము ఆత్మజ్ఞానముచే నశించెనో సూర్యప్రభవంటి ప్రకాశమయమగు వాని అజ్ఞానము వానికి పరమతత్వ సందర్శనమును చేయించుచున్నది.

తద్బుద్ధయ స్తదాత్మాన స్తన్నిష్ఠా స్తత్పరాయణాః,
గచ్ఛంత్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః. 17

జ్ఞానముచేత పాపములు కడగబడినవారును ఈశ్వరుని ధ్యానించువారును తన్మయులును తన్నిష్ఠులును అతడే తమ సర్వస్వమని నమ్మియుండువారును మోక్షమును జెందు చున్నారు.

విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని,
శుని చైవ శ్వపాకే చ పండితా స్సమదర్శినః, 18

జ్ఞానులు విద్యావినయ సంపన్నుడగు బ్రాహ్మణుని యందును, గోవునందును, ఏనుగునందును, కుక్కయందును కుక్కమాంసముతిను మనుష్యునియందును సమదృష్టికలిగి యుందురు.

వ్యాఖ్యానము:-అనగా వారివారి యావశ్యకత ననుసరించి అందఱసేవ సేయుచుందురు. బ్రాహ్మణునిపట్లను, ఛండాలునిపట్లను, సమభావముంచుట యనగా బ్రాహ్మణు నొక పాముకఱచునపుడు వానిగాయమును జ్ఞాని ప్రేమభావముతో పీల్చి యందలి విషము నెట్లుతొలగించుటకు ప్రయత్నిం

చునో అట్టి చండాలుని పాముకఱచినప్పుడును ప్రయత్నించును.

ఇహైవ తైర్జిత స్సర్గో యేషాం సామ్యే స్థితం మనః,
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తే స్థితాః. 19

సమత్వమందెవ్వని మనస్సు సుస్థిరమైపోయినదో వాడీ దేహమందుండియే సంసారమును జయించియున్నాడు. బ్రహ్మము నిష్కళంకము సర్వసమము నగుటచే వాడా బ్రహ్మమందే స్థిరుడగుచున్నాడు.

వ్యాఖ్యానము:-మనుష్యుడెట్లు దేనిని చింతించుచున్నాడో అట్లేయగుచున్నాడు. కాబట్టి సమత్వమును చింతించి నిర్దోషియై సమత్వమూర్తియగు నిష్కళంక బ్రహ్మమును పొందుచున్నాడు.

నప్రహృష్యేత్ప్రియంప్రాప్య నోద్విజేత్ప్రాప్యచాప్రియమ్,
స్థిరబుద్ధిరసమ్మూఢో బ్రహ్మవిద్బ్రహ్మణి స్థితః. 20

ఎవ్వనిబుద్ధి స్థిరమైనదో, ఎవ్వనిమోహము నశించినదో, ఎవ్వడు బ్రహ్మము నెఱుగునో, ఎవ్వడు బ్రహ్మపరాయణుడై యున్నాడో, వాడు ప్రియమునుపొంది సుఖమని యెంచడు, అప్రియమునుపొంది దుఃఖమని యెంచడు.

బాహ్యస్పర్శేష్వసక్తాత్మా విందత్యాత్మని యత్సుఖమ్,
సబ్రహ్మయోగయుక్తాత్మా సుఖమక్షయమశ్నుతే. 21

బాహ్యవిషయము లయందాసక్తియుంచనిపురుషుడు, తన యంతఃకరణమందు ఏయానంద మనుభవించునో ఆ అక్ష

పరమానందమునే పైనతెల్పిన బ్రహ్మపరాయణుడు పొందు చున్నాడు.

వ్యాఖ్యానము:-అంతర్ముఖుడైనవాడే యీశ్వరసందర్శనము చేయగలడు. అతడే పరమానందము పొందుచున్నాడు. విషయనివృత్తుడై కర్మనుచేయుటయు, బ్రహ్మసమాధియందు రమించుచుండుటయునను రెండును భిన్నపదార్థములు కావు. అవి రెండును ఒకేవస్తువును చూచుటకుగల రెండుదృష్టులు- ఒకేనాణెముయొక్క యిరుప్రక్కలు.

యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే,
ఆద్యంతవంతః కౌంతేయ న తేషు రమతే బుధః 22

విషయజనిత భోగములుతప్పక దుఃఖకారణములే. కౌంతేయా, అవి ఆద్యంతములుగలవి. బుద్ధిమంతుడగు మానవుడట్టివానియందా సక్తుడు కాడు.

శక్నోతీహైవ యః సోఢుం ప్రాక్శరీరవిమోక్షణాత్,
కామక్రోధోద్భవం వేగం సయుక్తః స సుఖీ నరః. 23

ఏమనుష్యుడీ దేహాంతమునకుముందు, ఈ దేహము తోడనే, కామక్రోధముల వేగమును సహింపగలశక్తి నార్జించు చున్నాడో వాడు సమత్వమును పొందియున్నాడు. వాడు సౌఖ్యవంతుడు.

వ్యాఖ్యానము:-మృతశరీరమునకు ఇచ్ఛాద్వేషములు సుఖదుఃఖములునుండని విధమున నెవడు జీవముతోనుండియు శవమువలె-జడభరతునిరీతి దేహాతీతుడైయుండునో ఆమను

ష్యుడీ ప్రపంచమునందు విజయుడై యున్నాడు. వానికి యదార్థసుఖమేదో తెలియుచున్నది.

యో౽న్తస్సుఖో౽న్తరారామ స్తథాన్తర్జ్యోతి రేవ యః,
స యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతో౽ధిగచ్ఛతి. 24

ఎవని కాంతరికానందము కలదో ఎవనిహృదయమందు శాంతియున్నదో, ఎవనికి ముఖ్యముగ నంతర్జ్ఞానము కలిగినదో ఆబ్రహ్మస్వరూపుడైనయోగి బ్రహ్మనిర్వాణమును పొందుచున్నాడు.

లభన్తే బ్రహ్మనిర్వాణ మృషయః క్షీణకల్మషాః,
ఛిన్నద్వైధా యతాత్మానః సర్వభూతహితే రతాః. 25

ఎవనిపాపము నశించెనో, ఎవనిసంశయము లంతరించెనో, ఎవడు మనస్సుపై నధికారముపొందెనో, ఎవడు సకలభూతహితతత్పరుడైయున్నాడో ఆఋషి బ్రహ్మనిర్వాణము పొందుచున్నాడు.

కామక్రోధవియుక్తానాం యతీనాం యతచేతసామ్,
అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విదితాత్మనామ్. 26

తమ్ముతా మెఱుగువారు, కామక్రోధములను జయించినవారు, మనస్సును వశపఱచుకొన్నవారు, నగు యతులకు సర్వత్ర బ్రహ్మనిర్వాణమే కలదు.

స్పర్శాన్ కృత్వా బహిర్బాహ్యాంశ్చక్షుశ్చైవాన్తరే భ్రువోః,
ప్రాణాపానౌ సమౌ కృత్వా నాసాభ్యన్తరచారిణౌ. 27
యతేన్ద్రియమనోబుద్ధి ర్మునిర్మోక్షపరాయణః,
విగతేచ్ఛాభయక్రోధో యః సదా ముక్త ఏవ సః. 28

బాహ్యవిషయ భోగములను బహిష్కరించి, దృష్టిని భ్రూమధ్యమందునిలిపి ముక్కుగుండా వచ్చుచు పోవుచుండు ప్రాణాపానములయొక్కగతి సమానపఱచి, మనస్సును, బుద్ధిని, ఇంద్రియములను, వశపఱచుకొని, ఇచ్ఛాభయక్రోధములు లేనివాడై మోక్షపరాయణుడైయుండుముని సదా ముక్తుడేయై యున్నాడు.

వ్యాఖ్యానము:-లోపలినుండి బయటకు వెడలునదియే ప్రాణవాయువు. బయటనుండి లోపలికేగునదియే యపానవాయువు. ఈ శ్లోకమునందు ప్రాణాయామము మున్నగు యౌగిక క్రియల సమర్థనముకలదు. ప్రాణాయామము మున్నగునవి బాహ్యక్రియలు. శరీరమును స్వస్థముగానుంచి దానిని పరమాత్మ వసించుటకు తగిన మందిరముగా చేయువఱకు మాత్రమే వానిప్రభావమునకు శక్తి కలదు. సాధారణ వ్యాయామాదులచే భోగికే ప్రయోజనము కలుగుచున్నదో యా ప్రయోజనమే యోగికి ప్రాణాయామమువలన కలుగుచున్నది. భోగియొక్క వ్యాయామాదులు వానియింద్రియములు త్తేజితములగుటకు తోడ్పడుచున్నవి. ప్రాణాయామాదులు యోగిశరీరమును రోగరహితముగను సుదృఢముగను చేయుటయేగాక యింద్రియములను శాంతవంతములుగ నుంచుటయందును సహకారులగుచున్నవి. ఈరోజులలో ప్రాణాయామ విధులెఱిగినవారు చాలతక్కువగా నున్నారు. వారిలో చాల తక్కువమందియే వానిని సదుపయోగమునకు దెచ్చు

చున్నారు. ఎవ్వడింద్రియములపై మనస్సుపై బుద్ధిపై నధికము కాకపోయినను ప్రాథమిక విజయమైనను పొందియున్నాడో ఎవడు రాగద్వేషాదులను జయించి భయరహితుడై యున్నాడో, యట్టివానికి ప్రాణాయామాదులు ప్రయోజనకరములు, సాహాయ్యభూతములు కాగలవు. చిత్తశుద్ధిలేని ప్రాణాయామాదులు బంధనసాధనములై, మోహకూప మందట్టడుగునకు మానవుని నీడ్చుకొని పోగలవు. అనేకులకీ యనుభవముకలదు. కాబట్టి పతంజలి యోగీంద్రుడు యమనియమములకు ప్రథమస్థానమిచ్చి తత్సాధకులకొఱకే ప్రాణాయామాదికములు మోక్షమార్గమునకు సాహాయ్య భూతములుగ భావించినాడు. యమములైదు. అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము; నియమములయిదు. శౌచము, సంతోషము, తపము, స్వాధ్యాయము, ఈశ్వరప్రణిధానము.

భోక్తారం యజ్ఞతపసాం సర్వలోకమహేశ్వరమ్,
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతిమృచ్ఛతి. 29

యజ్ఞములయొక్కయు తపస్సులయొక్కయు భోక్తననియు సర్వలోకములకు మహేశ్వరుడననియు సకల భూతములకు హితముగూర్చు వాడననియు నన్నెఱిగి (అట్టిముని) శాంతిపొందుచున్నాడు.

వ్యాఖ్యానము:-ఈ యధ్యాయముయొక్క పదునాల్గవ పదునైదవ శ్లోకములకును, ఇట్టివేయగుకొన్ని యితర శ్లోక

ములకును ఈశ్లోకము విరుద్ధమైయున్నదని యెవ్వరును భావింపరాదు. ఈశ్వరుడు సర్వశక్తివంతుడై యుండియు కర్తగను, అకర్తగను, భోక్తగను, అభోక్తగను, ఎట్లనుకొన్న నట్లే యున్నాడు. లేడు. వాడవర్ణనీయుడు. మనుష్యవాక్కులకతీతుడు. కాబట్టి మనుష్యుడు వానియందు పరస్పర విరుద్ధములగు గుణములను శక్తులను ఆరోపించి వానిని దర్శింపనాశపడుచున్నాడు.

ఓమ్, తత్సత్.

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగ
శాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే జ్ఞానకర్మసన్న్యాసయోగోనామ
పంచమోఽధ్యాయః.

ఈప్రకారము శ్రీమద్భగవద్గీతా-ఉపనిషత్ అనగా బ్రహ్మవిద్యాంతర్గత యోగశాస్త్రమందలి శ్రీకృష్ణార్జున సంవాదమందు కర్మసన్న్యాసయోగమను పేరుగల యైదవ అధ్యాయము ముగిసినది.



# ధ్యానయోగము.

## షష్ఠాధ్యాయము

---

ఈయధ్యాయమందు యోగసాధనకు అనగా సమత్వమును పొందుటకు అనేకసాధనములు తెలుపబడినవి.

శ్రీభగవానువాచ:—

అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః।
స సన్న్యాసీ చ యోగీ చ న నిరగ్ని ర్నచాక్రియః. 1

శ్రీభగవానుడు చెప్పుచున్నాడు:-కర్మఫలము నాశ్రయింపక యెవ్వడు విహితకర్మములు చేయుచున్నాడో వాడు సన్న్యాసి వాడు యోగి. అగ్నిహోత్రమును సకలకర్మములను విడిచి కూర్చుండి యున్నవాడు సన్న్యాసియు యోగియు కాజాలడు.

వ్యాఖ్యానము:- అగ్నియన సకలసాధనములని భావము. అగ్నిప్రధానముగా హోమములు జరుగుచున్నపుడు అగ్నియావశ్యకమై యుండెను. ఈయుగమున రాట్నము సేవా సాధనమని భావించుచో దానిని విడచుటచే సన్న్యాసి కాజాలడు.

యం సన్న్యాస మితి ప్రాహు ర్యోగం తం విద్ధి పాండవ,
న హ్యసన్న్యస్తసంకల్పో యోగీ భవతి కశ్చన. 2

పాండవా, దేనిని సన్న్యాసమందురో, దానినే యోగమని నీవెఱుగుము. మనోసంకల్పములను విడువనివాడు యోగి కాజాలడు.

ఆరురుక్షో ర్మునే ర్యోగం కర్మ కారణ ముచ్యతే,
యోగారూఢస్య తస్యైవ శమః కారణ ముచ్యతే. 3

యోగముసాధించువానికి కర్మసాధనమై యున్నది. యోగము సాధించినవానికి శాంతిసాధనమైయున్నది.

వ్యాఖ్యానము:-ఎవనియాత్మ పరిశుద్ధమైనదో, ఎవనికి సమత్వము సిద్ధించెనో వానికాత్మ సందర్శనము సులభము. యోగారూఢుడగు వ్యక్తికి లోకసంగ్రహార్థమైనను కర్మచేయవలసిన యవసర ముండదనుట దీనిభావముకాదు. అట్టివాడు లోకసంగ్రహము విడిచి జీవింపనేలేడు. సేవాకర్మయాచరించుటయు నాతనికి సులభముగానే యుండును. ఆతడు విడంబనము కొఱకేదియు చేయడు. అధ్యాయము 3-4, అధ్యాయము 5-2 తో కలిపిచూడుడు.

యదాహి నేంద్రియార్థేషు నకర్మ స్వనుషజ్జతే,
సర్వసంకల్పసన్న్యాసీ యోగారూఢ స్తదోచ్యతే. 4

ఎప్పుడు మనుష్యుడింద్రియ విషయములందుగాని కర్మలయందుగాని యాసక్తుడుగాక సకలసంకల్పములను త్యజించునో అపుడు వాడు యోగారూఢుడనిపించుకొనును.

ఉద్ధరే దాత్మనాఽఽత్మానం నాత్మాన మవసాదయేత్,
ఆత్మైవ హ్యాత్మనో బంధు రాత్మైవ రిపురాత్మనః. 5

మనుష్యుడాత్మచే నాత్మనుద్ధరించుకోవలయును. దాని నధోగతిపాలు చేయరాదు. ఆత్మయే ఆత్మకు బంధువు. ఆత్మయే ఆత్మకు శత్రువు.

బంధురాత్మాఽఽత్మనస్తస్య యేనాత్మైవాత్మనా జితః,
అనాత్మనస్తు శత్రుత్వే వర్తేతాత్మైవ శత్రువత్. 6

స్వశక్తివలన మనస్సును జయించినవానికి ఆత్మ బంధువు. మనస్సును జయింపనివాడు తనతోడనే తాను శత్రువువలె వర్తించును.

జితాత్మనః ప్రశాంతస్య పరమాత్మా సమాహితః,
శీతోష్ణసుఖదుఃఖేషు తథా మానావమానయోః. 7

ఎవ్వడు తనమనస్సునుజయించి సంపూర్ణశాంతుడయ్యెనో వానియాత్మ శీతోష్ణములయందు సుఖదుఃఖములయందు మానావమానములయందు నొకేవిధముగ నుండును.

జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా కూటస్థో విజితేంద్రియః,
యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాంచనః. 8

జ్ఞానముచేత ననుభవముచేత తృప్తుడైనట్టియు, నిశ్చలుడైనట్టియు ఇంద్రియములను జయించినట్టియు మన్ను, రాయి, బంగారు, వీనియందు సమభావము కలిగినట్టియు ఈశ్వర పరాయణుడునగు మనుష్యుని యోగియందురు.

సుహృన్మిత్రార్యుదాసీన మధ్యస్థ ద్వేష్యబంధుషు,
సాధుష్వపిచ పాపేషు సమబుద్ధిర్విశిష్యతే. 9

ఉపకారులు, మిత్రులు, శత్రువులు, ఉదాసీనులు,

మధ్యస్థులు, ద్వేషులు, బంధువులు, సాధువులు, పాపాత్ములు వీరందఱియందు సమభావము కలిగియుండువాడు శ్రేష్ఠుడు.

యోగీ యుంజీత సతత మాత్మానం రహసి స్థితః,
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీ రపరిగ్రహః. 10

చిత్తమును నిశ్చలమొనరించి వాసనలను, సంగ్రహమును వదలి, ఏకాంతస్థానమందొంటరిగానుండి యోగి సదా ఆత్మను పరమాత్మతో ఐక్యపఱచవలయును.

శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిర మాసన మాత్మనః,
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చైలాజిన కుశోత్తరమ్. 11
తత్రైకాగ్రం మనఃకృత్వా యతచిత్తేంద్రియక్రియః,
ఉపవిశ్యాసనే యుంజ్యా ద్యోగ మాత్మవిశుద్ధయే. 12

మిక్కిలి పల్లము, మిక్కిలియెత్తు, లేనట్లు పవిత్రస్థానమందు, తనకొఱకు కుశాసనము, కృష్ణాజినము, వస్త్రము నను వాని నొకదానిపై నొకటి పఱచి సిద్ధాసనముచేసికొని, దానిపై నేకాగ్రచిత్తముతో కూర్చుండి, మనస్సును ఇంద్రియములను వశపఱచుకొని ఆత్మశుద్ధికై యోగమును సాధింపవలయును.

సమం కాయ శిరో గ్రీవం ధారయ న్నచలం స్థిరః,
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వందిశ శ్చానవలోకయన్ 13
ప్రశాంతాత్మా విగతభీ ర్బ్రహ్మచారి వ్రతే స్థితః,
మన స్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః. 14

శరీరమును, కంఠమును, శిరస్సును తిన్నగా కదలకుండ నిలిపి, సుస్థిరుడై యిటునటుచూడకుండా, తననాసికాగ్రమందు

దృష్టినిలిపి, సంపూర్ణశాంతితో, నిర్భయుడై బ్రహ్మచర్యమందు దృఢముగ నిలిచి, మనస్సును జయించి మత్పరాయణుడైయున్న యోగి నన్ను ధ్యానించుచు కూర్చుండవలయును.

వ్యాఖ్యానము:-నాసికాగ్రమనగా కనుబొమలకుమధ్య స్థానము. 5వ అ. 27 శ్లో. చూడుడు. బ్రహ్మచర్యవ్రత భావము కేవల వీర్యసంగ్రహమే కాదు. అందు బ్రహ్మప్రాప్తికి వలయు నహింసాది వ్రతములన్నియు చేరియున్నవి.

యుంజ న్నేవం సదాత్మానం యోగీ నియతమానసః,
శాంతిం నిర్వాణపరమాం మత్సంస్థా మధిగచ్ఛతి. 15

ఇవ్విధముగ నెవ్వనిమనస్సు నియమమందున్నదో యాయోగి యాత్మను పరమాత్మతో నైక్యపఱచుచున్నాడు. మఱియు మత్ప్రాప్తిచే లభించు మోక్షరూపమగు పరమ శాంతిని బొందుచున్నాడు.

నా త్యశ్నతస్తు యోగోఽస్తి న చైకాంత మనశ్నతః,
నచాతి స్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున. 16

అర్జునా, ధ్యానమనెడు యోగము మిక్కిలి తినువారికిగాని, కేవలముపవాస మొనరించువారికిగాని లభింపదు. అట్లేయది మిక్కిలి నిద్రించువారికిగాని మిక్కిలి మేల్కొనియుండువారికిగాని లభింపదు.

యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు,
యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా. 17

ఏమనుష్యుడాహార విహారములయందును, ఇతరకర్మల

యందును, నిద్రించుటయందును, మేల్కొనుటయందును, పరిమితికలవాడై యుండునో వానియోగము దుఃఖము నశింపజేయున దగుచున్నది.

యదా వినియతం చిత్త మాత్మన్యే వావతిష్ఠతే,
నిః స్పృహః సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా. 18

బాగుగా నియమబద్ధమైన మనస్సు ఎప్పుడాత్మయందు స్థిరముగనుండునో, మనుష్యుడెప్పు డన్నికోరికలనుండి నిస్పృహుడై యుండునో యప్పుడువాడు యోగియనిపించుకొనును.

యథా దీపో నివాతస్థో నేంగతే సోపమాస్మృతా,
యోగినో యతచిత్తస్య యుంజతో యోగ మాత్మనః. 19

ఆత్మను పరమాత్మతో కలుపుటకొఱకు యత్నించు స్థిరచిత్తుడగు యోగియొక్కస్థితి గాలి లేనిచోట నిశ్చలముగ నుండు దీపమువంటిదని చెప్పబడినది.

యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా,
యత్రచైవాత్మనాఽఽత్మానం పశ్యన్నాత్మని తుష్యతి. 20
సుఖ మాత్యంతికం యత్త ద్బుద్ధిగ్రాహ్య మతీంద్రియమ్,
వేత్తి యత్ర నచైవాయం స్థిత శ్చలతి తత్త్వతః. 21
యం లబ్ధ్వాచాపరం లాభం మన్యతే నాధికం తతః,
యస్మిన్ స్థితో నదుఃఖేన గురుణాపి విచాల్యతే. 22
తం విద్యా ద్దుఃఖసంయోగ వియోగం యోగసంజ్ఞితమ్,
స నిశ్చయేన యోక్తవ్యో యోగో ఽనిర్విణ్ణచేతసా. 23

యోగానుష్ఠానముచే స్వాధీనమునకు వచ్చియున్న మనస్సు ఎచ్చోట శాంతిపొందుచున్నదో, ఆత్మవలననే ఆత్మను తెలిసికొని యాత్మయందెచ్చోట మనుష్యుడు సంతోషము పొందుచున్నాడో, ఇంద్రియములకు పరమైనదియు బుద్ధిచే గ్రహింపదగినదియు నగు ననంత సుఖానుభవ మెచ్చోట గలుగుచున్నదో ఎచ్చోటనిలిచి మనుష్యుడు మూల తత్త్వమువలన చలింపకున్నాడో, దేనిని పొందినపిదప దాని కంటె నితర లాభముల నధికముగా నెంచకున్నాడో, దేని యందు స్థిరుడై మహాదుఃఖముల వలననైతము తత్తరపడకున్నాడో, దుఃఖప్రసంగము లేని యాస్థితి యోగస్థితి యను పేరుగలదని తెలిసికోవలెను. ఈయోగము విసుగుచెందక పట్టుదలతో సాధింపదగినది.

సంకల్ప ప్రభవాన్ కామాం స్త్యక్త్వా సర్వా నశేషతః,
మనసై వేంద్రియగ్రామం వినియమ్య సమంతతః. 24
శనైశ్శనై రుపరమే ద్బుద్ధ్యా ధృతిగృహీతయా,
ఆత్మసంస్థం మనః కృత్వా నకించిదపి చింతయేత్. 25

సంకల్పముచే నుత్పన్నములగు సకల కామములను బూర్తిగావిడిచి, మనస్సుచేతనే యింద్రియ సమూహము నన్నివైపులనుండియు బాగుగా నిగ్రహించి యోగి నిశ్చల బుద్ధితో మెల్లమెల్లన శాంతుడగుచుండవలెను. మఱియు మనస్సు నాత్మయందుచేర్చి వేఱేదియు విచారింపకుండవలయును.

యతో యతో నిశ్చరతి మన శ్చంచల మస్థిరమ్,
తత స్తతో నియమ్యైత దాత్మన్యేవ వశం నయేత్. 26

చంచలమైనదియు నస్థిరమైనదియు నగు మనస్సు ఏయేతావులకు బరుగులిడుచుండునో యాయాతావులనుండి (యోగి) దానిని, మరలించి తనయధీనమునకు తేవలయును.

ప్రశాన్త మనసం హ్యేనం యోగినం సుఖ ముత్తమమ్
ఉపైతి శాంతరజసం బ్రహ్మభూత మకల్మషమ్. 27

ఎవ్వని మనస్సు బాగుగా శాంతిపొందినదో, ఎవని వికారములు శాంతించినవో, బ్రహ్మమయుడు నిష్పాపుడునైన యట్టి యోగి తప్పక యుత్తమసుఖమును పొందుచున్నాడు.

యుంజ న్నేవం సదాత్మానం యోగీ విగతకల్మషః,
సుఖేన బ్రహ్మసంస్పర్శ మత్యంతం సుఖమశ్నుతే. 28

ఆత్మతో నిత్యాను సంధానము చేయుచున్న పాపరహితుడైన యీ యోగి బ్రహ్మప్రాప్తియను అనంతసుఖమనుభవించు చున్నాడు.

సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః. 29

సర్వత్ర సమభావము కలిగియున్న యోగి తన్ను సకలభూతములయందును, సకలభూతములను తనయందును చూచుచున్నాడు.

యోమాం పశ్యతి సర్వత్ర సర్వంచ మయి పశ్యతి,
తస్యాహం నప్రణశ్యామి సచమే నప్రణశ్యతి. 30

ఎవడు సర్వత్ర నన్ను చూచుచుండునో, నాయందు సర్వమును చూచుచుండునో వాడు నాదృష్టికి బరోక్షముగా

నుండడు. నేను వానిదృష్టికి బరోక్షముగా నుండను.

సర్వభూతస్థితం యో మాం భజ త్యేకత్వ మాస్థితః,
సర్వథా వర్తమానోఽపి సయోగీ మయివర్తతే. 31

ఏయోగి నాయందు లీనుడగుచు సకలభూతములయం దుండునన్ను భజించుచున్నాడో వాడు ఎట్లు వర్తించుచున్నను నాయందే వర్తించుచున్నాడు.

వ్యాఖ్యానము:-"నేను" ఉన్నంతవఱకు పరమాత్మ పరుడై యున్నాడు. "నేను" నశించినపిదప శూన్యమైనప్పుడే యేకమగు పరమాత్మను సర్వత్ర గాంచుచున్నాడు. మఱియు అధ్యాయము 13. శ్లో 23. వ్యాఖ్యానము చూడుడు.

ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున,
సుఖంవా యదివా దుఃఖం సయోగీ పరమోమతః. 32

అర్జునా, ఏమనుష్యుడు తనవలెనే యెల్లఱ జూచుచున్నాడో సుఖమైనను దుఃఖమైనను రెంటిని సమముగా భావించుచున్నాడో వాడు యోగిశ్రేష్ఠుడని యెంచబడుచున్నాడు.

అర్జున ఉవాచ:—

యోఽయంయోగస్త్వయాప్రోక్త స్సామ్యేన మధుసూదన,
ఏతస్యాహం నపశ్యామి చంచలత్వాత్ స్థితిం స్థిరామ్. 33

అర్జునుడు చెప్పుచున్నాడు:-మధుసూదనా, నీవు చెప్పిన యీ (సమత్వ) యోగముయొక్క స్థిరత్వమును నేను చపలత్వమువలన కనుగొనలేకున్నాను.

చంచలం హిమనః కృష్ణ ప్రమాథి బలవద్దృఢమ్,
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్. 34

ఎందుకనగా, కృష్ణా, ఈమనస్సు కేవలము చంచలమైనది. మనుష్యుని మథించివేయుచున్నది. మఱియు మిగుల బలిష్ఠమైనది. వాయువునణచుటయెట్లు మిక్కిలికష్టమో అట్లే మనస్సును వశపఱచుకొనుటయును కష్టమని తలచుచున్నాను

శ్రీభగవానువాచ:—

అసంశయం మహాబాహో! మనోదుర్నిగ్రహం చలమ్,
అభ్యాసే న తు కౌంతేయ వైరాగ్యేణచ గృహ్యతే 35

శ్రీభగవానుడు చెప్పుచున్నాడు:-మహాబాహూ, సత్యము. మనస్సు చంచలమైనదగుటచే దానిని వశపఱచుకొనుట కష్టమేఐనను, కౌంతేయా, అభ్యాసమువలనను, వైరాగ్యమువలనను, దానిని వశపఱచుకొనవచ్చును.

అసంయ తాత్మనా యోగో దుష్ప్రాపఇతి మే మతిః,
వశ్యాత్మనాతు యతతా శక్యోఽవాప్తు ముపాయతః. 36

మనస్సు స్వాధీనములో లేనివారికి యోగసాధనము మిక్కిలి కష్టమని నామతము. కాని మనస్సును వశపఱచుకొన్నవాడును, ప్రియత్నశీలుడును అగువాడు ఉపాయముచే సాధింపగలడు.

అర్జున ఉవాచ:—

అయతి శ్శ్రద్ధయో పేతో యోగాచ్చలిత మానసః,
అప్రాప్య యోగ సంసిద్ధిం కాం గతిం కృష్ణ గచ్ఛతి. 37

అర్జునుడు చెప్పుచున్నాడు:—కృష్ణాఎవడు శ్రద్ధగలవాడై యుండియు ప్రయత్నమందు, మందుడైయున్న కారణముచేత యోగభ్రష్టుడగుచున్నాడో అట్టివాడు సఫలత నొందక ఏగతిని పొందుచున్నాడు?

కచ్చి న్నోభయవిభ్రష్ట శ్ఛిన్నాభ్ర మివ నశ్యతి,
అప్రతిష్ఠో మహాబాహో! విమూఢో బ్రహ్మణః పథి. 38

మహాబాహూ, యోగభ్రష్టుడైనట్టియు, బ్రహ్మమార్గమును తప్పియున్నట్టియు మనుష్యుడు విచ్ఛిన్నమేఘము వలెను భయభ్రష్టుడై నశింపడుకదా?

ఏతన్మే సంశయం కృష్ణ! ఛేత్తు మర్హ స్యశేషతః,
త్వదన్య స్సంశయ స్యాస్య ఛేత్తా న హ్యుపపద్యతే. 39

కృష్ణా, ఈనాసందేహమునుదీర్ప నీవు యోగ్యుడవు. నీవుతప్ప యీ సంశయమును తీర్చువాడు ఇంకొకడు దొరకడు.

శ్రీ భగవానువాచ.

పార్థ! నైవేహనాముత్ర వినాశ స్తస్య విద్యతే,
నహి కల్యాణకృ త్కశ్చి ద్దుర్గతిం తాత! గచ్ఛతి. 40

శ్రీభగవానుడు చెప్పుచున్నాడు:-పార్థా, ఇట్టి మనుష్యులకు ఈలోకమందుగాని పరలోకమందుగాని నాశనము కలుగదు. తాతా, కల్యాణమార్గము ననుసరించువారి కెన్నడును దుర్గతి కలుగనేరదు.

ప్రాప్య పుణ్యకృతాం లోకా నుషిత్వా శాశ్వతీ స్సమాః,
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే. 41

పుణ్యాత్ము లేస్థానమును పొందుచున్నారో దానినే పొంది అక్కడ చాలాకాలముండిన పిదప యోగభ్రష్టుడగు వాడు పవిత్రులు, సాధనసంపన్నులునగువారి గృహమందు జన్మించుచున్నాడు.

అథవా యోగినా మేవ కులే భవతి ధీమతామ్,
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్. 42

లేదేని జ్ఞానవంతులగు యోగుల వంశమందతడు జన్మించుచున్నాడు. ప్రపంచమందిట్టి జన్మనిస్సంశయముగ మిక్కిలి దుర్లభము.

తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికమ్,
యతతే చ తతో భూయః సంసిద్ధౌ కురునందన. 43

కురునందనా, అచ్చట వానికి పూర్వజన్మమందలి బుద్ధి సంస్కారము లభించుచున్నది. అక్కడనుండి మోక్షము కొఱకు వాడు ముందుకు సాగుచున్నాడు.

పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః,
జిజ్ఞాసు రపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే. 44

ఆపూర్వాభ్యాస కారణముచేతనే వాడు యోగము వైపు ఆకర్షింపబడు చున్నాడు. యోగజిజ్ఞాసువుకూడా కామముతోకూడిన వైదికకర్మల జేయువారిస్థితిని దాటు చున్నాడు.

ప్రయత్నా ద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః
అనేకజన్మసంసిద్ధ స్తతో యాతి పరాంగతిమ్. 45

శ్రద్ధతో ప్రయత్నించుచుండు యోగి పాపములనుండి

ముక్తుడై యనేకజన్మలనుండి విశుద్ధుడగుచు తుదకు పరమ గతిని పొందుచున్నాడు.

తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః,
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున. 46

అర్జునా, యోగి, తపస్వికంటె శ్రేష్ఠుడు. జ్ఞానికంటెను కూడా అధికుడు. అట్లేయతడు కర్మకాండ నాచరించు వానికంటెకూడా గొప్పవాడు. కాబట్టి నీవు యోగివగుము.

వ్యాఖ్యానము:-ఇచ్చట తపస్వియొక్క తపస్సు ఫలాసక్తితోకూడినది. జ్ఞానియనగా ననుభవ జ్ఞానికాడు.

యోగినామపి సర్వేషాం మద్గతేనాంతరాత్మనా,
శ్రద్ధావాన్ భజతే యోమాం సమే యుక్తతమోమతః. 47

నాయందు మనసుచేర్చి శ్రద్ధతో నన్నుభజించుచున్న వానినే యోగులందరిలో సర్వశ్రేష్ఠుడగు యోగియని నే భావింతును.

ఓమ్, తత్సత్.

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగ
శాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే ఆత్మసంయమ యోగోనామ
షష్ఠోఽధ్యాయః.

ఈప్రకారము శ్రీమద్భగవద్గీతా-ఉపనిషత్ అనగా బ్రహ్మవిద్యాంతర్గత యోగశాస్త్రమందలి శ్రీకృష్ణార్జున సంవాదమందు ధ్యానయోగమను ఆరవ యధ్యాయము ముగిసినది.



# జ్ఞాన విజ్ఞాన యోగము.

## సప్తమాధ్యాయము



ఈయధ్యాయమం దీశ్వర తత్వము, ఈశ్వరభక్తి అన నేమియో బోధించుట ప్రారంభింప బడినది.

శ్రీభగవానువాచ:—

మయ్యాసక్తమనాః పార్థ! యోగం యుంజన్మదాశ్రయః,
అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు. 1

శ్రీభగవానుడు చెప్పుచున్నాడు:-పార్థా, నాయందు మనస్సుచేర్చి, నన్నాశ్రయించి యోగముసాధించుచు నిశ్చయపూర్వకముగ, సంపూర్ణముగ, నన్నెట్లు నీవు తెలిసికొనగలవో వినుము.

జ్ఞానం తేఽహం సవిజ్ఞాన మిదం వక్ష్యా మ్యశేషతః,
యజ్జ్ఞాత్వా నేహభూయోఽన్య జ్జ్ఞాతవ్య మవశిష్యతే. 2

అనుభవయుక్తమగు నీజ్ఞానమును నీకు పూర్తిగా చెప్పెదను. దీని నెఱిగినపిదప ఈలోకమందు తెలిసికొనదగు విశేషమేదియు మిగులదు.

మనుష్యాణాం సహస్రేషు కశ్చి ద్యతతి సిద్ధయే.
యతతా మపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః. 3

వేలకొలది మనుష్యులలో నొక్కఁడుమాత్రమే సిద్ధి

కొఱకు ప్రయత్నించు చున్నారు. ప్రయత్నించిన సిద్ధులలో నొకానొకడు మాత్రమే నన్ను యథార్థముగా తెలిసికొను చున్నాడు.

భూమి రాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధి రేవచ,
అహఙ్కార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా. 4

పృథివి, ఉదకము, అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు బుద్ధి, అహంభావము అని నాప్రకృతి యెనిమిదివిధములు గలది.

వ్యాఖ్యానము:-ఈయెనిమిది తత్త్వములతో కూడిన స్వరూపము క్షేత్రము లేక క్షరపురుషుడైయున్నది. అధ్యా. 13. శ్లో. 5, అధ్యా. 15. శ్లో. 16; చూడుడు.

అప రేయ మితస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్,
జీవభూతాం మహాబాహో! యయేదం ధార్యతే జగత్. 5

ఇది అపరా ప్రకృతి, దీనికంటెను శ్రేష్ఠమైన జీవస్వరూపమగు పరాప్రకృతిగలదు. మహాబాహూ, ఈజగత్తు దీని యాధారముపై వర్తించుచున్నది.

ఏతద్యోనీని భూతాని సర్వాణీ త్యుపధారయ,
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయ స్తథా. 6

సకలభూతముల యుత్పత్తికికారణ మీరెండని యెఱుగుము. సమస్తజగత్తుయొక్క ఉత్పత్తిలయములకు నేను కారణమై యున్నాను.

మత్తః పరతరం నాన్యత్కించిదస్తి ధనంజయ!
మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ. 7

ధనంజయా, నాకంటె ఉత్కృష్టమైనది వేఱేదియును లేదు. దారమున మణులుగుచ్చబడియున్నట్లు ఇవియన్నియు నాయందు గూర్చబడియున్నవి.

రసోఽహ మప్సు కౌంతేయ ప్రభాస్మి శశిసూర్యయోః,
ప్రణవ స్సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు. 8
పుణ్యో గంధః పృథివ్యాంచ తేజశ్చాస్మి విభావసౌ,
జీవనం సర్వభూతేషు తప శ్చాస్మి తపస్విషు. 9

కౌంతేయా, జలమందు రసమును నేను. సూర్యచంద్రులయందు తేజస్సును నేను. అన్నివేదములయందు ఓంకారమును నేను. ఆకాశమందు శబ్దమును నేను. పురుషుల పరాక్రమమును నేను. పృథ్వియందు సుగంధము నేను. అగ్నియందు తేజస్సు నేను. భూతములయందు జీవమును నేను. తపస్సులయొక్క తపస్సు నేను.

బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ సనాతనమ్.
బుద్ధి ర్బుద్ధిమతా మస్మి తేజ స్తేజస్వినా మహమ్. 10

పార్థా, సమస్తజీవుల సనాతనమగు బీజమును నేనని యెఱుగుము. బుద్ధిమంతుల బుద్ధిని నేను. తేజోవంతులయందు తేజమును నేను.

బలం బలవతా మస్మి కామరాగవివర్జితమ్,
ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ. 11

భరతర్షభా, బలవంతులయొక్క కామరాగములులేని బలము నేను, భూతములయందలి ధర్మవిరుద్ధముకాని కామము నేను.

యేచైవ సాత్వికాభావా రాజసా స్తామసాశ్చయే,
మత్త ఏవేతి తా న్విద్ధి నత్వహం తేషు తే మయి. 12

సాత్వీక రాజస తామస భావములన్నియు నావలననే పుట్టినవని తెలిసికొమ్ము. కాని నేను వానియందు లేను. అవి నాయందున్నవి.

వ్యాఖ్యానము:-పరమాత్మ యీభావములపై నాధారపడి యుండలేదు. కాని యీభావము లాతనిపై నాధారపడి యున్నవి. అతనిమీదనే యాధారపడి యతనివశమందున్నవి.

త్రిభి ర్గుణమయై ర్భావై రేభిస్సర్వ మిదం జగత్,
మోహితం నాభిజానాతి మా మేభ్యః పర మవ్యయమ్. 13

ఈ త్రిగుణాత్మికములగు భావములవలన ప్రపంచమంతయు మోహితమగుచున్నది కావున వానికంటె నున్నతుడనై పరుడనైయున్న అవి నాశినగు నన్నది తెలికొసిన జాలకున్నది.

దైవీ హ్యేషా గుణమయీ మమమాయా దురత్యయా,
మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతితే. 14

త్రిగుణాత్మకమైన యీనాదైవ మాయను దాటుట కష్టము. కాని యెవరు నన్నేశరణుజొచ్చుచున్నారో వారీ మాయను దాటుచున్నారు.

నమాం దుష్కృతినో మూఢాః ప్రపద్యంతే నరాధమాః,
మాయయాపహృతజ్ఞానా ఆసురం భావ మాశ్రితాః. 15

దురాచారులు, మూఢులు, మనుష్యాధములు నన్ను

శరణుజొచ్చుటకు రారు. వారు రాక్షసస్వభావులైయుందురు. మాయ వారిజ్ఞానమును హరించియున్నది.

చతుర్విధా భజంతే మాం జనా స్సుకృతినోఽర్జున,
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీచ భరతర్షభ. 16

అర్జునా, ఆర్తులు, జిజ్ఞాసులు, అర్థార్థులు, జ్ఞానులు అనునాల్గుతెగల సదాచారులు నన్నుభజించుచున్నారు.

తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తి ర్విశిష్యతే
ప్రియోహి జ్ఞానినోఽత్యర్థ మహం సచ మమప్రియః. 17

ఒకనినే భజించు నిత్యసమభావముగలజ్ఞాని వీరిలో శ్రేష్ఠుడు. నేను జ్ఞానికి మిక్కిలి ప్రియుడను. జ్ఞానినాకు ప్రియుడు.

ఉదారా స్సర్వఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్,
ఆస్థిత స్సహి యుక్తాత్మా మామేవా నుత్తమాంగతిమ్. 13

ఈభక్తులందఱు నుత్తములే, అయినను జ్ఞానినా ఆత్మయేయని నామతము. ఎందుకనగా నన్నుపొందుటకంటె అధికమగు నుత్తమగతి వేఱొకటి లేనేలేదని తెలిసికొని ఆయోగి నన్నే యాశ్రయించును.

బహూనాం జన్మనా మంతే జానవాన్ మాం ప్రపద్యతే,
వాసుదేవ స్సర్వమితి స మహాత్మా సుదుర్లభః. 19

అనేకజన్మలకు చివర జ్ఞానినన్ను పొందుచున్నాడు. "సర్వము వాసుదేవమయం అనువిషయము తెలియు మహాత్ముడు కడుదుర్లభుడు.

కామైస్తైస్తైర్హృతజ్ఞానాః ప్రపద్యంతేఽన్యదేవతాః,
తం తం నియమ మాస్థాయ ప్రకృత్యా నియతా స్స్వయా. 20

పెక్కు కోర్కెలచే జ్ఞానము నశించినవారు తమ స్వభావానుసారము భిన్నభిన్నవిధుల నాశ్రయించి వేఱు దేవతలను శరణుజొచ్చుటకు పోవుచున్నారు.

యోయో యాంయాం తనుం భక్తశ్శ్రద్ధయార్చితు మిచ్ఛతి,
తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహమ్. 21

ఏయేమనుష్యుఁడే యేస్వరూపమునందు శ్రద్ధాయుక్తుఁడై భక్తితో నుండగోరుచున్నాఁడో ఆయాస్వరూపమునందు వాని శ్రద్ధను నేను దృఢపఱచుచున్నాను.

సతయా శ్రద్ధయా యుక్త స్తస్యారాధన మీహతే,
లభతేచ తతః కామాన్ మయైవ విహితాన్ హితాన్. 22

వాఁడు శ్రద్ధతో నాయాస్వరూపముల నారాధించుచు దానివలన నాచేనిర్మితమైనట్టియు తానుకోరినట్టియు కామముల నెరవేర్చుకొనుచున్నాఁడు.

అంతవత్తు ఫలం తేషాం తద్భవ త్యల్ప మేధసామ్,
దేవాన్ దేవ యజో యాంతి మద్భక్తాయాంతి మామపి. 23

ఈయల్ప బుద్ధులకు లభించుఫలము నశించునదై యున్నది. దేవతలను భజించువారు దేవతలను పొందుచున్నారు. నన్నుభజించువారు నన్నుపొందుచున్నారు.

అవ్యక్తం వ్యక్తి మాపన్నం మన్యంతే మామబుద్ధయః,
పరంభావ మజానంతో మమావ్యయ మనుత్తమమ్. 24

నాశములేనట్టియు సాటిలేనట్టియు నాపరమ స్వరూపమును నెఱుగని యవివేకులు ఇంద్రియాతీతుడనగు నన్ను ఇంద్రియ గమ్యునిగ భావించుచున్నారు.

నాహంప్రకాశ స్సర్వస్య యోగమాయా సమావృతః,
మూఢోఽయంనాభిజానాతి లోకోమామజ మవ్యయమ్. 25

నాయోగమాయచే నాచ్ఛాదితుడనైయున్న నేను అందఱకొఱకు ప్రకటితుడనుకాను. పుట్టుకయు నాశమును లేనినన్ను ఈమూఢప్రపంచము బాగుగా తెలియజాలదు.

వ్యాఖ్యానము:-ఈ దృశ్యప్రపంచమును సృజించు సామర్థ్యము కలిగియు నిర్లిప్తుడైయున్న కారణమున నదృశ్యుడైయుండు పరమాత్మయొక్క యేభావముకలదో అది యాతని యోగమాయయై యున్నది.

వేదాహం సమతీతాని వర్తమానాని చాఽర్జున,
భవిష్యాణి చ భూతాని మాంతు వేద న కశ్చన. 26

అర్జునా, ఇదివఱకయినట్టియు, ఇప్పుడున్నట్టియు, ముందుకాగలట్టియు సకలభూతములను నేనెఱుగుదును. కాని యెవడును నన్నెఱుగడు.

ఇచ్ఛా ద్వేషసముత్థేన ద్వంద్వమోహేనభారత,
సర్వభూతాని సమ్మోహం సర్గే యాంతి పరంతప. 27

ఓ భారతా, పరంతపా, ఇచ్ఛాద్వేషములవలన గలుగు సుఖదుఃఖాది ద్వంద్వముల మోహముచేత ప్రాణులన్నియు నీజగత్తున మోహగ్రస్తములై యుండుచున్నవి.

యేషాంత్వంతగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్,
తేద్వంద్వమోహనిర్ముక్తా భజంతే మాం దృఢవ్రతాః. 28

కాని యేసదాచారుల పాపములు నశించియున్నవో యెవ్వరు ద్వంద్వ మోహమునుండి ముక్తినిబొందిరో ఆ నిశ్చల వ్రతులు నన్ను భజించుచున్నారు.

జరామరణమోక్షాయ మామాశ్రిత్య యతంతి యే,
తేబ్రహ్మ తద్విదుః కృత్స్న మధ్యాత్మం కర్మ చాఖిలమ్. 29

ఎవరు నన్నాశ్రయించి జరామరణములనుండి ముక్తులగుటకు ప్రయత్నించుచున్నారో వారు పూర్ణబ్రహ్మమును, అధ్యాత్మమును, అఖిలకర్మల నెఱుగుదురు.

సాధిభూతాధిదైవం మాం సాధియజ్ఞంచ యే విదుః,
ప్రయాణకాలేఽపిచ మాం తే విదుర్యుక్తచేతసః. 30

ఎవరు నన్ను అధిభూత అధిదైవ అధియజ్ఞ యుక్తునిగా గుర్తెఱిగిరో వారు సమత్వమునుపొంది మరణకాలమందు నైతము నన్ను గుర్తించుచున్నారు.

వ్యాఖ్యానము:-అధిభూతాదుల అర్థము ఎనిమిదవ అధ్యాయములో వచ్చును. ఈశ్లోకముయొక్క తాత్పర్యమిది. "ఈప్రపంచమందీశ్వరుడుతప్ప మఱేమియు లేదు. అతడు సకల కర్మలకు కర్తయు భోక్తయు నైయున్నాడు" అని తలచి ఎవ్వడు మరణకాలమందు శాంతచిత్తుడై, ఈశ్వరునియందే తన్మయుడైయుండుచు, నట్టిసమయమున ఎట్టివాసనలు లేని

వాడైయుండునో వాడు ఈశ్వరుని గుర్తించియున్నాడు. మఱి యు మోక్షమును పొందియున్నాడు.

ఓమ్, తత్సత్.

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగ
శాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే జ్ఞాన విజ్ఞాన యోగోనామ
సప్తమోఽధ్యాయః.

ఈప్రకారము శ్రీమద్భగవద్గీతా-ఉపనిషత్ అనగా బ్రహ్మవిద్యాంతర్గత యోగశాస్త్రమందలి శ్రీకృష్ణార్జున సంవాదమందు జ్ఞాన విజ్ఞాన యోగమను పేరుగల యేడవ యధ్యాయము ముగిసినది.



# అక్షరబ్రహ్మయోగము.

## అష్టమాధ్యాయము.



ఈయధ్యాయమందీశ్వర తత్వము విశేషరూపమున బోధింపబడినది.

అర్జున ఉవాచ:—

కిం తద్బ్రహ్మ కిమధ్యాత్మం కిం కర్మ పురుషోత్తమ,
అధిభూతం చ కిం ప్రోక్త మధిదైవం కి ముచ్యతే. 1

అర్జునుడు చెప్పుచున్నాడు:-పురుషోత్తమా, యీ బ్రహ్మస్వరూపమేది? అధ్యాత్మమన నెట్టిది? కర్మయన నెట్టిది? అధి భూతమని దేనినందురు? అధి దైవతమని ఏది చెప్పబడును?

అధియజ్ఞః కథం కోఽత్ర దేహేఽస్మి న్మధుసూదన,
ప్రయాణకాలేచ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః. 2

మధుసూదనా, ఈదేహమందధియజ్ఞమేది? అది యే రీతినున్నది? మరణకాలమందు జితేంద్రియుడు నిన్నేరీతి దెలిసికొనుచున్నాడు?

శ్రీభగవానువాచ:—

అక్షరం బ్రహ్మ పరమం స్వభావోఽధ్యాత్మముచ్యతే,
భూతభావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞితః. 3

శ్రీభగవానుడు చెప్పుచున్నాడు: సర్వోత్తమమైనదియు నవినాశనమైనదియు నేదికలదో యది బ్రహ్మము. ప్రాణులయందు దనసత్తతో నుండునది యధ్యాత్మము. ప్రాణులను సృజించుసృష్టి వ్యాపారము కర్మ యనబడుచున్నది.

అధిభూతం క్షరో భావః పురుషశ్చాధిదైవతమ్,
అధియజ్ఞోఽహమేవాత్ర దేహే దేహభృతాం వర. 4

నా నశించు స్వరూప మధిభూతము. అందుండు నాజీవ స్వరూప మధిదైవతము. మానవశ్రేష్ఠుడా, ఈదేహమందుం డియు యజ్ఞముచే పరిశుద్ధమైన జీవస్వరూప మధియజ్ఞము.

వ్యాఖ్యానము:-అనగా అవ్యక్తమగు బ్రహ్మము మొదలు నశించు దృశ్యపదార్థమునరకు సమస్తమును పరమాత్మయే. సకలమాతని నిర్మాణమే. ఇట్లుండ మనుష్యప్రాణి స్వయంకర్తృత్వాభిమానము కలిగియుండుటకు మారుగ పరమాత్మకు దాసుడై సమస్తమతనికే యేల సమర్పింపరాదు?

అంతకాలే చ మామేవ స్మరన్ముక్త్వా కళేబరమ్,
యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః. 5

అంత్యకాలమందు నన్నేస్మరించుచు, స్మరించుచు, దేహము విడుచువాడు నాస్వరూపమును పొందుచున్నాడు. ఇందేసందేహమును లేదు.

యంయంవాపి స్మరన్భావం త్యజత్యంతే కళేబరమ్,
తంత మేవైతి కౌన్తేయ! సదా తద్భావభావితః. 6

అట్లుకాక, కౌంతేయా, నిత్యమే యేస్వరూపమును

మనుష్యుడు ధ్యానించుచున్నాడో ఆయాస్వరూపమునే మరణకాలమందుసైతము స్మరించుచు దేహము విడుచుచున్న కారణమున వాడాస్వరూపమును పొందుచున్నాడు.

తస్మాత్సర్వేషు కాలేషు మా మనుస్మర యుద్ధ్యచ,
మయ్యర్పితమనోబుద్ధి ర్మామేవైష్యస్యసంశయం. 7

కావున సదా నన్ను స్మరింపుము. యుద్ధము చేయుము. ఈవిధమున మనస్సును బుద్ధిని నాయందుంచుటచే తప్పక నన్ను పొందుదువు.

అభ్యాసయోగయుక్తేన చేతసా నాన్యగామినా,
పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచింతయన్. 8

పార్థా, చిత్తమును రెండవవైపునకు బరువెత్తనీయక అభ్యాసముచే స్థిరపఱచి, యేకాగ్రచిత్తుడైయుండువాడు దివ్యుడగు పరమపురుషుని పొందుచున్నాడు.

కవిం పురాణమనుశాసితారమణోరణీయాంస మనుస్మరేద్యః, సర్వ
స్యధాతార మచింత్యరూప మాదిత్యవర్ణం తమసః పరస్తాత్. ప్రయాణ 9
కాలే మనసాఽచలేన భక్త్యాయుక్తోయోగబలేన చైవ, భ్రువోర్మధ్యే
ప్రాణ మావేశ్య సమ్యక్ స తం పరంపురుష ముపైతిదివ్యమ్. 10

నిశ్చలమగు మనస్సుతో భక్తియుక్తుడై యోగబలముచే భ్రుకుటి మధ్యమందు ప్రాణమును బాగుగానిలిపి, సర్వజ్ఞుడు, పురాతనుడు, నియంత, సూక్ష్మతముడు, సర్వపాలకుడు అచింత్యుడు, సూర్యసన్నిభ ప్రకాశుడు, అజ్ఞానాంధకార పరస్వరూపుడునగు వానిని, ఏమనుష్యుడు బాగుగా స్మరించు

చున్నారో వారు దివ్యుడగు పరమపురుషుని పొందుచున్నారు.

యదక్షరం వేదవిదో వదంతి విశంతి యద్యతయో వీతరాగాః,
యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి తత్తేపదం సంగ్రహేణ ప్రవక్ష్యే. 11

వేదవేత్తలక్షరమని దేనిని వర్ణించుచున్నారో, వీత రాగులైనమని దేనియందు ప్రవేశించుచున్నారో, లోకులు దేనినిపొందు కోర్కెతో బ్రహ్మచర్యమును పాలించుచున్నా రో యాపదవినిగూర్చి సంక్షిప్తముగా నీకు చెప్పెదను.

సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ,
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణమాస్థితో యోగధారణామ్. 12

ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహర న్మామనుస్మరన్,
యః ప్రయాతి త్యజన్ దేహం సయాతి పరమాంగతిమ్. 13

ఇంద్రియద్వారములనన్నింటిని నియమించి మనస్సును హృదయమందు నిలిపి ప్రాణమును మస్తకమునందుజేర్చి సమాధిలోనుండి "ఓమ్" అనెడి యేకాక్షరబ్రహ్మము నుచ్చరించుచు నన్ను చింతించుచు దేహమును విడుచు మను ష్యుడు పరమగతిని పొందుచున్నాడు.

అనన్యచేతా స్సతతం యో మాం స్మరతి నిత్యశః
తస్యాహం సులభః పార్థ! నిత్యయుక్తస్య యోగినః. 14

పార్థా, చిత్తమన్యత్రా నిలుపక, బ్రతికియున్నంత కాలము నిత్యమునన్నే స్మరించుచు నెవ్వడుండునో యానిత్య యుక్తుడగు యోగి నన్ను సులభముగా పొందుచున్నాడు.

మా ముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతమ్,
నాప్నువన్తి మహాత్మాన స్సంసిద్ధిం పరమాంగతాః. 15

నన్ను బొంది పరమగతికి జేరిన మహాత్ములు దుఃఖాలయమును అశాశ్వతమునగు పునర్జన్మ పొందరు.

ఆబ్రహ్మభువనా ల్లోకాః పునరావర్తినోఽర్జున,
మా ముపేత్య తు కౌంతేయ పునర్జన్మ నవిద్యతే. 16

కౌంతేయా, బ్రహ్మలోకము మొదలు సమస్త లోకములును పునరావృత్తి కలవి. కాని నన్ను పొందినపిమ్మట మనుష్యుడు మరల జన్మించుట అసంభవము

సహస్రయుగపర్యంత మహర్యద్బ్రహ్మణో విదుః,
రాత్రింయుగసహస్రాంతాం తేఽహోరాత్రవిదో జనాః. 17

వేయియుగములు బ్రహ్మకొక్క పగలు. వేయియుగములు బ్రహ్మకొక్క రాత్రి అని యెవరు తెలిసికొనుచున్నారో వారహోరాత్రములు తెలిసినవారు.

వ్యాఖ్యానము:-24 గంటలుగల మన యహోరాత్రములు కాలచక్రమందొక్క క్షణముకంటెను సూక్ష్మములైనవి వానికెట్టి విలువయు లేదు. కాబట్టి యంత సూక్ష్మసమయములో లభించు భోగములు గగనపుష్పములవంటివి. ఇట్లు తలచి యాభోగములయెడ నుదాసీనులమై యుండవలయును. మనకున్నది అంతేసమయము. దీనిని భగవద్భక్తియందు, సేవయందు, వినియోగించి సార్థకపఱచుకొనవలయును. అయితే వెంటనే ఆత్మదర్శనము కలుగకపోయెనేని ధైర్యము గోల్పోవరాదు.

అవ్యక్తాద్వ్యక్తయ స్సర్వాః ప్రభవం త్యహరాగమే,
రాత్ర్యాగమే ప్రలీయంతే తత్రైవా వ్యక్తసంజ్ఞకే. 18

(బ్రహ్మయొక్క) పగలారంభింపగనే అవ్యక్తము నుండి యన్నియు వ్యక్తమగుచున్నవి. రాత్రిప్రవేశింపగనే వానికి ప్రళయమగుచున్నది. అనగా అవ్యక్తమందు లీనమై పోవుచున్నవి.

వ్యాఖ్యానము:- ఇది తెలిసికొనినయెడల మనుష్యుడు తనకున్నది కడునల్పమగు శక్తియని యెఱుగవలయును. ఉత్పత్తిలయములు జంటగా యొకదానివెనుక నొకటి జరుగుచునే యున్నవి.

భూతగ్రామస్స ఏవాయం భూత్వా భూత్వా ప్రలీయతే,
రాత్ర్యాగమేఽవశః పార్థ! ప్రభవ త్యహరాగమే. 19

పార్థా, ఈప్రాణి సముదాయ మీవిధమున పుట్టిపుట్టి రాత్రియయినంతనే వివశమై లయమగుచున్నది. మరల పగలు రాగానే పుట్టుచున్నది.

పర స్తస్మాత్తు భావోఽన్యోఽవ్యక్తోఽవ్యక్తాత్సనాతనః,
య స్స సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి. 20

ఈ అవ్యక్తముకంటె పరమగు వేరొక సనాతనమగు అవ్యక్త భావము కలదు. సమస్తప్రాణులు నశించుచున్నను ఆసనాతనమగు అవ్యక్త భావము నశింపదు.

అవ్యక్తోఽక్షరఇత్యుక్త స్తమాహుః పరమాంగతిమ్,
యంప్రాప్య న నివర్తంతే తద్ధామ పరమం మమ. 21

అవ్యక్తము అక్షరము అని ఏది చెప్పబడుచున్నదో దానినే పరమగతియని చెప్పుచున్నారు. దేనినిపొందినపిమ్మట మనుష్యులకు పునర్జన్మకలుగదో అదినా పరమభావము.

పురుష స్సపరః పార్థ భక్త్యాలభ్య స్త్వనన్యయా,
యస్యాంతః స్థాని భూతాని యేన సర్వ మిదం తతమ్. 22

పార్థా, ఈ యుత్తమపురుషునిదర్శన మనన్యభక్తిచే కలుగును. ఈతనియందు భూతములన్నియు నున్నవి. ఈతనిచే నీసర్వము వ్యాప్తమై యున్నది.

యత్ర కాలే త్వనావృత్తి మావృత్తిం చైవ యోగినః,
ప్రయాతా యాంతి తం కాలం వక్ష్యామి భరతర్షభ. 23

ఏసమయమందు మరణించి యోగులు క్షేమము పొందుచున్నారో ఏసమయమున మరణించుటచే వారికి పునర్జన్మ కలుగుచున్నదో ఆసమయములను, ఓభరతర్షభా, నీకు తెలుపుచున్నాను.

అగ్ని ర్జ్యోతి రహశ్శుక్ల ష్షణ్మాసా ఉత్తరాయణమ్,
తత్ర ప్రయాతాగచ్ఛంతి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః. 24

ఉత్తరాయణమందలి ఆరుమాసములందు, శుక్లపక్షమందు, పగటియందు, అగ్నిజ్వాల లేచుచున్న సమయమందు మరణించు బ్రహ్మజ్ఞుడు బ్రహ్మమును పొందుచున్నాడు.

ధూమో రాత్రి స్తథాకృష్ణ ష్షణ్మాసాదక్షిణాయనమ్,
తత్ర చాంద్రమసం జ్యోతి ర్యోగీ ప్రాప్య నివర్తతే. 25

దక్షిణాయనమందలి యారుమాసములయందు, కృష్ణపక్షమందు, రాత్రియందు, పొగవ్యాపించియున్న సమయమందు మృతిచెందువాడు చంద్రలోకమునుపొంది పునర్జన్మ పొందుచున్నాడు.

వ్యాఖ్యానము:-పై రెండు శ్లోకములును నాకు పూ

క్తిగా భావముకాలేదు. వీనిశబ్దార్థములు గీతాశిక్షణో నేకీ
భవించుటలేదు. గీతాశిక్షానుసారము భక్తియుక్తుడును, సేవా
మార్గపరాయణుడును, జ్ఞానియునగువాడెప్పుడును మరణించి
ననేమి! మోక్షమునే పొందుచున్నాడు. అతనికి ఈశ్లోకశబ్దా
ర్థము ప్రతికూలమైయున్నది. ఆశ్లోకముల భావార్థముతప్పక
యిదికావచ్చును-యజ్ఞముచేయువాడు అనగా పరోపకార
మందే జీవితముగడుపువాడు, జ్ఞాని, బ్రహ్మవిదుడు, వీరికి మ
రణకాలమందుసైతము అట్టిస్థితియే యున్నచో మోక్షమును
పొందుచున్నారు. దీనికి ప్రతికూలముగా యజ్ఞముచేయని
వాడు, భక్తినెఱుంగనివాడు, వీరు చంద్రలోకమనగా క్షణిక
లోకమునుపొంది మరల సంసారచక్రమునకు వచ్చుచున్నారు.
చంద్రునకు స్వప్రకాశము లేదు.

శుక్లకృష్ణేగతీ హ్యేతే జగత శ్శాశ్వతే మతే,
ఏకయా యాత్యనావృత్తి మన్యయా వర్తతే పునః 26

జగత్తునందు జ్ఞానము, అజ్ఞానము అను రెండును పరం
పరాగత మార్గములని సమ్మతింపబడియున్నవి. మొదటిది
అనగా జ్ఞానమార్గమువలన మనుష్యుడు మోక్షమును పొం
దును. రెండవదానివలన అనగా అజ్ఞానమార్గమువలన మను
ష్యునకు పునర్జన్మము ప్రాప్తించును.

నైతే సృతీ పార్థ! జానన్ యోగీ ముహ్యతి కశ్చన,
తస్మాత్సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున. 27

పార్థా, ఈ రెండుమార్గముల నెఱిగిన ఏయోగియు
మోహమున జిక్కడు కావున అర్జునా, నీవెల్లప్పుడు యోగ

యుక్తుడవై యుండవలెను.

వ్యాఖ్యానము:- రెండుమార్గములు తెలిసినవాడును, సమభావము కల్గినవాడును అంధకారమార్గమున అజ్ఞానమార్గమున-ప్రవేశించడు అనునదియే మోహమందు జిక్కడు అనుట కర్థము.

వేదేషు యజ్ఞేషు తపస్సుచైవ
దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టమ్, 28
అత్యేతి తత్సర్వ మిదం విదిత్వా
యోగీ పరంస్థాన ముపైతి చాద్యమ్. 29

ఈతత్వమెఱిగిన పిమ్మట వేదయజ్ఞ తపోదానముల యందు ఏపుణ్యఫలము కలదనిరో దానినంతయు నతిక్రమించి యోగి ఉత్తమమగు ఆదిస్థానమును పొందుచున్నాడు.

వ్యాఖ్యానము:-అనగా భక్తిజ్ఞాన సేవాకర్మలచేత సమభావమును పొందియున్నవానికి అన్ని పుణ్యముల ఫలమే కాదు. పరమమగు మోక్షపదము సైతము లభించుచున్నది.

ఓమ్, తత్సత్.

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగ
శాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే అక్షరబ్రహ్మ యోగోనామ
అష్టమోఽధ్యాయః.

ఈప్రకారము శ్రీమద్భగవద్గీతా-ఉపనిషత్ అనగా బ్రహ్మవిద్యాంతర్గత యోగశాస్త్రమందలి శ్రీకృష్ణార్జున సంవాదమందు అక్షరబ్రహ్మ యోగమను పేరుగల ఎనిమిదవ యధ్యాయము ముగిసినది.



# రాజవిద్యా రాజగుహ్య యోగము.

## నవమాధ్యాయము.



ఇందు భక్తిమహిమ గానము చేయబడినది.

శ్రీభగవానువాచ:—

ఇదంతు తే గుహ్యతమం ప్రవక్ష్యా మ్యనసూయవే,
జ్ఞానం విజ్ఞానసహితం యజ్జ్ఞాత్వామోక్ష్యసేఽశుభాత్. 1

శ్రీభగవానుడు చెప్పుచున్నాడు:-నీవసూయ లేని వాడవు. కావున నతిరహస్యమైన యనుభవయుక్తమగు జ్ఞానమును నీకు నేను తెలిపెదను. దీని నెఱుగుటచే నశుభముల నుండి విముక్తి పొందగలవు.

రాజవిద్యా రాజగుహ్యం పవిత్రమిద ముత్తమమ్,
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తు మవ్యయమ్, 2

విద్యలయందిది రాజు. రహస్యమైనవానియందును రాజే ఈవిద్య పవిత్రమైనది. ఉత్తమమైనది. ప్రత్యక్షానుభవమునకు రాదగినది. ధర్మ్యమైనది. అనుష్ఠానమునకు సులభమైనది. నాశములేనిది.

అశ్రద్దధానాః పురుషా ధర్మస్యాస్య పరంతప,
అప్రాప్య మాం నివర్తంతే మృత్యుసంసారవర్త్మని. 3

పరంతపా, యీధర్మమందు శ్రద్ధలేనివారు నన్ను

బొందక మృత్యుమయమగు సంసారమార్గమందు మాటిమాటికి దెబ్బతినుచున్నారు.

మయా తత మిదం సర్వం జగదవ్యక్తమూర్తినా,
మత్స్థాని సర్వభూతాని నచాహం తేష్వవస్థితః 4

నాయవ్యక్త స్వరూపముచే నీజగత్తంతయు నిండియున్నది. నాయందు నాయాధారముపై ప్రాణులన్నియునున్నవి. నేను వానియాధారముపై లేను.

నచ మత్ స్థాని భూతాని పశ్య మే యోగమైశ్వరమ్,
భూతభృన్నచ భూతస్థో మమాత్మా భూతభావనః 5

అయినను ప్రాణులు నాయందు లేవనియు చెప్పవచ్చును నాయీయోగబలమును చూడుము. నేను ప్రాణులను పోషించువాడను. అట్లయ్యు నేను వానియందు లేను. కాని వాని యుత్పత్తికి కారణుడను.

వ్యాఖ్యానము:- నాయందు ప్రాణులన్నియునున్నవి. లేకున్నవి. వానియందు నేనున్నాను. లేను. ఇది ఈశ్వరుని యోగబలము. వానిమాయ. వానిచమత్కారము. భగవంతునకు నైతము ఈశ్వరవర్ణనము, మానవభాషలోనే చేయవలసి వచ్చినది. ఈకారణమున ననేకవిధములుగ భాషను ప్రయోగించి యతనిని సంతుష్టిపరచుచున్నాడు. సర్వమీశ్వరమయము కావున సర్వమీశ్వరుని యందున్నది. వాడలిప్తుడు. ప్రాకృతకర్త కాడు. కావున వానియందు ప్రాణులు లేవని చెప్పవచ్చును. కాని వానిభక్తులయందు మాత్రము

నాకు తప్పక యున్నాడు. నాస్తికులైనవారియందు వారిదృ
ష్టినిబట్టి వాడు లేడు. ఇది ఈశ్వరుని చమత్కారముగాక
మరేమి?

యథాకాశస్థితో నిత్యం వాయుస్సర్వత్రగో మహాన్,
తథా సర్వాణి భూతాని మత్స్థానీత్యుపధారయ. 6

అంతటను సంచరించు మహావాయువు నిత్యమాకాశమందుండు విధమున సకలప్రాణులు నాయందున్నవని యెఱుంగుము.

సర్వభూతాని కౌంతేయ ప్రకృతిం యాంతి మామికామ్,
కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహమ్. 7

కౌంతేయా, కల్పాంతమందు సకలప్రాణులును నా ప్రకృతియందు లీనమగుచున్నవి. తిరిగి కల్పారంభముకాగా వానిని సృజించుచున్నాను.

ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునః పునః,
భూతగ్రామమిమం కృత్స్నమవశం ప్రకృతేర్వశాత్. 8

నా మాయాబలమువలన ప్రకృతి ప్రభావమున కధీనమైయున్న ప్రాణికోటినంతయును మరలమరల సృజించుచున్నాను.

నచ మాం తాని కర్మాణి నిబధ్నంతి ధనంజయ!
ఉదాసీనవదాసీన మసక్తం తేషు కర్మసు. 9

ధనంజయా, యీ కర్మలు నన్ను బంధింపవు; ఏలననగా నేను వానియందు ఉదాసీనునివలె, అనాసక్తుడనై

వర్తించుచుందును.

మయాధ్యక్షేణ ప్రకృతి స్సూయతే సచరాచరమ్,
హేతునానేన కౌంతేయ! జగద్విపరివర్తతే. 10

నా యధికారమునుండి ప్రకృతి స్థావరజంగమాత్మకమగు ప్రపంచమును సృజించుచున్నది. జగత్తు సదాఘటమాల (నూతిపైగిలక)వలె తిరుగుచున్నది.

అవజానంతి మాం మూఢా మానుషీం తను మాశ్రితమ్,
పరంభావ మజానంతో మమ భూత మహేశ్వరమ్. 11

సకలభూత మహేశ్వరుడనగు నాయొక్క భావమును తెలిసికొనక మూఢులు మనుష్యదేహమును ధరించిన వానిగ దలచి నన్నవమానము సేయుచుందురు.

వ్యాఖ్యానము:-ఎందుకనగా, ఈశ్వరభక్తి నంగీకరింపనివారు దేహమందుండు నంతర్యామిని గుర్తింపక, దానియునికి నమ్మక జడవాదులుగ నుందురు.

మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః,
రాక్షసీ మాసురీంచైవ ప్రకృతిం మోహినీం శ్రితాః. 12

వ్యర్థమైన యాశలుగలవారు, వ్యర్థమగుకర్మలు చేయువారు, వ్యర్థమగు జ్ఞానముకలవారు, నగు మూఢజనులు మోహమున బడద్రోయు రాక్షసమైన అనగా అసురమైన ప్రకృతి నాశ్రయించు చున్నారు.

మహాత్మానస్తుమాం పార్థ! దైవీం ప్రకృతి మాశ్రితాః,
భజంత్యనన్యమనసో జ్ఞాత్వా భూతాది మవ్యయమ్. 13

పార్థా, దీనికి విపరీతముగా మహాత్ములు దైవీప్రకృతి నాశ్రయించి సకలభూతములకు నాదికారణుడననియు నవి నాశిననియు నెఱిగి తదేకనిష్ఠతో నన్ను భజించుచున్నారు.

సతతం కీర్తయంతో మాం యతంతశ్చ దృఢవ్రతాః,
నమస్యంతశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే. 14

ఆదృఢనిశ్చయులు, ఆప్రయత్నశీలురు, నిరంతరము నన్ను గీర్తించుచున్నారు. భక్తిపూర్వకముగా నాకు నమస్కరించుచున్నారు. నిత్యధ్యానపరులై నన్నుపాసించుచునారు.

జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజంతో మా ముపాసతే.
ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతోముఖమ్. 15

మఱికొందరు అద్వైతభావముచేతను, ద్వైతభావముచేతను అనేకభావములచేతను, సర్వతోముఖుడనగునన్ను జ్ఞానమువలన పూజించుచున్నారు.

అహం క్రతు రహం యజ్ఞ స్స్వధాహ మహ మౌషధమ్,
మంత్రోఽహ మహమేవాజ్య మహమగ్ని రహంహుతమ్. 16

యజ్ఞసంకల్పము నేను. యజ్ఞము నేను. యజ్ఞమువలన పితరుల యాధారము నేను. యజ్ఞముయొక్క ఔషధులు నేను. మంత్రములు నేను. ఆహుతి నేను. అగ్ని నేను. మఱియు హవనద్రవ్యములు నేనే.

పితాహ మస్య జగతో మాతాధాతా పితామహః,
వేద్యం పవిత్ర మోంకార ఋక్సామయజు రేవచ. 17

ఈజగత్తునకు తండ్రిని నేను. తల్లిని నేను. ధాతను నేను.

పితామహుండను నేను. తెలియదగినవాడను నేను. పవిత్రమగు నోంకారమును నేను. మఱియు ఋగ్యజుస్సామ వేదములు సైతము నేనే.

గతి ర్భర్తా ప్రభు స్సాక్షీ నివాస శ్శరణం సుహృత్,
ప్రభవః ప్రళయ స్థానం నిధానం బీజ మవ్యయమ్. 18

గతిని నేను, పోషకుడను నేను, ప్రభువును నేను. సాక్షిని నేను. నివాసమును నేను. ఆశ్రయమును నేను. హితాభిలాషిని నేను. ఉత్పత్తిని నేను. లయమును నేను. స్థితిని నేను. భండారమును నేను. మఱియు నవ్యయబీజముకూడా నేనై యున్నాను.

తపా మ్యహ మహం వర్షం నిగృహ్ణామ్యుత్సృజామిచ,
అమృతంచైవ మృత్యుశ్చ సదస చ్చాహ మర్జున. 19

ఎండ నేనిచ్చుచున్నాను. వర్షమును నేనే యాపియుంచుచున్నాను. మఱియు కురిపించుచున్నాను. అమరత్వమును నేను మృత్యువుచు నేను. మఱియు నర్జునా సత్తును అసత్తునుగూడ నేనే.

త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా
యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయంతే,
తే పుణ్య మాసాద్య సు రేంద్రలోక
మశ్నంతి దివ్యాన్ దివి దేవభోగాన్. 20

మూడు వేదములకర్మలు చేయువారు, సోమరసపానముచేసి నిష్పాపులై యజ్ఞములవలన నన్నుపూజించి స్వర్గ

మును యాచింతురు. వారు పవిత్రదేవలోకమును పొంది స్వర్గ
మందు దివ్యభోగముల ననుభవించుచున్నారు.

వ్యాఖ్యానము:-వైదికక్రియలన్నియు ఫలాసక్తితో చేయబడు చుండెడివి. వానిలో ననేకక్రియలయందు సోమరస పానముండెడిది. దానిగురించి యిచ్చట చెప్పబడినది. ఈ క్రియ లెట్టివో సోమరస మెట్టిదో నేడెవ్వరును సరిగా తెలుపజాలరు.

తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి,
ఏవం త్రయీధర్మ మనుప్రపన్నా
గతాగతం కామకామా లభంతే. 21

ఇట్లు విశాలమగు స్వర్గలోకమందు సుఖములనుభవించి పుణ్యము క్షీణించిన పిమ్మట మర్త్యలోకమునకు మరల వచ్చుచున్నారు. ఇవ్విధమున మూడు వేదములకర్మలు చేయువారును ఫలాపేక్షకలిగి యున్నవారును జననమరణ చక్రమున తిరుగుచున్నారు.

అనన్యా శ్చింతయంతో మాం యేజనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్. 22

అనన్య భావముచే నన్ను చింతించుచు, నన్ను భజించుచు నాయందే యాసక్తులగుచు నెవ్వరున్నారో యట్టివారి యోగక్షేమముల భారమును నేను వహించుచున్నాను.

వ్యాఖ్యానము:-యోగినిపోల్చుటకు చక్కని మూడు

లక్షణములు తెలిపియున్నవి. సమత్వము, కర్మకౌశల్యము, అనన్యభక్తి అనునవి. ఈమూడును పరస్పరమోతప్రోతములై యుండవలెను. భక్తిలేనిది సమత్వములభించదు. సమత్వము లేనిది భక్తి కలుగదు. కర్మకుశలత్వము లేకయే భక్తిసమత్వములు లభించుట సందేహాస్పదము. యోగమనగా వస్తుప్రాప్తిని చేసికొనుట. క్షేమమనగా ప్రాప్తవస్తువును సురక్షితముగ నుంచుకొనుట.

యేఽప్యన్యదేవతాభక్తా యజంతే శ్రద్ధయాన్వితాః,
తేఽపి మామేవ కౌంతేయ! యజంత్యవిధిపూర్వకమ్. 23

కౌంతేయా, శ్రద్ధతో నితరదేవతల భజించుచున్న వారుకూడా విధిరహితులై యున్నను నన్నే భజించుచున్నారు.

వ్యాఖ్యానము:-విధిరహితులై అనగా అజ్ఞానమువలన, ఏకనిరంజనుని నిరాకారుని, నన్నెఱుగక యనుట.

అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ,
నతు మామభిజానంతి తత్త్వేనాతశ్చ్యవంతి తే. 24

సకలయజ్ఞముల భోక్తనగుస్వామిని నేనేకదా! అట్టి నన్ను యదార్థస్వరూపమున వారు గుర్తింపజాలరు. ఈ కారణమున వారు పతితులగుచున్నారు.

యాంతిదేవవ్రతా దేవాన్ పితౄన్ యాంతి పితృవ్రతాః,
భూతాని యాంతి భూతేజ్యా యాంతి మద్యాజినోఽపిమామ్. 25

దేవతలపూజించువారు దేవలోకమును పొందుచున్నారు పితరుల పూజించువారు పితృలోకమును పొందుచున్నారు

నన్ను భజించువారు నన్ను బొందుచున్నారు.

పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి,
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః. 26

ఎవ్వడు నాకు పత్రమునుగాని పుష్పమునుగాని ఫల మునుగాని జలమునుగాని భక్తిపూర్వకముగా సమర్పించు చున్నాడో ఆ ప్రయత్న శీలునివలన భక్తిపూర్వకముగ నర్పితమైనదానిని నేను స్వీకరించుచున్నాను.

వ్యాఖ్యానము:- ఈశ్వరప్రీతికొఱకు కొంతసేవాభావముతో నొసగబడినదానిని ఆ ప్రాణియందున్న భగవానుడంతర్యామి రూపమున స్వీకరించుచున్నాడు.

యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్,
యత్తపస్యసి కౌంతేయ! తత్కురుష్వ మదర్పణమ్. 27

కాబట్టి కౌంతేయా, నీవేమిచేసినను, ఏమిభుజించినను, హావనముందేది హోమముచేసినను, ఏదానముచేసినను, ఏతపస్సుచేసినను దానినంతయు నాకు సమర్పించి వేయుము.

శుభాశుభఫలై రేవం మోక్ష్యసే కర్మబంధనైః,
సన్న్యాసయోగయుక్తాత్మా విముక్తో మాముపైష్యసి. 28

ఇందుచే నీవు శుభాశుభ ఫలములిచ్చు కర్మబంధముల నుండి విడివడుదువు. మఱియు ఫలత్యాగరూపమగు సమత్వమునుపొంది జననమరణములనుండి విముక్తుడవై నన్ను పొందగలవు.

సమోఽహం సర్వభూతేషు నమే ద్వేష్యోఽస్తి నప్రియః
యే భజంతితు మాం భక్త్యా మయి తే తేషుచాప్యహమ్. 29

అన్ని ప్రాణులయందు నేను సమభావముతో నుందును నాకెవరియు ప్రియముకాని యప్రియముకాని లేదు. భక్తితో నన్ను భజించువారు, నాయందున్నారు. నేనును వారియందున్నాను.

అపి చేత్సు దురాచారో భజతే మా మనన్యభాక్,
సాధురేవ స మన్తవ్య స్సమ్య గ్వ్యవసితోహి సః. 30

మహాదురాచారుడైనను అనన్యభావముతో నన్ను భజించినచో వాడు సాధువయ్యెనని యే భావింపవలయును. కారణమేమనగా వానిసంకల్ప మిప్పుడు శ్రేష్ఠమైనది.

వ్యాఖ్యానము:-ఏలననగా అనన్యభక్తి దురాచారములను పోగొట్టుచున్నది.

క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి,
కౌంతేయ! ప్రతిజానీహి నమే భక్తః ప్రణశ్యతి. 31

వాడు శీఘ్రముగ ధర్మాత్ముడై నిరంతరము శాంతిని పొందుచున్నాడు. కౌంతేయా, నాభక్తుడెన్నడు నశింపడని నిశ్చయముగా దెలిసికొమ్ము.

మాంహిపార్థ! వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః,
స్త్రియోవైశ్యాస్తథాశూద్రాస్తేఽపి యాంతిపరాంగతిమ్. 32

ఇంతేకాక, పార్థా, పాపయోనులైనవారును, నా యాశ్రయము పొందుచున్న స్త్రీలు, వైశ్యులు, శూద్రులును తప్పక పరమగతిని పొందుచున్నారు.

కిం పున ర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయ స్తథా
అనిత్య మసుఖం లోక మిమంప్రాప్య భజస్వ మామ్. 33

ఇక పుణ్యాత్ములు నాభక్తులునగు, బ్రాహ్మణులను రాజర్షులనుగూర్చి వేరుగ జెప్పవలసినదేమున్నది? కాబట్టి యీ యనిత్యము, సుఖరహితమునగు లోకమున జన్మించి నీవునన్ను భజింపుము.

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు,
మా మేవైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః. 34

నాయందు మనస్సు నిలుపుము. నాభక్తుడవుకమ్ము. నానిమిత్తము యజ్ఞములు చేయుము. నాకు సమస్కరింపుము. ఇట్లుచేసితివేని మత్పరాయణుడవై నీయాత్మను నాతోడ నైక్యపఱచి నన్నేపొందగలవు.

ఓమ్, తత్సత్.

ఇతి శ్రీమద్భగవద్గీతానూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగ
శాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే రాజవిద్యా రాజగుహ్య యోగో నామ
నవమోఽధ్యాయః.

ఈప్రకారము శ్రీమద్భగవద్గీతా-ఉపనిషత్ అనగా బ్రహ్మవిద్యాంతర్గత యోగశాస్త్రమందలి శ్రీకృష్ణార్జున సంవాదమందు రాజవిద్యా రాజగుహ్య యోగమను పేరుగల తొమ్మిదవ యధ్యాయము ముగిసినది.

# విభూతి యోగము.

## దశమాధ్యాయము.



ఏడు ఎనిమిది తొమ్మిది యధ్యాయములలో భక్తి మున్నగు వానిని నిరూపణము చేసినపిమ్మట భక్తులకొఱకు తనయనంత విభూతులను భగవానుడు కొద్దిగా జూపించుచున్నాడు.

శ్రీభగవానువాచ:—

భూయ ఏవ మహాబాహో! శృణు మే పరమం వచః,
యత్తేఽహం ప్రీయమాణాయ వక్ష్యామి హితకామ్యయా. 1

శ్రీభగవానుడు చెప్పుచున్నాడు:-మహాబాహూ, మరల నాపరమవాక్యములను వినుము. సంతుష్టుడవగు నీహితముకై వీనిని చెప్పెదను.

న మే విదుః సురగణాః ప్రభవం న మహర్షయః,
అహ మాదిర్హి దేవానాం మహర్షీణాం చ సర్వశః. 2

దేవతలును, మహర్షులును నాపుట్టుక నెఱుగరు. ఎందు కనగా నేనే దేవతలకును మహర్షులకును సమస్త విధముల నాదికారణుడను.

యో మా మజ మనాదించ వేత్తి లోకమహేశ్వరమ్,
అసమ్మూఢ స్స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే. 3

మర్త్యలోకమందుండి యేజ్ఞాని లోకమహేశ్వరుడగు నన్ను జన్మలేనివానిగను ఆదిలేనివానిగను దెలియుచున్నాడో వాడు సకల పాపములనుండి ముక్తుడగుచున్నాడు.

బుద్ధిర్జ్ఞానమసమ్మోహః క్షమా సత్యం దమశ్శమః,
సుఖం దుఃఖం భవో భావో భయం చాభయ మేవచ. 4

అహింసా సమతాతుష్టిస్తపో దానం యశోఽయశః
భవంతిభావా భూతానాం మత్త ఏవ పృథగ్విధాః. 5

బుద్ధి, జ్ఞానము, మోహశూన్యత, క్షమ, సత్యము, ఇంద్రియనిగ్రహము, శాంతి, సుఖము, దుఃఖము, జన్మము, మృత్యువు, భయము, నిర్భయము, అహింస, సమత్వము, సంతోషము, తపస్సు, దానము, కీర్తి, అపకీర్తి మున్నగు భూతముల భిన్నభావములన్నియు నావల్లనే పుట్టుచున్నవి.

మహర్షయ స్సప్తపూర్వే చత్వారో మనవస్తథా,
మద్భావా మానసాజాతా యేషాం లోకఇమాః ప్రజాః. 6

సప్తఋషులును వారికంటె పూర్వులగు సనకాదులును (పదునలుగురు) మనువులును, నాసంకల్పమువలన పుట్టియున్నారు. వారినుండి యీలోకములు పుట్టినవి.

ఏతాం విభూతిం యోగంచ మమ యోవేత్తి తత్త్వతః,
సోఽవికంపేనయోగేన యుజ్యతే నాత్ర సంశయః. 7

నాయీ విభూతిని శక్తిని తత్త్వతః తెలియువాడు నిస్సంశయముగ నిశ్చలసమత్వమును పొందుచున్నాడు.

అహం సర్వస్య ప్రభవో మత్త స్సర్వం ప్రవర్తతే,
ఇతిమత్వా భజన్తే మాం బుధా భావసమన్వితాః. 8

అన్నింటి యుత్పత్తికి నేను కారణుడనై యున్నాను. అన్నియు నావలననే వర్తించుచున్నవి. ఇది యెఱిగి బుద్ధిమంతులు భావయుక్తులై నన్ను భజించుచుందురు.

మచ్చిత్తా మద్గతప్రాణా బోధయంతః పరస్పరమ్,
కథయంతశ్చ మాం నిత్యం తుష్యంతిచ రమంతిచ. 9

నాయందు చిత్తము నిలుపువారు నాకు ప్రాణము లర్పించువారు, నొకరునొకరు బోధించుకొనుచు నిత్యము నా ముచ్చటనే చెప్పుకొనుచు సంతోషించుచు ఆనందించుచుందురు

తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్,
దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాంతి తే. 10

ఇట్లునాయందు తన్మయులైయుండువారికిని ప్రేమపూర్వకముగ నన్ను భజించువారికిని నేను జ్ఞానము నిచ్చుచున్నాను. దానిచే వారునన్ను పొందుచున్నారు.

తేషామే వానుకంపార్థ మహ మజ్ఞానజం తమః,
నాశయా మ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా. 11

వారిపై దయగలిగి వారిహృదయములందు నేను ప్రకాశమయమగు జ్ఞానరూపదీపముచేత వారి యజ్ఞానాంధకారమును నశింపజేయుదు.

అర్జున ఉవాచః—

పరంబ్రహ్మ పరంధామ పవిత్రం పరమం భవాన్
పురుషం శాశ్వతం దివ్య మాదిదేవ మజంవిభుమ్. 12
ఆహుస్త్వా మృషయ స్సర్వే దేవర్షి ర్నారదస్తథా,
అసితో దేవలో వ్యాస స్స్వయంచైవ బ్రవీషి మే. 13

అర్జునుడు చెప్పుచున్నాడు:-ఓభగవానుడా, నీవు పర బ్రహ్మవు. పరంధాముడవు. పరమపవిత్రుడవు. సమస్త ఋషులును, దేవర్షియగు నారదుడును అసితుడును దేవలుడును వ్యాసుడును నిన్ను నాశములేనివాడవనియు దివ్యపురుషుడవనియు ఆదిదేవుడవనియు పుట్టుక లేనివాడవనియు ఈశ్వరుడవనియు తలచుచున్నారు. నీవును స్వయముగా నిదియే చెప్పుచున్నావు.

సర్వమేత దృతం మన్యే యన్మాం వదసి కేశవ,
నహి తే భగవన్ వ్యక్తిం విదుర్దేవా న దానవాః. 14

కేశవా, నీవు చెప్పునది సత్యమని నేను తలచెదను. భగవానుడా, నీ స్వరూపమును దేవతలుగాని రాక్షసులుగాని యెఱుగరు.

స్వయమే వాత్మనాత్మానం వేత్థ త్వం పురుషోత్తమ,
భూతభావన భూతేశ దేవదేవ జగత్పతే. 15

పురుషోత్తమా, జీవులకుతండ్రి, జీవేశ్వరా, దేవదేవా జగత్స్వామీ, నిన్నునీచేత నీవు స్వయముగనే తెలిసికొనుచున్నావు.

వక్తు మర్హ స్యశేషేణ దివ్యా హ్యాత్మవిభూతయః,
యాభి ర్విభూతిభి ర్లోకా నిమాంస్త్వం వ్యాప్య తిష్ఠసి. 16

ఏవిభూతులచేత ఈలోకమందు నీవు వ్యాపించి యున్నావో ఆనీదివ్య విభూతులు సంపూర్ణముగ నాతో చెప్పవలయును.

కథం విద్యా మహం యోగిన్ త్వాం సదా పరిచింతయన్,
కేషు కేషుచ భావేషు చింత్యోఽసి భగవ న్మయా. 17

ఓ యోగీశ్వరా, సదానీచింతనము సేయుచు చేయుచు నిన్నెట్లు గుర్తింపగలను? భగవానుడా, ఏయేరూపముల యందు నీచింతన సేయవలయును?

విస్తరేణాత్మనో యోగం విభూతిం చ జనార్దన,
భూయః కథయ తృప్తిర్హి శృణ్వతో నాస్తి మేఽమృతమ్. 18

జనార్దనా, నీశక్తినిగూర్చియు నీవిభూతులనుగూర్చియు విస్తారముగా నాకు తిరుగ తెలుపుము. నీ యమృతమయ భాషణములు వినుకొలదియు తనివితీరకున్నది.

శ్రీ భగవానువాచ.

హంత తే కథయిష్యామి దివ్యా హ్యాత్మ విభూతయః,
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ! నా స్త్యంతో విస్తరస్య మే. 19

శ్రీభగవానుడు చెప్పుచున్నాడు:-కురుశ్రేష్ఠా, నా దివ్యవిభూతులలో అతిముఖ్యములగువానిని నీకు చెప్పుచున్నాను. వానివిస్తారమున కంతమే లేదుకదా?

అహ మాత్మా గుడాకేశ! సర్వభూతాశయస్థితః
అహ మాదిశ్చ మధ్యంచ భూతానా మంత ఏవచ. 20

ఓగుడాకేశా, నేను సకలభూతముల హృదయముల యందుండు ఆత్మను నేనే. భూతముల ఆది మధ్యాంతములు నేనే.

ఆదిత్యానా మహం విష్ణు ర్జ్యోతిషాం రవి రంశుమాన్,
మరీచిర్మరుతా మస్మి నక్షత్రాణా మహం శశీ. 21

ఆదిత్యులలో విష్ణువు నేను. జ్యోతులయందు ప్రకాశించు సూర్యుడను నేను. వాయువులలో మరీచిని నేను. నక్షత్రములలో చంద్రుడను నేను.

వేదానాం సామవేదోఽస్మి దేవానా మస్మి వాసవః,
ఇన్ద్రియాణాం మన శ్చాస్మి భూతానా మస్మి చేతసా. 22

వేదములలో సామవేదము నేను. దేవతలలో నింద్రుడను నేను. ఇంద్రియములలో మనస్సును నేను. ప్రాణుల చేతనా శక్తిని నేను.

రుద్రాణాం శంకర శ్చాస్మి విత్తేశో యక్షరాక్షసామ్,
వసూనాం పావక శ్చాస్మి మేరు శ్శిఖరిణా మహమ్. 23

రుద్రులలో శంకరుడను నేను. యక్షరాక్షసులలో కుబేరుడను నేను. వసువులలో నగ్నిని నేను. పర్వతములలో మేరువును నేను.

పురోధసాంచ ముఖ్యం మాం విద్ధి పార్థ బృహస్పతిమ్,
సేనానీనా మహం స్కంద స్సరసా మస్మి సాగరః. 24

పార్థా, పురోహితులలో ప్రధానుడగు బృహస్పతిని నేనని తెలియుము. సేనాపతులలో కుమారస్వామిని నేను. సరోవరములలో సముద్రమును నేను.

మహర్షీణాం భృగురహం గిరా మస్మ్యేక మక్షరమ్,
యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి స్థావరాణాం హిమాలయః. 25

మహర్షులలో భృగువును నేను. వాక్కులలో నేకాక్షరమగు ఓంకారము నేను. యజ్ఞములలో జపయజ్ఞము నేను.

స్థావరములలో హిమాలయమును నేను.

అశ్వత్థ స్సర్వవృక్షాణాం దేవర్షీణాంచ నారదః,
గంధర్వాణాం చిత్రరథ స్సిద్ధానాం కపిలో మునిః. 26

సకలవృక్షములలో అశ్వత్థము నేను. దేవర్షులలో నారదుడను నేను. గంధర్వులలో చిత్రరథుడను నేను. సిద్ధులలో కపిలమునిని నేను.

ఉచ్చైశ్శ్రవస మశ్వానాం విద్ధి మా మమృతోద్భవమ్,
ఐరావతం గజేంద్రాణాం నరాణాంచ నరాధిపమ్. 27

అశ్వములలో నమృతముతో జన్మించిన యుచ్చైశ్శ్రవమును నేను. ఏనుగులలో నైరావతమును నేను. మనుష్యులలో రాజును నేను.

ఆయుధానా మహం వజ్రం ధేనూనా మస్మి కామధుక్,
ప్రజన శ్చాస్మి కందర్ప స్సర్పాణా మస్మి వాసుకిః. 28

ఆయుధములలో వజ్రమును నేను. గోవులలో కామధేనువు నేను. ప్రజోత్పత్తికి కారణుడగు కామదేవుడను నేను సర్పములలో వాసుకుని నేను.

అనంత శ్చాస్మి నాగానాం వరుణో యాదసా మహమ్,
పితౄణా మర్యమాచాస్మి యమ స్సంయమతా మహమ్. 29

నాగులలో శేషనాగుడను నేను. జలచరములలో వరుణుడను నేను. పితరులలో నర్యముడను నేను. దండించువారిలో యముడను నేను.

ప్రహ్లాద శ్చాస్మిదైత్యానాం కాలః కలయతా మహం,
మృగాణాంచ మృగేంద్రోఽహం వైనతేయశ్చ పక్షిణాం. 30

దైత్యులలో ప్రహ్లాదుడను. గణనచేయువారిలో కాలమును నేను. మృగములలో సింహమును నేను. పక్షులలో గరుత్మంతుడను నేను.

పవనః పవతా మస్మి రామ శ్శస్త్రభృతా మహం,
ఝషాణాం మకర శ్చాస్మి స్రోతసా మస్మి జాహ్నవీ. 31

పావనముచేయువారిలో పవనమును నేను. శస్త్రధారులలో పరసురాముడను నేను. చేపలలో మకరమును నేను. నదులలో గంగను నేను.

సర్గాణా మాదిరంతశ్చ మధ్యంచైవాహ మర్జున,
అధ్యాత్మవిద్యా విద్యానాం వాదః ప్రవదతా మహమ్. 32

అర్జునా, సృష్టియొక్క ఆదిమధ్యాంతములు నేను. విద్యయందధ్యాత్మ విద్యను నేను. వాదవివాదము సలుపువారి వాదము నేను.

అక్షరాణా మకారోఽస్మి ద్వంద్వ స్సామాసికస్యచ
అహమేవాక్షయః కాలో ధాతాఽహం విశ్వతోముఖః. 33

అక్షరములలో అకారమును నేను. సమాసములలో ద్వంద్వమును నేను. అక్షయమగు కాలము నేను. సర్వవ్యాపక రూపధారిని నేనే.

మృత్యుస్సర్వహర శ్చాహ ముద్భవశ్చ భవిష్యతామ్,
కీర్తిః శ్రీర్వాక్చనారీణాం స్మృతిర్మేధా ధృతిః క్షమా. 34

సర్వమును హరించు మృత్యువును నేను. ముందుపుట్టబోవువాని యుత్పత్తికారణమును నేను. స్త్రీలింగనామముల

యందు, కీర్తి, లక్ష్మి, వాణి, స్మృతి, మేధ, ధృతి, క్షమలు, నేనే.

బృహత్సామ తథాసామ్నాం గాయత్రీ ఛందసామహమ్,
మాసానాం మార్గశీర్షోఽహ మృతూనాం కుసుమాకరః. 35

సామములలో బృహత్సామము నేను. ఛందస్సులలో గాయత్రీ ఛందమును నేను. మాసములలో మార్గశీర్షమును నేనే. ఋతువులలో వసంతఋతువును నేను.

ద్యూతం ఛలయతా మస్మి తేజస్తేజస్వినా మహమ్,
జయోఽస్మి వ్యవసాయోఽస్మి సత్త్వం సత్త్వవతామహం. 36

వంచకుల జూదమును నేను. ప్రతాపవంతుల ప్రభావము నేను. జయమును నేను. నిశ్చయమును నేను. సాత్త్వికభావుల సత్త్వమును నేను.

వ్యాఖ్యానము:-"వంచకుల జూదమును నేను" అను నీవాక్యముచే బెదరపనిలేదు. ఇచట సారాసార నిర్ణయము చేయలేదు. జరుగునదంతయు నీశ్వరాజ్ఞ లేనిది జరుగదని మాత్రము తెలుపుచున్నది. మఱియు సర్వమీశ్వరాధీనమని యెఱిగిన కపటియైనను తనదురభిమానమును మాని కపటమును త్యజించుగాక.

వృష్ణీనాం వాసుదేవోఽస్మి పాండవానాం ధనంజయః,
మునీనా మప్యహం వ్యాసః కవీనా ముశనా కవిః. 37

వృష్ణికులమందు వాసుదేవుడను నేను. పాండవులలో ధనంజయుడను (అర్జునుడను) నేను. మునులలో వ్యాసుడను నేను. కవులలో శుక్రాచార్యుడను నేను.

దండో దమయతా మస్మి నీతి రస్మి జిగీషతామ్,
మౌనం చైవాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతామహమ్. 38

శిక్షించువారి దండమును నేను. జయమపేక్షించువారి నీతిని నేను. రహస్యములలో మౌనమును నేను. జ్ఞానుల జ్ఞానమును నేను.

యచ్చాపి సర్వభూతానాం బీజం తదహమర్జున,
న తదస్తి వినా యత్స్యా న్మయా భూతం చరాచరమ్. 39

అర్జునా, సమస్త ప్రాణుల యుత్పత్తికి కారణుడ నేనే. నేను లేని స్థావరజంగమ పదార్థ మెద్దియును లేదు.

నాంతోఽస్తి మమదివ్యానాం విభూతీనాం పరంతప,
ఏష తూద్దేశతః ప్రోక్తో విభూతే ర్విస్తరో మయా. 40

పరంతపా, నాదివ్యవిభూతుల కంతమే లేదు. విభూతుల కంతమే లేదు. విభూతుల సవిస్తారమును కేవల దృష్టాంత రూపముగానే తెల్పితిని.

యద్యద్విభూతి మత్సత్త్వం శ్రీమదూర్జిత మేవవా
తత్త దేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశసంభవమ్. 41

ఐశ్వర్యవంతమును, లక్ష్మీసమన్వితమును, ప్రభావ యుతమునగునదేదియున్నను అదినా తేజస్సుయొక్క అంశ వల్లనే కలిగినదని తెలిసికొమ్ము.

అథవా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున,
విష్టభ్యాహ మిదంకృత్స్న మేకాంశేన స్థితో జగత్. 42

అథవా, అర్జునా, యిట్లు సవిస్తారము తెలిసికొనుట

యేల? నాదగు నొక్క-అంశమాత్రముచేతనే నీసకల జగత్తును ధరించియున్నాను.

ఓమ్, తత్సత్.

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగ
శాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే విభూతి యోగో నామ
దశమోఽధ్యాయః.

ఈప్రకారము శ్రీమద్భగవద్గీతా-ఉపనిషత్ అనగా బ్రహ్మవిద్యాంతర్గత యోగశాస్త్రమందలి శ్రీకృష్ణార్జున సంవాదమందు విభూతి యోగమను పేరుగల పదియవ యధ్యాయము ముగిసినది.



# విశ్వరూప సందర్శన యోగము.

## ఏకాదశాధ్యాయము.



ఈ అధ్యాయమందు భగవానుడర్జునునకు తన విరాట్ స్వరూపము చూపించుచున్నాడు. భక్తులకీయధ్యాయము చాల ప్రియమైనది. ఇందు యుక్తులు లేవు. కాని, కేవల కావ్యము. ఈ యధ్యాయ మెంతచదివినను మనుష్యుడు విసువుచెందడు.

అర్జున ఉవాచ:—

మదనుగ్రహాయ పరమం గుహ్య మధ్యాత్మసంజ్ఞితమ్,
యత్త్వయోక్తం వచస్తేన మోహోఽయం విగతో మమ. 1

అర్జునుడు చెప్పుచున్నాడు:-నీవు నన్ననుగ్రహించి యీ ఆధ్యాత్మిక పరమరహస్యమును చెప్పియున్నావు. నీవునాకు తెల్పిన వాక్యములవలన నామోహము తొలగిపోయినది.

భవాప్యయౌహి భూతానాం శ్రుతౌ విస్తరశో మయా,
త్వత్తః కమలపత్రాక్ష! మాహాత్మ్య మపిచావ్యయమ్. 2

ప్రాణులఉత్పత్తి నాశముల విషయముననేను సవిస్తారముగా నీవలనవింటిని. అవ్యయమగు నీమాహాత్మ్యమును సైతము, ఓకమలపత్రాక్షా, అట్లే వింటిని.

ఏవమేత ద్యథాఽత్థ త్వమాత్మానం పరమేశ్వర,
ద్రిష్టు మిచ్ఛామి తే రూప మైశ్వరం పురుషోత్తమ. 3

ఓ పరమేశ్వరా, నిన్నుగూర్చి యెట్లు తెలియపరచు చున్నావో, నీవట్లే యున్నావు. పురుషోత్తమా, ఆనీయీశ్వర రూపమును దర్శించుకోర్కె పొడముచున్నది.

మన్యసే యది తచ్ఛక్యం మయా ద్రిష్టు మితి ప్రిభో,
యోగేశ్వర! తతో మే త్వం దర్శయాత్మాన మవ్యయమ్. 4

ప్రభూ, ఆరూపమును నేను చూడవచ్చునని నీకు తోచినయెడల అట్టి అవ్యయరూపమును ఓ యోగీశ్వరా నాకు చూపించుము.

శ్రీ భగవానువాచ.

పశ్యమే పార్థ! రూపాణి శతశోఽథసహస్రిశః,
నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీనిచ. 5

భగవానుడు చెప్పుచున్నాడు:-పార్థా, నా వందలకొలది వేలకొలది రూపములు చూడుము. అవి నానావిధములైనవి. దివ్యములైనవి. వేర్వేరురంగులు, ఆకృతులు, గలవి.

పశ్యాదిత్యాన్ వసూన్ రుద్రా నశ్వినౌ మరుత స్తథా,
బహూ న్యదృష్టపూర్వాణి పశ్యా శ్చర్యాణి భారత. 6

భారతా, ఆదిత్యులను, వసువులను, రుద్రులను, అశ్వినీదేవతలను, మరుత్తులను చూడుము. మున్నెన్నడును నీవుచూచియుండని యద్భుతము లనేకములు చూడుము.

ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరమ్,
మమదేహే గుడాకేశ! యచ్చాన్య ద్ద్రిష్టు మిచ్ఛసి. 7

గుడాకేశా, ఇందు, నాశరీరమందేకస్థమైయున్న స్థావరజంగమ ప్రపంచమంతయును మఱియు నీవు చూడదలచిన దంతయు నేడు చూడుము.

నతు మాం శక్యసే ద్రష్టు మనేనైవ స్వచక్షుషా,
దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగ మైశ్వరమ్. 8

ఈనీ చర్మచక్షువులతో నన్ను చూడజాలవు. నీకు దివ్యదృష్టి ఇచ్చుచున్నాను. నా యీశ్వరసంబంధమైన యోగమును చూడుము.

సంజయ ఉవాచ:—

ఏవముక్త్వా తతో రాజన్! మహాయోగేశ్వరో హరిః
దర్శయామాస పార్థాయ పరమం రూపమైశ్వరమ్. 9

సంజయుడు చెప్పుచున్నాడు:-ఓరాజా, ఇట్లనుడివి, యోగీశ్వరుడగు కృష్ణుడు పార్థునకు తన శ్రేష్ఠమైన యీశ్వర సంబంధమగు రూపమును చూపించెను.

అనేకవక్త్రనయన మనేకాద్భుతదర్శనమ్,
అనేక దివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధమ్. 10

అది యనేకములగు ముఖములు కన్నులుగలదియు, ననేకములగు నద్భుతదర్శనములు కలదియు, ననేకములగు దివ్యాభరణములు కలదియు, ననేకములగు పైకెత్తబడియున్న దివ్యాయుధములు కలదియునై యుండెను.

దివ్యమాల్యాంబరధరం దివ్యగంధానులేపనమ్,
సర్వాశ్చర్యమయం దేవ మనంతం విశ్వతోముఖమ్. 11

అది దివ్యములగు ననేకమాలికలను వస్త్రములను ధరించి యుండెను. దానిపై దివ్యసుగంధ లేపనములుండెను. ఇట్లది యన్నిరీతులచేత ఆశ్చర్యము, అనంతము, సర్వవ్యాపకమగు దైవమునై యుండెను.

దివి సూర్యసహస్రస్య భవే ద్యుగపదుత్థితా,
యదిభా స్సదృశీ సా స్యాద్భాస స్తస్యమహాత్మనః 12

ఆకాశమందొక్కసారిగ వేవురుసూర్యులకాంతి వెలువడిన యెడల నట్టికాంతి యామహాత్ముని కాంతితో నొకవేళ సమానమగునేమొ.

తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్త మనేకధా,
అపశ్యద్దేవదేవస్య శరీరే పాండవస్తదా. 13

అక్కడ అర్జునుడా దేవదేవుని శరీరమందు నానావిధములుగా విభక్తమైయున్న జగత్తు అంతయు నేకస్థమైయుండగా చూచెను.

తత స్సవిస్మయావిష్టో హృష్టరోమా ధనంజయః,
ప్రణమ్య శిరసా దేవం కృతాంజలి రభాషత. 14

పిమ్మట ధనంజయుడాశ్చర్య చకితుడు పులకితగాత్రుడునై తలవంచి చేతులుజోడించి యిట్లు పలికెను.

అర్జున ఉవాచ:—

పశ్యామి దేవాంస్తవదేవ! దేహేసర్వాంస్తథా భూతవిశేషసంఘాన్,
బ్రహ్మాణ మీశంకమలాసనస్థం ఋషీంశ్చ సర్వానురగాంశ్చదివ్యాన్. 15

అర్జునుడు చెప్పుచున్నాడు:- దేవా, నీదేహమందు నేను,

దేవతలను, నానావిధములగు సకలభూత సముదాయములను పద్మాసనముపై గూర్చుండియున్న యీశ్వరుడగు బ్రహ్మను, సమస్త ఋషులను దివ్యసర్పములను జూచుచున్నాను.

అనేకబాహూదరవక్త్రనేత్రంపశ్యామి త్వాంసర్వతోఽనంతరూపమ్,
నాంతం నమధ్యం నపునస్తవాదిం పశ్యామి విశ్వేశ్వర విశ్వరూపం. 16

నిన్ను నేను అనేకములగు హస్తములు, ఉదరములు, ముఖములు, నేత్రములుగల అనంతరూపునిగ జూచుచున్నాను నీకంతము లేదు. మధ్య లేదు. ఆది లేదు. ఓవిశ్వేశ్వరా, నీవిశ్వ రూపమును దర్శించుచున్నాను.

కిరీటినం గదినం చక్రిణంచ తేజోరాశిం సర్వతో దీప్తిమంతమ్
పశ్యామి త్వాందుర్నిరీక్ష్యంసమన్తా ద్దీప్తానలార్కద్యుతిమప్రమేయమ్ 17

కిరీటము, చక్రము, గద, ధరించియున్నట్టియు, తేజో రాశియైనట్టియు, సర్వత్ర తళతళమెఱయు కాంతిగల్గియున్న ట్టియు, కావుననే చూడనశక్యమైయున్నట్టియు, నపరిమితమై ప్రజ్వలించుచున్న అగ్ని, సూర్యులవలె నన్నిదిక్కులయందు దేదీప్యమానమై యున్నట్టియు నిన్ను జూచుచున్నాను.

త్వ మక్షరం పరమం వేదితవ్యం త్వ మస్య విశ్వస్య పరంనిధానమ్
త్వ మవ్యయ శ్శాశ్వతధర్మగోప్తా సనాతన స్త్వం పురుషోమతో మే. 18

నిన్ను తెలియదగిన పరమాక్షర స్వరూపునిగను ఈ జగత్తున కంతిమాధారునిగను, సనాతనధర్మమును రక్షించు అవినాశమూర్తిగను, సనాతనపురుషునిగ భావించుచున్నాను.

అనాదిమధ్యాంతమనంతవీర్య మనంతబాహుం శశిసూర్యనేత్రమ్
పశ్యామి త్వాందీప్తహుతాశవక్త్రం స్వతేజసావిశ్వ మిదం తపంతమ్. 19

ఆదిమధ్యాంతములు లేనివానిగను, అనంతశక్తిగలవానిగను అనంత బాహువులుగలవానిగను, సూర్యచంద్రులు నేత్రములుగ గలవానిగను, మండుచున్న యగ్నివంటి ముఖము గలవానిగను స్వకీయ తేజస్సుచే నీజగత్తును తపింపజేయుచున్నవానిగను నిన్ను నేను చూచుచున్నాను.

ద్యావాపృథివ్యో రిద మన్తరం హి వ్యాప్తం త్వయైకేన దిశశ్చ సర్వాః
దృష్ట్వాద్భుతంరూపము గ్రంతవేదం లోకత్రయంప్రవ్యథితంమహాత్మన్. 20

భూమ్యాకాశముల మధ్యభాగమందును, సకల దిక్కులయందును, నీవే ఒక్కడవు వ్యాపించుచున్నావు. మహాత్మా నీయీయద్భుత భయంకర రూపముచూచి మూడులోకములు గజగజ లాడుచున్నవి.

అమీ హి త్వాం సురసంఘావిశంతికేచి ద్భీతాః ప్రాంజలయో గృణంతి,
స్వస్తీత్యుక్త్వామహర్షి సిద్ధసంఘాఃస్తువంతి త్వాం స్తుతిభిః పుష్కలాభిః. 21

ఈదేవసంఘము నీయందు ప్రవేశించుచున్నది. భయభీతులై యెందఱో చేతులుజోడించి నిన్ను స్తవముచేయుచున్నారు. మహర్షులయొక్కయు సిద్ధులయొక్కయు సముదాయము, లోకములకు "కల్యాణమగుగాక" యని నుడువుచు నీయశస్సును గానము చేయుచున్నది.

రుద్రాదిత్యావసవోయేచ సాధ్యావిశ్వేఽశ్వినామరుతశ్చోష్మపాశ్చ,
గంధర్వ యక్షా సురసిద్ధసంఘావీక్షంతే త్వాంవిస్మితాశ్చైవసర్వే. 22

రుద్రులు, ఆదిత్యులు, వసువులు, సాధ్యులు, విశ్వేదేవులు, అశ్వినీకుమారులు, మరుత్తులు, ఊష్మపులు (వేడి నీరు త్రాగువారు), గంధర్వులు, యక్షులు, అసురులు, సిద్ధులు మున్నగువారందరు విస్మితులై నిన్ను వీక్షించుచున్నారు.

రూపంమహత్తే బహువక్త్రనేత్రం
మహాబాహో! బహుబాహూరుపాదం
బహూదరంబహుదంష్ట్రాకరాళం
దృష్ట్వాలోకాఃప్రవ్యథితాస్తథాఽహమ్. 23

ఓమహాబాహూ, అనేకముఖములను నేత్రములను, అనేకములగు హస్తములను, అనేకములగు తొడలను, అనేకములగు పాదములను, అనేకములగు నుదరములను, అనేకములగు కోరలను గలిగి భయంకరమైయున్న నీమహాస్వరూపమునుచూచి లోకులు భీతిల్లుచున్నారు నేనును అట్లే భీతిల్లుచున్నాను.

నభఃస్పృశం దీప్తమనేకవర్ణం వ్యాత్తాననందీప్తవిశాలనేత్రమ్,
దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితాంతరాత్మా ధృతిం నవిందామి
[శమంచ విష్ణో.

ఓ విష్ణువా, ఆకాశమును స్పృశించుచున్నట్టియు, జాజ్వల్యమానమగునట్టియు ననేకవర్ణములు కలిగినట్టియు, తెఱచియున్న ముఖములుగల్గినట్టియు, ప్రకాశవంతములగు విశాలనేత్రములుగల్గినట్టియు నిన్నుగాంచి భీతచిత్తుడనైతిని. నేను ధైర్యమును, శాంతిని, పొందజాలకున్నాను.

దంష్ట్రాకరాళానిచ తేముఖాని దృష్ట్వైవకాలానలసన్నిభాని,
దిశో నజానే నలభే చ శర్మ ప్రసీద దేవేశ! జగన్నివాస! 25

ప్రళయాగ్ని సదృశములైనట్టియు, భయంకరములగు కోరలుగల్గినట్టియు నీముఖములను చూడగా నాకు దిక్కులు తెలియకున్నవి. శాంతిబొందజాలకున్నాను. ఓ దేవేశా, జగన్నివాసా, ప్రసన్నుడవుకమ్ము.

అమీచ త్వాం ధృతరాష్ట్రస్యపుత్రాః సర్వేసహైవావనిపాలసంఘైః,
భీష్మోద్రోణ స్సూతపుత్ర స్తథాసౌ సహాస్మదీయైరపి యోధముఖ్యైః. 26
వక్త్రాణితే త్వరమాణావిశంతి దంష్ట్రాకరాళాని భయానకాని
కేచిద్విలగ్నాదశనాంతరేషుసందృశ్యంతే చూర్ణితైరుత్తమాంగైః 27

యానదాత్ర సంఘముతో ధృతరాష్ట్రుని యీ కుమారులును, భీష్ముడును, ద్రోణాచార్యుడును, సూతపుత్రుడగు ఈకర్ణుడును, మనముఖ్యయోధులును భయంకరములగు కోరలుగల నీభయంకర ముఖములలోనికి వేగముగ ప్రవేశించుచున్నారు. చూర్ణితశిరస్కులై కొందఱు నీదంతములమధ్య తగుల్కొని యగపడుచున్నారు.

యథా నదీనాం బహవోఽంబువేగాః సముద్రమేవాభిముఖాద్రవంతి,
తథా తవామీ నరలోకవీరా విశంతి వక్త్రాణ్యభివిజ్వలంతి. 28

నదులయొక్క గొప్పప్రవాహములు సముద్రాభిముఖములై ప్రవహించురీతి నీలోకనాయకులందఱును ప్రజ్వలించుచున్న నీముఖములో ప్రవేశించుచున్నారు.

యథా ప్రదీప్తం జ్వలనం పతంగా విశంతి నాశాయ సమృద్ధవేగాః.
తథైవ నాశాయ విశంతి లోకాస్తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః. 29

పతంగములు తమనాశనముకొరకై మండుచున్న అగ్నియందు మిక్కిలి వేగముతో దుముకునట్లే అందఱును నీముఖములయందు వడివడిగా ప్రవేశించుచున్నారు.

లేలిహ్యసే గ్రసమానః సమంతా ల్లోకాన్ సమగ్రాన్ వదనైర్జ్వలద్భిః
తేజోభి రాపూర్య జగ త్సమగ్రం భాసస్తవోగ్రాః ప్రతపంతి విష్ణో. 30

సర్వవ్యాపకుడగు నోవిష్ణూ, అందఱనన్ని వైపులనుండియు మ్రింగుచున్నవాడవై నీమండుచున్న నోళ్లతో నాకుచున్నావు. నిజకాంతిచే నీయుగ్రతేజము జగత్తునంతయునింపి దానిని తపింపజేయుచున్నది.

ఆఖ్యాహి మేకో భవానుగ్రరూపో నమోఽస్తుతే దేవవరప్రసీద,
విజ్ఞాతు మిచ్ఛామి భవంత మాద్యం నహి ప్రజానామి తవప్రవృత్తిమ్. 31

ఓ దేవశ్రేష్ఠుడా, ఉగ్రరూపుడగు నీవెవడవో నాకు తెలుపుము. ప్రసన్నుడవగుము. నీవు ఆదికారణుడవని తెలిసికొన గోరుచున్నాను. నీప్రవృత్తిని నేనెఱుగజాలను.

శ్రీభగవానువాచ:—

కాలోఽస్మిలోకక్షయకృ త్ప్రవృద్ధోలోకాన్ సమాహర్తుమిహ ప్రవృత్తః,
ఋతేఽపిత్వాం నభవిష్యంతి సర్వేయేఽవస్థితాః ప్రత్యనీకేషుయోధాః. 32

శ్రీభగవానుడు చెప్పుచున్నాడు:-నేను లోకనాశనముచేయు వృద్ధినొందిన కాలస్వరూపుడను. లోకసంహారనిమిత్తమిక్కడకువచ్చియున్నాను. ప్రతిసేనయందలి యీ

వచ్చియున్న యోధులలో నెవ్వరైనను, నీవుయుద్ధముచేయ నన్నను, తప్పిపోవువారు కారు.

తస్మాత్త్వముత్తిష్ఠ యశోలభస్వ జిత్వాశత్రూన్ భుంక్ష్వరాజ్యంసమృద్ధమ్,
మయైవైతే నిహతాః పూర్వమేవ నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్. 33

కాబట్టి లెమ్ము. కీర్తిసంపాదించుము. శత్రువుల జయించి ధనధాన్య సమృద్ధమగు రాజ్యమును భోగించుము. వీరిని ముందేచంపియున్నాను. సవ్యసాచీ, నీవు కేవల నిమిత్త మాత్రుడవగుము.

ద్రోణంచ భీష్మంచ జయద్రథంచకర్ణం తథాఽన్యానపియోధవీరాన్,
మయాహతాంస్త్వంజహి మావ్యథిష్ఠాయుధ్యస్వజేతాసి రణేసపత్నాన్ 34

ద్రోణుని, భీష్ముని, జయద్రథుని, కర్ణుని, ఇంక తదితర యోధులను ముందేచంపియేయున్నాను. వారిని నీవు సంహరించుము. భయపడకుము. పోరాడుము. నీవు యుద్ధమందు శత్రువులను జయించుటకున్నావు.

సంజయ ఉవాచ:—

ఏతచ్ఛ్రుత్వా వచనం కేశవస్య కృతాంజలి ర్వేపమానః కిరీటీ,
నమస్కృత్వా భూయఏవాహ కృష్ణం సగద్గదం భీతభీతః ప్రణమ్య. 35

సంజయుడు చెప్పుచున్నాడు:- కేశవుని యీమాటలు విని చేతులుజోడించి వణకుచు సారెసారెకు నమస్కరించుచు, భయపడుచు భయపడుచు ప్రణమిల్లి మకుటధారియగు నర్జునుడు గద్గదస్వరముతో శ్రీకృష్ణున కిట్లనియెను.

అర్జున ఉవాచ:—

స్థానే హృషీకేశ తవప్రకీర్త్యా జగత్ప్రహృష్యత్యనురజ్యతేచ,
రక్షాంసి భీతాని దిశో ద్రవంతి సర్వే నమస్యంతిచ సిద్ధసంఘాః. 36

అర్జునుడు చెప్పుచున్నాడు:-హృషీకేశా నిన్నుకీర్తించి నందున లోకమునకు కలుగు హర్షమును నీయందుత్పన్నమగు ననురాగమును నుచితమైనవే. భయభీతులగు రాక్షసులు ఇటునటు పరుగులిడుచున్నారు. సిద్ధసముదాయమంతయు నీకు నమస్కరించుచున్నది.

కస్మాచ్చ తే ననమేరన్ మహాత్మన్గరీయసే బ్రహ్మణోఽప్యాదికర్త్రే,
అనంత దేవేశ జగన్నివాస త్వ మక్షరం సదసత్తత్పరం యత్. 37

మహాత్మా, వారేల నీకు నమస్కరింపక యుందురు? నీవు బ్రహ్మకంటెనుకూడ గొప్ప ఆదికర్తవు. ఓ అనంతా, దేవేశా, జగన్నివాసా, నీవు అక్షరుడవు. సత్తు అసత్తునై యున్నావు. మఱియు వీనికతీతుడవు సైతమైయున్నావు.

త్వ మాదిదేవః పురుషః పురాణ స్త్వమస్య విశ్వస్య పరం నిధానమ్,
వేత్తాసి వేద్యంచ పరంచ ధామ త్వయా తతం విశ్వమనంతరూప! 38

నీవు ఆదిదేవుడవు. పురాణపురుషుడవు. నీవే విశ్వము నకు పరమాశ్రయస్థానమవు. నీవు తెలిసినవాడవు. తెలియ దగినవాడవు. నీవు పరంధాముడవు. ఓ అనంతరూపా, నీవే జగమందు వ్యాపించియున్నావు.

వాయుర్యమోఽగ్నిర్వరుణశ్శశాంకః ప్రజాపతిస్త్వం ప్రపితామహశ్చ,
నమో నమస్తేఽస్తు సహస్రకృత్వః పునశ్చ భూయోఽపి నమో నమస్తే. 39

వాయువు, యముడు, అగ్ని, వరుణుడు, చంద్రుడు, ప్రజాపతి, ప్రపితామహుడు నీవే. నీకు వేయిమారులు నమస్కరించుచున్నాను.

నమః పురస్తా దథపృష్ఠతస్తే నమోఽస్తుతే సర్వత ఏవ సర్వ,
అనంతవీర్యామితవిక్రమస్త్వం సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః. 40

ఓ సర్వమూర్తీ, నీకు ముందునుండి, వెనుకనుండి, అన్నిదిక్కులనుండి నమస్కారములు. నీవీర్యమనంతము. నీ శక్తి యపారము. సమస్తమును నీవు ధరించుచున్నావు. కావున నీవేసర్వమునై యున్నావు.

సఖేతి మత్వా ప్రసభం యదుక్తం హే కృష్ణ హే యాదవ హేసఖేతి,
అజానతామహిమానం తవేదం మయాప్రమాదా త్ప్రణయేన వాపి. 41

యచ్చావహాసార్థ మసత్కృతోఽసి విహారశయ్యాసనభోజనేషు,
ఏకోఽథవాప్యచ్యుత! తత్సమక్షంతత్ క్షామయేత్వామహ మప్రమేయమ్.

స్నేహితుడనుకొని, నీయీమహిమను తెలియక, ఓ కృష్ణా, ఓయాదవా, ఓసఖా, యని ప్రమాదముచేగాని, ప్రేమచేగాని పిలిచిన నాయవివేకమును, వినోదార్థము ఆడునప్పుడును, నిద్రించునప్పుడును, కూర్చుండునప్పుడును, తినునప్పుడును, నీసాంగత్యమందున్నపుడు నీయెడగావించిన యవమానమును క్షమింపవలెనని ప్రార్థించుచున్నాను.

పితాసిలోకస్య చరాచరస్య త్వమస్యపూజ్యశ్చ గురుర్గరీయాన్,
నత్వత్సమోఽస్త్యభ్యధికఃకుతోఽన్యో లోకత్రయేఽప్యప్రతిమప్రభావః 43

స్థావరజంగమప్రపంచమునకు నీవు తండ్రివి. నీవు దా

నికి పూజ్యుడవు శ్రేష్ఠుడవునైన గురుండవు. నీకు సమానుఁడై న్వాడును లేడు. ఇట్టిచో నీకంటె నధికుడైనవాఁడెట్లు కలుగును? మూడులోకములయందు నీసామర్థ్యమునకు సాటిలేదు.

తస్మాత్ ప్రణమ్య ప్రణిధాయ కాయం ప్రసాదయే త్వా మహ మీశ
మీడ్యమ్,
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః ప్రియః ప్రియాయార్హసి దేవ! సోఢుమ్. 44

కాబట్టి సాష్టాంగనమస్కారము చేసి పూజ్యుడవు నీశ్వరుడవు అగునిన్ను బ్రసన్నుడవగుటకై ప్రార్థించుచున్నాను. దేవా, పుత్రునిదండ్రియు, మిత్రుని మిత్రుడును, సహించు విధమున నీవు నాప్రియుడవైనందున నాశుభమునుగూర్చి నన్ను సహింప దగును.

అదృష్టపూర్వం హృషితో౽స్మిదృష్ట్వా భయేనచప్రవ్యథితంమనో. మే,
తదేవ మే దర్శయ దేవ! రూపం ప్రసీద దేవేశ జగన్నివాస! 45

ఇదివఱకెన్నడును చూచియుండని యిట్టి నీరూపమును చూచి రోమాంచితుడనైతిని. భయముచే నామనస్సు వ్యాకులమైనది. కాబట్టి, ఓదేవా, నీతొంటిరూపమును చూచి రోమాంచితుడనైతిని. భయముచే నామనస్సు వ్యాకులమైనది. కాబట్టి, ఓదేవా, నీతొంటిరూపమును చూపించుము. దేవేశా, జగన్నివాసా, ప్రసన్నుడవుకమ్ము.

కిరీటినం గదినం చక్రహస్త మిచ్ఛామి త్వాం ద్రష్టు మహం తథైవ,
తేనైవరూపేణచతుర్భుజేన సహస్రబాహో భవ విశ్వమూర్తే. 46

పూర్వమువలె నీయొక్క మకుటచక్ర గదాభూషిత

రూపమును చూడగోరుచున్నాను. కావున ఓసహస్రబాహూ, ఓవిశ్వమూర్తీ, నీచతుర్భుజస్వరూపమును ధరించుము.

శ్రీభగవానువాచ:—

మయాప్రసన్నేన తవార్జునేదం రూపం పరం దర్శితమాత్మయోగాత్,
తేజోమయం విశ్వమనంతమాద్యం యన్మే త్వదన్యేన నదృష్టపూర్వం 47

శ్రీభగవానుడు చెప్పుచున్నాడు:-అర్జునా, నీయందు ప్రసన్నుడనై నేనునాశక్తి వలన తేజోమయము, విశ్వవ్యాపకము, అనంతము, పరమము, నగునా ఆదిరూపమును చూపించితిని. నీవుతప్ప మఱెవ్వరును ముందు చూచియుండలేదు.

నవేదయజ్ఞాధ్యయనైర్నదానైర్నచక్రియాభిర్నతపోభిరుగ్రైః,
ఏవంరూపశ్శక్యఅహం నృలోకేద్రష్టుంత్వదన్యేనకురుప్రవీర! 48

కురుప్రవీరా, నీవుతప్ప యితరులెవ్వరును వేదాభ్యాసముచేగాని, యజ్ఞములచేగాని, వివిధశాస్త్రాధ్యయనముచేగాని, దానముచేగాని క్రియలచేగాని, లేక యుగ్రతపస్సులచేగాని, నారూపము చూడసమర్థులుకారు.

మాతే వ్యథా మాచ విమూఢభావో దృష్ట్వా రూపం ఘోర మీదృ
[ఙ్మమేదమ్,
వ్యపేతభీః ప్రీతమనాః పునస్త్వం తదేవ మే రూప మిదం ప్రపశ్య. 49

ఈనాభయంకరరూపమును చూచి భయపడకుము. మోహమున చిక్కకుము. భయమునువిడిచి శాంతచిత్తుడవై నాపరిచితరూపమును మరల చూడుము.

సంజయ ఉవాచ:—

ఇత్యర్జునం వాసుదేవస్తథోక్త్వా స్వకంరూపం దర్శయామాస భూయః
ఆశ్వాసయామాస చ భీత మేనం భూత్వా పునస్సౌమ్యవపుర్మహాత్మా.

సంజయుడు చెప్పుచున్నాడు:-అర్జునునితో నిట్లు పలికినవాడై వాసుదేవుడు తనరూపమును మరల చూపించెను. మరల సౌమ్యమగురూపమును ధరించి ఆమహాత్ముడు అతిభీతుడైయున్న యర్జునుని నోదార్చెను.

అర్జున ఉవాచ:—

దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన,
ఇదానీ మస్మి సంవృత్తః సచేతాః ప్రకృతిం గతః. 50

అర్జునుడు చెప్పుచున్నాడు:-ఈ సౌమ్యమగు నీమానవరూపమునుగాంచి యిప్పుడు నేను శాంతుడనైతిని. స్వస్థతను పొందితిని.

శ్రీ భగవానువాచ.

సుదుర్దర్శమిదం రూపం దృష్టవా నసి యన్మమ
దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శనకాంక్షిణః 52

శ్రీభగవానుడు చెప్పుచున్నాడు:-నీవుచూచిన నా రూపముయొక్క దర్శనము మిగుల దుర్లభమైనది. దేవతలు సైతమూరూపము చూచుట కాతురత పడుచుందురు.

నాహం వేదై ర్నతపసా నదానేన నచేజ్యయా,
శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా. 53

నీవుదర్శించిన నాదర్శనము, వేదములచేగాని తపస్సులచేగాని దానములచేగాని యజ్ఞములచేగాని లభింపదు.

భక్త్యా త్వనన్యయాశక్య అహ మేవం విధోఽర్జున,
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుంచ పరంతప. 54

కాని యర్జునా, పరంతపా, (నావిషయమున) నన్ను గూర్చినయిట్టి జ్ఞానమును, నాదగు ఇట్టి దర్శనమును, మఱియు నాయందలి వాస్తవిక ప్రవేశమును కేవల మనన్యభక్తి వల్లనే సాధ్యమగుచున్నది.

మత్కర్మకృ న్మత్పరమో మద్భక్త స్సంగవర్జితః
నిర్వైర స్సర్వభూతేషు యస్సమామేతి పాండవ! 55

పాండవా, ఎవ్వఁడు సమస్తకర్మలు నాకు సమర్పించుచున్నాఁడో, నాయందు పరాయణుఁడైయున్నాఁడో, నాకు భక్తుఁడగుచున్నాఁడో, ఆసక్తిని త్యజించుచున్నాఁడో, సకల ప్రాణులయందు ద్వేషరహితుఁడై యున్నాఁడో, వాఁడునన్ను పొందుచున్నాఁడు.

ఓమ్, తత్సత్.

ఇతి శ్రీమద్భగవద్గీతానూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగ
శాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే విశ్వరూపసందర్శన యోగోనామ
ఏకాదశోఽధ్యాయః.

ఈప్రకారము శ్రీమద్భగవద్గీతా-ఉపనిషత్ అనగా బ్రహ్మవిద్యాంతర్గత యోగశాస్త్రమందలి శ్రీకృష్ణార్జున సంవాదమందు విశ్వరూపసందర్శన యోగమను పేరుగల పదునొకండవ యధ్యాయము ముగిసినది.

# భక్తి యోగము.

## ద్వాదశాధ్యాయము.



పురుషోత్తమ దర్శన మనన్యభక్తి వలననే సంప్రాప్త మగునని భగవానుడు చెప్పినపిమ్మట ఇకముందు రావలసి యున్నది భక్తిస్వరూపమేకదా! ఈ పంక్తిరించిన యధ్యాయ మెల్లరు కంఠస్థము చేసికొనవలయును. ఇది యన్నిటికంటె చిన్నదగు నొక యధ్యాయము. ఇందు తెలిపిన భక్త లక్షణములు నిత్యము స్మరింపదగినవి.

అర్జున ఉవాచ:—

ఏవం సతతయుక్తాయే భక్తాస్త్వాం పర్యుపాసతే,
యేచాప్యక్షర మవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః. 1

అర్జునుడు చెప్పుచున్నాడు:- ఈవిధమున నిన్ను నిరంతరము ధ్యానించుచు నుపాసించువారును నీయవ్యయమగు నవ్యక్తరూపమును ధ్యానించువారునగు నీభక్తులలో ఏ యోగి శ్రేష్ఠుడని భావింపబడవచ్చును.

శ్రీభగవానువాచ:—

మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే,
శ్రద్ధయా పరయోపేతా స్తే మే యుక్తతమా మతాః. 2

భగవానుడు చెప్పుచున్నాడు:-సదా ధ్యానించుచు, నా

యందు మనస్సునిలిపి శ్రద్ధతో నన్నుపాసించు వానిని శ్రేష్ఠుడగు యోగియని భావించుచున్నాను.

యేత్వక్షర మనిర్దేశ్య మవ్యక్తం పర్యుపాసతే,
సర్వత్రగమచింత్యంచ కూటస్థమచలం ధ్రువమ్. 3
సన్నియమ్యేంద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః,
తే ప్రాప్నువంతి మామేవ సర్వభూతహితే రతాః 4

అన్ని యింద్రియములను వశమందుంచుకొని సర్వత్ర సమబుద్ధిగలవారై యెవ్వరు దృఢమైనట్టియు, నచలమైనట్టియు, గంభీరమైనట్టియు, నచింత్యమైనట్టియు, సర్వవ్యాపకమైనట్టియు అవర్ణనీయమైనట్టియు నక్షరస్వరూపము నుపాసించుచున్నారో అట్టి సర్వభూతహితతత్పరులు నన్నే పొందుచున్నారు.

క్లేశోఽధికతర స్తేషా మవ్యక్తాసక్త చేతసామ్,
అవ్యక్తాహి గతిర్దుఃఖం దేహవద్భి రవాప్యతే. 5

ఎవ్వరిచిత్త మవ్యక్తమందాసక్తమైయుండునో, వారికి కష్టములధికములు. అవ్యక్తగతిని దేహి కష్టములచేతనే పొందగలడు.

వ్యాఖ్యానము:-దేహధారియగు మనుష్యుడు మూర్తివంతముకాని స్వరూపమును కేవలకల్పన మాత్రమే చేయగలడు. వానివద్దనట్టి యమూర్తివంతమగు స్వరూపమునకై రూఢియగు శబ్దమొక్కటియైనను లేదు. కావుననే వాడు నిషేధాత్మకమైన "నేతి" శబ్దముతోడనే సంతుష్టిపొందవలసియున్నది.

ఈ కారణమునననే విగ్రహారాధనను నిషేధించువారుసైతము సూక్ష్మరూపమున విచారించినచో విగ్రహారాధకులే యయ్యెదరు. గ్రంథము నారాధించుట మందిరములకరిగి పూజించుట ఒకేదిక్కునముఖముంచి పూజించుట మున్నగునవన్నియు సాకారపూజాలక్షణములే. ఇట్లుండియు సాకారమునకావల అచింత్యమగు నిరాకారస్వరూపమున్నది. ఎల్లరిది గ్రహింపవలయును. భక్తియొక్క పరాకాష్ఠ యిది-భక్తుడు భగవంతునియందు లీనుడైపోవలయును. తుదకొక్క అద్వితీయుడు నిరాకారుడునగు భగవంతుడే శేషించి యుండవలయును. కాని యీస్థితి సాకారముఖమున మాత్రమే సులభముగా బడయవచ్చును. ఈకారణముచేత సూటిగా నిరాకారబ్రహ్మనుచేరు మార్గము కష్టసాధ్యమనిరి.

యేతు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః,
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయంత ఉపాసతే. 6
తేషామహం సముద్ధర్తా మృత్యుసంసార సాగరాత్,
భవామి నచిరా త్పార్థ మయ్యావేశితచేతసామ్. 7

పార్థా, ఎవరు నాయందు పరాయణులై సర్వకర్మలు నాకు సమర్పించి ఏకనిష్ఠతో నన్నుధ్యానించుచు నన్నుపాసించుచున్నారో, యెవరిచిత్తము నాయందు చేర్చబడియున్నదో, వారిని, మృత్యురూప సంసారసాగరమునుండి వెంటనే తరింప జేయుచున్నాను.

మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ,
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం నసంశయః 8

నీమనస్సును నాయందునిలుపుము. నీబుద్ధిని నాయందుంచుము. ఇందుచేత దీనికి (జన్మమునకు) పిమ్మట నీవు నిస్సంశయముగ నన్నే పొందెదవు.

అథ చిత్తం సమాధాతుం నశక్నోషి మయిస్థిరమ్,
అభ్యాసయోగేన తతో మామిచ్ఛాప్తుం ధనంజయ. 9

ధనంజయా, నీవునీచిత్తమును నాయందు నిలుపుట కశక్తుడవైతివేని అభ్యాసయోగముచే నన్నుపొంద నిశ్చయించవలెను.

అభ్యాసేఽప్యసమర్థోఽసి మత్కర్మ పరమో భవ,
మదర్థ మపికర్మాణి కుర్వన్ సిద్ధిమవాప్స్యసి. 10

ఈయభ్యాసమునకు నీవసమర్థుడవైతివేని సకలకర్మలు నాకు సమర్పించుము. మఱియు నిట్లు నానిమిత్తము కర్మల నాచరించుచునైనను నీవు మోక్షము పొందుదువు.

అథైత దప్యశక్తోఽసి కర్తుం మద్యోగ మాశ్రితః
సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్. 11

నానిమిత్తము కర్మలనాచరించునంతటి శక్తియైననునీకు లేనిచో ప్రయత్నపూర్వకముగా కర్మఫలితముల విడువుము.

శ్రేయోహి జ్ఞాన మభ్యాసాత్ జ్ఞానా ద్ధ్యానం విశిష్యతే,
ధ్యానాత్కర్మఫలత్యాగ స్త్యాగా చ్ఛాంతిరనంతరమ్. 12

అభ్యాసమార్గముకంటె జ్ఞానమార్గము శ్రేయస్కరము. జ్ఞానమార్గముకంటె ధ్యానమార్గము విశేషము. ధ్యానమార్గముకంటె కర్మఫలత్యాగము శ్రేష్ఠము. కారణమేమన

త్యాగమునకు తుదను తక్షణము శాంతియే కలుగును.

వ్యాఖ్యానము:-అభ్యాసమనగా చిత్తవృత్తుల నిరోధించుసాధనము. జ్ఞానమనగా శ్రవణమనవాములు. ధ్యానమనగా యుపాసన. వీనిఫలితముగా కర్మఫలత్యాగ మగుపక్షనిచో ఆఅభ్యాస మభ్యాసముకాదు. జ్ఞానము జ్ఞానముకాదు. ధ్యానము ధ్యానముకాదు.

అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ,
నిర్మమో నిరహంకార స్సమదుఃఖసుఖఃక్షమీ. 13

సంతుష్ట స్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః
మయ్యర్పిత మనోబుద్ధి ర్యో మద్భక్త స్స మేప్రియః 14

సర్వభూతముల యెడ ద్వేషరహితుడు, ఎల్లరకు మిత్రుడు, దయాళువు, అహంకార మమకారములు లేనివాడు, సుఖదుఃఖములయందు సముడు, సహనశీలుడు, నిత్యసంతుష్టుడు, యోగయుక్తుడు, ఇంద్రియనిగ్రహుడు, దృఢనిశ్చయుడు, తన మనోబుద్ధులు నాకు సమర్పించినవాడు, నగునట్టి నా భక్తుడు నాకు ప్రియుడు.

యస్మాన్నోద్విజతే లోకోలోకా న్నోద్విజతేచ యః,
హర్షామర్ష భయోద్వేగైర్ముక్తో యస్సచమే ప్రియః. 15

ఎవనిచే లోకులు సంక్షోభము పొందరో ఎవనికి లోకులవలన సంక్షోభము కలుగదో, ఎవడు హర్షము, క్రోధము, ఈర్ష్య, భయము, సంక్షోభములనుండి ముక్తుడై యున్నాడో వాడునాకు ప్రియుడు.

అనపేక్షః శ్శుచి ర్దక్ష ఉదాసీనో గతవ్యథః,
సర్వారంభపరిత్యాగీ యో మద్భక్తస్స మే ప్రియః. 16

ఇచ్ఛారహితుడును, పవిత్రుడును, దక్షుడును, (సావధానుడు) తటస్థుడును, చింతారహితుడును, సంకల్ప పరిత్యాగియు నెవ్వడో వాడు నాభక్తుడు. వాడు నాకు ప్రియుడు.

యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి,
శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్ యస్స మే ప్రియః. 17

ఎవ్వడు సంతోషింపడో, ఎవ్వడు ద్వేషింపడో, ఎవ్వడు చింతింపడో ఎవ్వడాశా బద్ధుడుకాడో, ఎవ్వడు శుభాశుభ పరిత్యాగియో అట్టి భక్త పరాయణుడు నాకు ప్రియుడు

సమశ్శత్రౌచ మిత్రేచ తథా మానావమానయోః
శీతోష్ణసుఖదుఃఖేషు సమస్సంగవివర్జితః. 18

తుల్యనిందాస్తుతిర్మౌనీ సంతుష్టో యేన కేనచిత్,
అనికేతః స్థిరమతి ర్భక్తిమాన్ మే ప్రియో నరః. 19

శత్రుమిత్రులు, శీతోష్ణములు, మానావమానములు, సుఖదుఃఖములు అను వీనినన్నిటియందు సమభావముగల్గినట్టియు, ఆసక్తి విడిచినట్టియు, నిందాస్తుతులయందు సమముగ వర్తించునట్టియు, మౌనముధరించి యున్నట్టియు, లభించిన దానితో సంతుష్టుడగుచున్నట్టియు, స్వస్థలమనునది లేనట్టియు, స్థిరచిత్తుడైనట్టియు, ముని, భక్తుడు, నాకు ప్రియుడు.

యేతు ధర్మ్యామృతమిదం యథోక్తం పర్యుపాసతే,
శ్రద్దధానా మత్పరమా భక్తాస్తేఽతీవ మే ప్రియాః, 20

ఎవరు నాయందు పరాయణులై పవిత్రామృతతుల్యమగు నీజ్ఞానమును శ్రద్ధాపూర్వకముగ సేవింతురో వారు నాకత్యంత ప్రియభక్తులై యున్నారు.

ఓమ్, తత్సత్.

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగ
శాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే భక్తియోగో నామ
ద్వాదశోఽధ్యాయః.

ఈప్రకారము శ్రీమద్భగవద్గీతా-ఉపనిషత్ అనగా బ్రహ్మవిద్యాంతర్గత యోగశాస్త్రమందలి శ్రీకృష్ణార్జున సంవాదమందు భక్తియోగమను పేరుగల పండ్రెండవ యధ్యాయము ముగిసినది.



# క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగము.

## త్రయోదశాధ్యాయము.



ఈయధ్యాయమందు దేహమునకును దేహికిని గల భేదమును తెలిపి యున్నాడు.

శ్రీభగవానువాచ:—

ఇదం శరీరం కౌంతేయ! క్షేత్ర మిత్యభిధీయతే,
ఏత ద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః. 1

శ్రీభగవానుడు చెప్పుచున్నాడు:-కౌంతేయా, యీ దేహమునకు క్షేత్రమని పేరు. దీనిని తెలిసికొన్నవాడు క్షేత్రజ్ఞుడని తత్వజ్ఞులు చెప్పుచున్నారు.

క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత,
క్షేత్రక్షేత్రజ్ఞయోర్జ్ఞానం యత్తత్ జ్ఞానం మతం మమ. 2

భారతా, సమస్త క్షేత్రములందు-దేహములందు-ఉన్నట్టినన్ను క్షేత్రజ్ఞునిగ తెలిసికొమ్ము. క్షేత్రక్షేత్రజ్ఞుల జ్ఞానమే జ్ఞానమని నామతము.

తత్క్షేత్రం యచ్చయాదృక్చ యద్వికారి యతశ్చ యత్
సచయో యత్ప్రభావశ్చ తత్సమాసేన మే శృణు. 3

ఈ క్షేత్రమేరూపముకలది? ఎట్టివికారములుకలది? దేనినుండి కలుగుచున్నది? క్షేత్రజ్ఞుడెవడు? ఆతని ప్రభావ

మెట్టిది? అను విషయములగూర్చి నావలన సంక్షేపముగా వినుము.

ఋషిభి ర్బహుధా గీతం ఛందోభి ర్వివిధైః పృథక్,
బ్రహ్మసూత్రపదైశ్చైవ హేతుమద్భి ర్వినిశ్చితైః. 4

వివిధ ఛందస్సులలో ననేకవిధములుగా దృష్టాంతములతో గూడిన యుక్తులతోడను, నిశ్చయాత్మకములగు బ్రహ్మసూచక వాక్యములతోడను ఋషులీవిషయమును మిక్కిలి గానముచేసియున్నారు.

మహాభూతా న్యహంకారో బుద్ధిరవ్యక్తమేవచ,
ఇంద్రియాణి దశైకంచ పంచ చేంద్రియగోచరాః 5

ఇచ్ఛా ద్వేష స్సుఖం దుఃఖం సంఘాత శ్చేతనాధృతిః,
ఏతత్ క్షేత్రం సమాసేన సవికార ముదాహృతమ్. 6

మహాభూతములు, అహంకారము, బుద్ధి, ప్రకృతి, దశేంద్రియములు, ఒకమనస్సు, అయిదు విషయములు, ఇచ్ఛాద్వేషములు, సుఖదుఃఖములు, సంఘాతము, చేతనశక్తి ధృతి, ఇవి తమవికారములతోకూడ కలిసి క్షేత్రమని సంక్షేపముగా చెప్పితిని.

వ్యాఖ్యానము:-మహాభూతములైదు-భూమి, నీరు, నిప్పు, గాలి, ఆకాశము. అహంకారమనగా శరీరమందు నేనను అహంభావము. అవ్యక్తమనగా అదృశ్యమైయుండు మాయ లేక ప్రకృతి. దశేంద్రియములలో అయిదు జ్ఞానేంద్రియములు-ముక్కు, చెవులు, కన్నులు, నాలుక, చర్మము.

అయిదు కర్మేంద్రియములు-చేతులు, కాళ్లు, నోరు, రెండు గుహ్యేంద్రియములు. జ్ఞానేంద్రియములవిషయములు అయిదు ఆఘ్రాణించుట, వినుట, రుచిచూచుట, తగులుట, చూచుట. సంఘాతమనగా శరీరతత్త్వముల పరస్పరము కలుపుశక్తి. ధృతి యనగా ధైర్యరూపమగు సూక్ష్మగుణముకాదు. ఇది యీ శరీరమందలి పరమాణువులను పరస్పరము కలుపుచున్నశక్తి. ఈగుణ మహంకారమువల్లనే కలుగుచున్నది. ఈయహంకార మవ్యక్త ప్రకృతియందుగలదు. మోహరహితుడీ యహంకారమును తెలిసికొని విడుచుచున్నాడు. ఈకారణమున మరణ సమయమందుగాని తదితర కష్టసమయముల యందుగాని వీడు దుఃఖింపడు. జ్ఞాని, అజ్ఞాని అందఱును తుదకీ వికారక్షేత్రమును విడువవలసియే వచ్చుచున్నది.

అమానిత్వమదంభిత్వ మహింసాక్షాంతి రార్జవమ్,
ఆచార్యోపాసనం శౌచం స్థైర్య మాత్మవినిగ్రహః. 7

ఇంద్రియార్థేషు వైరాగ్య మనహంకార ఏవచ,
జన్మమృత్యుజరావ్యాధి దుఃఖదోషానుదర్శనమ్. 8

అసక్తి రనభిష్వంగః పుత్రదారగృహాదిషు,
నిత్యంచ సమచిత్తత్వమిష్టానిష్టోపపత్తిషు. 9

మయి చానన్యయోగేన భక్తి రవ్యభిచారిణీ,
వివిక్త దేశ సేవిత్వ మరతిర్జనసంసది. 10

అధ్యాత్మజ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థదర్శనమ్,
ఏతత్ జ్ఞానమితి ప్రోక్త మజ్ఞానం యదతోఽన్యథా 11

ఆత్మస్తుతి లేకుండుట, దంభము లేకుండుట, అహింస, ఓర్పు, సరళత్వము, ఆచార్యసేవ, శుచిత్వము, స్థిరత్వము, మనోనిగ్రహము, ఇంద్రియవిషయవైరాగ్యము, అహంకార రాహిత్యము, జననము, మరణము, ముదిమి, రోగము, దుఃఖము దోషములు సదాకనిపెట్టుట, పుత్రుడు, స్త్రీ, గృహము అనువానియందు మోహమమకారములు లేకుండుట, ప్రియాప్రియముల యందెల్లప్పుడు సమభావముకలిగి యుండుట, నాయందనన్య ధ్యానపూర్వకమగు నేకనిష్ఠతో గూడిన భక్తి, ఏకాంతస్థలసేవనము, జనసమూహముతో కలిసియుండుట యందనిష్టత, అధ్యాత్మజ్ఞానముయొక్క నిత్యత్వమందు దృష్టి, ఆత్మదర్శనము-ఇదియంతయు జ్ఞానమనబడు చున్నది. దీనికి ప్రతికూలమంతయు నజ్ఞానము.

జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యద్జ్ఞాత్వాఽమృత మశ్నుతే,
అనాది మత్పరం బ్రహ్మ నసత్తన్నాసదుచ్యతే. 12

దేని నెఱిగినవారు మోక్షము పొందుచున్నారో ఆ జ్ఞేయ మెట్టిదో నీకు చెప్పుచున్నాను. అది అనాది పరబ్రహ్మము. అది సత్తనుటకును వీలులేదు. అసత్తనుటకును వీలు లేదు.

వ్యాఖ్యానము:-ఈశ్వరుని సత్తనిగాని యసత్తనిగాని యనుటకు వీలు లేదు. ఏ యేకశబ్దముచేతను వర్ణించుటకు వీలు లేనట్టి గుణాతీతమగు స్వరూపమును కల్గియున్నాడు.

సర్వతః పాణిపాదం తత్సర్వతోఽక్షిశిరోముఖమ్,
సర్వతః శ్రుతిమ ల్లోకే సర్వ మావృత్య తిష్ఠతి. 13

ఎక్కడచూచిన అక్కడదాని చేతులును, కాళ్లును, కన్నులును, తలలును, నోళ్లును, చెవులును కలవు. ఈ లోకమున సర్వత్రి వ్యాపించియున్నది.

సర్వేంద్రియగుణాభాసం సర్వేంద్రియవివర్జితమ్,
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణ భోక్తృచ. 14

దానియందు సర్వేంద్రియముల సంబంధమైన గుణములయొక్క యా భాసకలదు. అయినను ఆస్వరూప మిం ద్రియరహితమై సర్వమందలిప్తమైయున్నది. కాని యది సర్వమును ధరించునది. అది గుణరహితమైయున్నను, గుణభోక్తగా నున్నది.

బహి రంతశ్చ భూతానా మచరం చర మేవచ,
సూక్ష్మత్వాత్త దవిజ్ఞేయం దూరస్థం చాంతికేచ తత్. 15

అది భూతముల వెలుపలను లోపలను కూడ నున్నది. అది చరమున చరమునైయున్నది. సూక్ష్మమైనందున అది అవిజ్ఞేయమై యున్నది. అది దూరముననున్నది. సమీపముననున్నది.

వ్యాఖ్యానము:-దాని నెవడు గుర్తించుచున్నాడో వాడు దానిలోపలనున్నాడు. చలత్వము, స్థిరత్వము, శాంతి, అశాంతిమున్నగు మనము పొందుచున్నవన్నియును, అన్ని భావములును, దానినుండియే కలుగుచున్నవి. ఈ కారణమున నది చరమున చరమునై యున్నది.

అవిభక్తంచ భూతేషు విభక్త మివ చ స్థితమ్,
భూతభర్తృ తద్ జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణుచ. 16

అది భూతములయందవిభక్తముగ నున్నది. విభక్తముగ నున్నట్లును, గోచరించుచున్నది. అది మెఱుగఁదగినదియు, (బ్రహ్మము) భూతముల పాలించునదియు, నశింపజేయునదియు, సృజించునదియునై యున్నది.

జ్యోతిషామపి తజ్జ్యోతి స్తమసః పర ముచ్యతే,
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య ధిష్ఠితమ్. 17

అది జ్యోతులకుకూడ జ్యోతి. అంధకారమునకంటె పరమైన దందురు. జ్ఞానమదియే. జ్ఞేయమదియే. జ్ఞానగమ్యము కూడనదియే. మఱియు నది సకలప్రాణుల హృదయముల యందధిష్ఠించి యున్నది.

ఇతి క్షేత్రం తథా జ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసతః
మద్భక్త ఏత ద్విజ్ఞాయ మద్భావా యోపపద్యతే. 18

ఈప్రకారము క్షేత్రమునుగూర్చియు, జ్ఞానజ్ఞేయములనుగూర్చియు సంక్షేపముగా చెప్పితిని. దీనిని తెలిసికొని నాభక్తుడు నాభావమునుపొంద నర్హుడగుచున్నాడు.

ప్రకృతిం పురుషంచైవ విద్ధ్యనాదీ ఉభావపి,
వికారాంశ్చ గుణాంశ్చైవవిద్ధి ప్రకృతిసంభవాన్, 19

ప్రకృతి పురుషులిద్దఱు ఆదిలేనివారని తెలిసికొమ్ము. వికారములును గుణములును ప్రకృతినుండి యుత్పన్నములగుచున్నవని తెలిసికొమ్ము.

కార్యకారణకర్తృత్వే హేతుః ప్రకృతి రుచ్యతే,
పురుష స్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతు రుచ్యతే. 20

కార్యకారణముల హేతువు ప్రకృతియని చెప్పబడు చున్నది. సుఖదుఃఖభోగములయందు పురుషుడు హేతువన బడుచున్నాడు.

పురుషః ప్రకృతిస్థో హి భుంక్తే ప్రకృతిజాన్ గుణాన్,
కారణం గుణసంగోఽస్య సదసద్యోనిజన్మసు. 21

ప్రకృతియందుండు పురుషుడు ప్రకృతి సంభవములగు గుణములను భోగించుచున్నాడు. ఈగుణసంగమమే వానివిషయమున సదసద్యోనులయందు పుట్టుటకు కారణమగుచున్నది

వ్యాఖ్యానము:-లౌకిక భాషయందు మనము ప్రకృతిని మాయయని పిలుచుచున్నాము. పురుషుడు జీవుడై యున్నాడు. మాయకు అనగా మూలస్వభావమునకు వశుడై జీవుడు రజస్సత్వతమోగుణములవలన నగు కర్మఫల మనుభవించు చున్నాడు. మఱియు నీకారణమున కర్మానుసారము పునర్జన్మను పొందుచున్నాడు.

ఉపద్రష్టానుమంతా చ భర్తా భోక్తా మహేశ్వరః,
పరమాత్మేతిచాప్యుక్తో దేహేఽస్మిన్ పురుషః పరః. 22

ఈదేహమందుండియు నెవ్వడు పరమపురుషుడో వాడు సర్వసాక్షియనియు, అనుమంతయనియు, భర్తయనియు, భోక్తయనియు, మహేశ్వరుడనియు, పరమాత్మయనియు చెప్పబడును.

య ఏవం వేత్తి పురుషం ప్రకృతించ గుణైస్సహ,
సర్వథా వర్తమానోఽపి న సభూయోఽభిజాయతే. 23

ఏ మనుష్యుడీప్రకారము పురుషుని, గుణమయమగు ప్రకృతిని తెలిసికొనుచున్నాడో వాడు సమస్త విధముల కర్మలు చేయుచున్నవాడైనను మరల జన్మమును పొందడు.

వ్యాఖ్యానము:-2, 9, 12, మఱియు కొన్ని యధ్యాయములవలనను ఈశ్లోకము స్వేచ్ఛాచారమును సమర్థించునది కాదని మనము తెలిసికోవచ్చును. ఈశ్లోకము భక్తి యొక్క మహిమనే చూపునది. కర్మ జీవుని బంధించునది. అయినను జీవుడు కర్మలనన్నియు పరమాత్మ కర్పించినచో వాడు బంధవిముక్తుడగును. ఇవ్విధమున ఎవ్వనినుండి కర్తృత్వాహంకారము నశించిపోయినదో, ఎవ్వడంతర్యామిని 24 గంటలును లక్షించుచున్నాడో, వాడు పాపకర్మను చేయనే లేడు. అభిమానమే పాపమునకు మూలముకదా? ఎక్కడ "అహం" లేదో అక్కడ పాపము లేదు. ఇది పాపకర్మ చేయకుండుటకు యుక్తిగా నున్నది.

ధ్యానే నాత్మని పశ్యంతి కేచి దాత్మాన మాత్మనా
అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే. 24

ఒకానొకడు ధ్యానమార్గముచేత ఆత్మద్వారా ఆత్మను తనలో చూచుచున్నాడు. కొందఱు జ్ఞానమార్గముచేతను మఱికొందరు కర్మమార్గముచేతను చూచుచున్నారు.

అన్యే త్వేవ మజానంతః శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే,
తేఽపి చాతితరంత్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః. 25

మఱికొందరీ మార్గముల నెఱుగనివారగుటచే పరుల

వలన పరమాత్మనుగూర్చి వినుచు విన్నవానిపై శ్రద్ధయుంచుచు తత్పరాయణులగుచు నుపాసించుచున్నారు. వారు కూడా మృత్యువును తరించుచున్నారు.

యావత్సంజాయతే కించి త్సత్త్వం స్థావరజంగమమ్,
క్షేత్రక్షేత్రజ్ఞసంయోగా త్తద్విద్ధి భరతర్షభ. 26

ఉత్పన్నమగు చరాచర వస్తుజాలమంతయు ఓ భరతర్షభా క్షేత్రక్షేత్రజ్ఞుల అనగా ప్రకృతిపురుషుల సంయోగము వలననే కలుగుచున్నదని తెలిసికొనుము.

సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరమ్,
వినశ్య త్స్వవినశ్యంతం యః పశ్యతి స పశ్యతి. 27

నశించు సర్వప్రాణులయందును నశింపని పరమేశ్వరుడు సమముగా నున్నాడని యెఱుగువాడే వాని నెఱిగినవాడు.

సమం పశ్యన్హి సర్వత్ర సమవస్థిత మీశ్వరమ్,
నహి నస్త్యాత్మనాత్మానం తతో యాతి పరాంగతిమ్. 28

ఏమనుష్యుడీశ్వరుని సర్వత్ర సమభావమున నవస్థితుడైయున్నట్లు చూచుచున్నాడో వాడు తన్నుతాను హింసించుకొననివాడై పరమగతిని పొందుచున్నాడు.

వ్యాఖ్యానము:—సమభావముతో నవస్థితుడైయున్న నీశ్వరుని చూచువాడు తానాతనియందు లీనుడైపోవుచున్నాడు. ఇతరమేమియు చూడజాలడు. ఈకారణమున వికారము

లను జిక్కక మోక్షమును పొందుచున్నాడు. మఱియు తనకు తాను శత్రువై యుండడు.

ప్రకృత్యైవచ కర్మాణి క్రియమాణాని సర్వశః,
యః పశ్యతి తథాత్మాన మకర్తారం సపశ్యతి. 29

సర్వత్ర ప్రకృతియే కర్మలు చేయుచున్నదని తెలిసికొను చూడుటచేత నెవ్వడు ఆత్మను అకర్తయని గ్రహించుచున్నాడో వాడే తెలిసినవాడు.

వ్యాఖ్యానము:-నిద్రించు మనుష్యునియాత్మ నిద్రకు కర్తకాదు. ప్రకృతియే నిద్రయొక్క పనిచేయుచున్నది. అట్లే నిర్వికారపురుషుని నేత్రము, ఏచెడుగును చూడజాలదు. ప్రకృతి వ్యభిచారిణికాదు. అభిమానియగుపురుషు డద్దానికి స్వామియగునపుడు అతనికలయిక వలననే విషయవికారము లుదయించుచున్నవి.

యదా భూతపృథగ్భావ మేకస్థ మనుపశ్యతి,
తత ఏవచ విస్తారం బ్రహ్మసంపద్యతే తదా. 30

ప్రాణులు నానావిధ భేదములుగనున్నను ఒకదాని యందే యుండుట నెప్పుడువాడు చూచుచున్నాడో, (కావుననే) సమస్తవిస్తారము దానివలననే యగుచున్నదని యెప్పుడు తెలిసికొనుచున్నాడో అప్పుడువాడు బ్రహ్మమును పొందుచున్నాడు.

వ్యాఖ్యానము:-అనుభవమువలన సర్వమును బ్రహ్మమందే చూచుట బ్రహ్మప్రాప్తియై యున్నది. అపుడు జీవుడు

వ్రునినుండి భిన్నముగా నుండదు.

అనాదిత్వా న్నిర్గుణత్వా త్పరమాత్మాయ మవ్యయః,
శరీరస్థోఽపి కౌంతేయ న కరోతి నలిప్యతే. 32

కౌంతేయా, ఈనాశములేనట్టి పరమాత్మ, అనాదియు నిర్గుణుడు నగుటచే దేహమందున్నను, ఏమియు చేయదు. దేనిచేతను లిప్తుడైయుండడు.

యథా సర్వగతం సౌక్ష్మ్యా దాకాశం నోపలిప్యతే,
సర్వత్రావస్థితో దేహే తథాత్మా నోపలిప్యతే. 32

సూక్ష్మమగుటవలన ఆకాశమెట్లు సర్వగతమై యుండియు నలిప్తమైయున్నదో అట్లే అన్నిదేహములయందుండు నాత్మయు నలిప్తమైయున్నది.

యథాప్రకాశయత్యేకః కృత్స్నం లోక మిమం రవిః
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత 33

భారతా, ఒక్కసూర్యుడే సకలజగత్తును ప్రకాశింపజేయునట్లు క్షేత్రి సమస్త క్షేత్రమును ప్రకాశింపజేయుచున్నాడు.

క్షేత్రక్షేత్రజ్ఞయో రేవ మంతరం జ్ఞానచక్షుషా,
భూతప్రకృతి మోక్షంచ యేవిదుర్యాంతి తే పరమ్. 34

జ్ఞాననేత్రములచే నెవడు క్షేత్రక్షేత్రజ్ఞుల భేదమును, ప్రాణులు ప్రకృతి బంధనమునుండి విముక్తి పొందు విధమును, తెలిసికొనుచున్నాడో వాడు బ్రహ్మమును పొందుచున్నాడు.

ఓమ్, తత్సత్.

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగో నామ త్రయోదశోఽధ్యాయః.

ఈ ప్రకారము శ్రీమద్భగవద్గీతా-ఉపనిషత్ అనగా బ్రహ్మవిద్యాంతర్గత యోగశాస్త్రమందలి శ్రీకృష్ణార్జున సంవాదమందు క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగమను పేరుగల పదమూడవ యధ్యాయము ముగిసినది.

# గుణత్రయ విభాగ యోగము.

## చతుర్దశాధ్యాయము.



గుణాత్మికయగు ప్రకృతినిగూర్చి తెల్పినపిమ్మట యీ అధ్యాయమందు మూడుగుణములనుగూర్చి తెల్పుచున్నాడు. గుణములనుగూర్చి తెలుపుచు భగవంతుడు గుణాతీతుని లక్షణములను లెక్కించును. రెండవయధ్యాయమందేలక్షణములు స్థితప్రజ్ఞునివిగా కానిపించుచున్నవో, పండ్రెండవ యధ్యాయమందే లక్షణములు భక్తునివిగా నగపడుచున్నవో యవి యీ యధ్యాయమందు గుణాతీతుని లక్షణములుగా నున్నవి.

శ్రీభగవానువాచ:—

పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞాన ముత్తమమ్,
యద్ జ్ఞాత్వా మునయ స్సర్వే పరాంసిద్ధి మితోగతాః. 1

శ్రీభగవానుడు చెప్పుచున్నాడు:-జ్ఞానములలోనికెల్ల నుత్తమమగు నేజ్ఞానమునుపొంది మునులందరీ దేహమును విడిచి పరమగతిని చెందిరో దానిని నేనునీకు మరలచెప్పెదను.

ఇదం జ్ఞాన ముపాశ్రిత్య మమ సాధర్మ్య మాగతాః,
సర్గేఽపి నోపజాయంతే ప్రళయే నవ్యథంతిచ. 2

ఈజ్ఞానము నాశ్రయించి యెవ్వరు నాస్వభావమును పొందియున్నారో వారు సృష్టికాలమందు పుట్టవలసి యుండదు ప్రళయకాలమందు వ్యథపొందరు.

మమయోనిర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహమ్
సంభవ స్సర్వభూతానాం తతో భవతి భారత. 3

భారతా, మహత్ బ్రహ్మ అనగా ప్రకృతి, నాయోని. అందే నేను గర్భముంచుచున్నాను. దానివలన ప్రాణులన్నియు పుట్టుచున్నవి.

సర్వయోనిషు కౌంతేయ, మూర్తయః సంభవంతి యాః,
తాసాం బ్రహ్మ మహ ద్యోని రహం బీజప్రదః పితా. 4

కౌంతేయా, సమస్త యోనులయందే యేప్రాణులు పుట్టుచున్నవో వారియుత్పత్తిస్థానము నాప్రకృతియై యున్నది మఱియు నందు బీజారోపణ మొనరించు తండ్రిని-పురుషుడను నేనైయున్నాను.

సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతిసంభవాః,
నిబధ్నంతి మహాబాహో దేహే దేహిన మవ్యయమ్. 5

మహాబాహూ, సత్వరజస్తమములు ప్రకృతిచేకలుగు గుణములు. నాశరహితుడైన దేహధారిని-జీవుని, దేహముతో నవి బాధించుచున్నవి.

తత్ర సత్త్వం నిర్మలత్వా త్ప్రకాశక మనామయమ్,
సుఖసంగేన బధ్నాతి జ్ఞానసంగేన చానఘ. 6

వీనిలో సత్వము నిర్మలమైనదగుటచే, ప్రకాశకమును ఆరోగ్యకరమునై యున్నది. మఱియు నోయనఘా, అది దేహిని జ్ఞానసుఖములతో బంధించుచున్నది.

రజో రాగాత్మకం విద్ధి తృష్ణాసంగసముద్భవమ్,
తన్నిబధ్నాతి కౌంతేయ! కర్మసంగేన దేహినమ్. 7

కౌంతేయా, రజోగుణము రాగాత్మకమగుటచే తృష్ణకును, ఆసక్తిని మూలమైయున్నది. అది దేహధారిని కర్మపాశముచే బంధించుచున్నది.

తమ స్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్,
ప్రమాదాలస్య నిద్రాభి స్తన్నిబధ్నాతి భారత. 8

భారతా, తమోగుణము అజ్ఞానమూలకము. ఇది సకల దేహులను మోహమున బడవేయుచున్నది. మఱియు నది జీవులను ప్రమాదము, ఆలస్యము, నిద్ర మున్నగు పాశములచే గట్టివైచుచున్నది.

సత్త్వం సుఖే సంజయతి రజః కర్మణి భారత!
జ్ఞాన మావృత్య తు తమః ప్రమాదే సంజయత్యుత. 9

భారతా, సత్వము ఆత్మను శాంతిసుఖములతో చేర్చుచున్నది. రాజసము కర్మలతోను, తామసము జానమునుకప్పి ప్రమాదముతోను చేర్చుచున్నది.

రజ స్తమ శ్చాభిభూయ సత్త్వం భవతి భారత!,
రజస్సత్త్వం తమశ్చైవ తమ స్సత్త్వం రజస్తథా. 10

భారతా, రజోగుణతమోగుణము లడగునపుడు రజోగుణము పైకివచ్చుచున్నది. సత్వగుణ రజోగుణము లడగునపుడు తమోగుణము పైకివచ్చుచున్నది.

సర్వద్వారేషు దేహేఽస్మిన్ ప్రకాశ ఉపజాయతే,
జ్ఞానం యదా తదా విద్యా ద్వివృద్ధం సత్త్వమిత్యుత. 11

లోభః ప్రవృత్తి రారంభః కర్మణా మశమః స్పృహా,
రజ స్యేతాని జాయంతే వివృద్ధే భరతర్షభ! 12

భరతర్షభా, రజోగుణము వృద్ధిపొందునపుడు, లోభము ప్రవృత్తి, కర్మారంభము, అశాంతి, ఇచ్ఛ పుట్టుచున్నవి.

అప్రకాశోఽప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవ చ,
తమ స్యేతాని జాయంతే వివృద్ధే కురునందన! 13

కురునందనా, తమోగుణము వృద్ధియగునపుడు అజ్ఞానము, మాంద్యము, ప్రమాదము, మోహము కలుగుచున్నవి.

యదా సత్త్వే ప్రవృద్ధేతు ప్రళయం యాతి దేహభృత్,
తదోత్తమవిదాం లోకా నమలాన్ ప్రతిపద్యతే, 14

తనయందు సత్త్వగుణము వృద్ధిపొందియున్న సమయమున దేహధారి మరణించినచో వాడుత్తమజ్ఞానుల నిర్మల లోకము పొందుచున్నాడు.

రజసి ప్రళయం గత్వా కర్మసంగిషు జాయతే,
తథా ప్రలీనస్తమసి మూఢయోనిషు జాయతే. 15

రజోగుణాభి వృద్ధియందు మరణించినచో దేహధారి కర్మసంగుల లోకమందు జన్మించుచున్నాడు. మఱియు తమోగుణాభివృద్ధియందు మరణించువాడు మూఢయోని యందు జన్మించుచున్నాడు.

వ్యాఖ్యానము:- కర్మసంగుల లోకమనగా మనుష్య లోకము. మూఢయోని యనగా పశువులు మొదలగు వాని లోకము.

కర్మణ స్సుకృతస్యాహుః సాత్త్వికం నిర్మలం ఫలమ్,
రజసస్తు ఫలం దుఃఖ మజ్ఞానం తమసః ఫలమ్. 16

సత్కర్మముయొక్క ఫలము సాత్త్వికము నిర్మలమునై యుండును. రాజసకర్మఫలము దుఃఖము. తామస కర్మఫలము అజ్ఞానము.

వ్యాఖ్యానము:- దేనిని మనము సుఖదుఃఖములుగా భావించుచున్నామో ఆసుఖదుఃఖములచర్చ యిచ్చట కలదని తలచరాదు. సుఖమనగా ఆత్మానందము. ఆత్మప్రకాశము. దీనికి ప్రతికూలమైనది దుఃఖము. 17 వ శ్లోకము నందు స్పష్టమగును.

సత్త్వా త్సంజాయతే జ్ఞానం రజసో లోభఏవచ,
ప్రమాదమోహౌ తమసో భవతోఽజ్ఞానమేవచ. 17

సత్వగుణమువలన జ్ఞానము పుట్టుచున్నది. రజోగుణము వలన లోభమును, తమోగుణము వలన ప్రమాదము మోహము, అజ్ఞానమును పుట్టుచున్నవి.

ఊర్ధ్వం గచ్ఛంతి సత్త్వస్థా మధ్యే తిష్ఠంతి రాజసాః,
జఘన్యగుణవృత్తిస్థా అధో గచ్ఛంతి తామసాః. 18

సాత్త్వక పురుషులూర్ధ్వమునకు పోవుచున్నారు. రాజసులు మధ్యనుండుచున్నారు. నీచగుణయుక్తులగు తామసులధోగతిని పొందుచున్నారు.

నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టానుపశ్యతి,
గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి. 19

జ్ఞాని, ఎప్పుడు, గుణములకంటె కర్త అన్యుడు లేడని చూచుచున్నాడో, మఱియు గుణములకంటె పరమగు దానిని తెలిసి కొనుచున్నాడో అప్పుడు నాభావమును పొందుచున్నాడు.

వ్యాఖ్యానము:- గుణములను కర్తగాభావించు వానికి అహంకారముండనే యుండదు. ఇందువలన వాని సమస్త కార్యములు స్వాభావికములును శరీర యాత్రకు మాత్రమే చేయునదియు నైయుండును. దేహయాత్ర పరమార్థము కొఱకే యైయుండుటచే దానిస్వకార్యముల యందును నిరంతరత్యాగము నిరంతర వైరాగ్యము ఉండవలెను. ఇట్టిజ్ఞాని స్వభావముగా గుణాతీతుడై నిర్గుణేశ్వరుని భావించుకొని భజించుచున్నాడు.

గుణానేతా నతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్,
జన్మమృత్యుజరాదుఃఖై ర్విముక్తోఽమృత మశ్నుతే. 20

దేహసంగమువలనపుట్టు నీత్రిగుణములను దాటి దేహి జన్మమృత్యు జరాదుఃఖములనుండి ముక్తుడై మోక్షముపొందుచున్నాడు.

అర్జున ఉవాచ:—

కైర్లింగై స్త్రీన్ గుణానేతా నతీతో భవతి ప్రభో!
కిమాచారః కథంచైతాం స్త్రీన్ గుణా నతివర్తతే. 21

అర్జునుడు చెప్పుచున్నాడు:-ప్రభో, ఈగుణములను మీఱినవానిని ఏలక్షణములవలన పోల్చుకొనవచ్చును? వాని

యాచారము లెట్టివి? వాఁడీ మూఁడుగుణముల నెట్లతిక్రమించు చున్నాఁడు?

శ్రీభగవానువాచ:—

ప్రకాశంచ ప్రవృత్తించ మోహమేవచ పాండవ,
నద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాంక్షతి. 22

ఉదాసీనవదాసీనో గుణైర్యో న విచాల్యతే,
గుణా వర్తంత ఇత్యేవ యోఽవతిష్ఠతి నేంగతే. 23

సమదుఃఖసుఖస్స్వస్థ స్సమలోష్టాశ్మ కాంచనః
తుల్యప్రియాప్రియోధీరస్తుల్యనిందాత్మ సంస్తుతిః. 24

మానావమానయో స్తుల్య స్తుల్యో మిత్రారిపక్షయోః,
సర్వారంభపరిత్యాగీ గుణాతీత స్స ఉచ్యతే. 25

భగవానుఁడు చెప్పుచున్నాఁడు:-పాండవా, ఎవఁడు ప్రకాశము, ప్రవృత్తి, మోహము ప్రాప్తించినపుడు, దుఃఖింపఁడో ప్రాప్తించనపుడు వానిని కోరఁడో, ఉదాసీనునివలె నెవఁడు స్థిరుఁడైయున్నాఁడో, ఎవనిని గుణములు చలింపఁజేయవో, గుణములే తమకార్యములను చేయుచున్నవని యెవఁడు స్థిరుఁడైయుండి చలింపఁడో, ఎవఁడు సుఖదుఃఖములయందు సమత్వము కలిగియుండునో, ఎవఁడు స్వస్థుఁడైయుండునో మట్టిపెళ్లను, రాతిని, బంగారమును ఎవఁడు సమముగ చూచునో, ఎవఁడు ప్రియాప్రియములయందు సమముగనుండునో, ఏబుద్ధిమంతునకు నిందాస్తుతులు సమానముగ నుండునో, ఎవనికి మానావమానములు సమానముగానుండునో, మిత్రశత్రు

పక్షముల యందెవ్వడు సమభావము కలిగియుండునో, ఎవడు సమస్తారంభములను త్యజించునో, అట్టివాడు గుణాతీతుడని చెప్పబడు చున్నాడు.

వ్యాఖ్యానము:-22 నుండి 25 వరకుగల యీనాలుగు శ్లోకము లొక్కసారిగ విచారింపదగియున్నవి. వెనుకటి శ్లోకమందు చెప్పిన ప్రకాశము ప్రవృత్తి మోహము, అనునవి క్రమముగా సత్వరజస్తమోగుణముల పరిణామములు లేక చిహ్నములైయున్నవి. గుణములను అతిక్రమించినవానిపై ఈపరిణామములయొక్క యెట్టిప్రభావమును పడజాలదనుటయే యిట్లు చెప్పుటలోగల భావము. రాయి ప్రకాశమును గోరదు. ప్రవృత్తినిగాని జడత్వమునుగాని ద్వేషింపదు. దానికి కోరనక్కర లేకుండగనే శాంతిగలదు. ఎవడేని దానిని కదలించినను అది వానిని ద్వేషింపదు. కదలించినవెనుక దానినాపియుంచినయెడల దానిప్రవృత్తి అనగా గతినిలిచిపోయినది. మోహము, జడత్వము సంప్రాప్తించినది" అనితలచి దుఃఖింపదు. అనగా అది మూడవస్థలయందు నొకేరీతిగ వర్తించుచున్నది. రాతికిని గుణాతీతునకునుగల భేదమేమనగా గుణాతీతుడు సచేతనుడు. వాడు జ్ఞానపూర్వకముగా గుణపరిణామస్పర్శను త్యజించి జడమగు రాయివలె నయిపోయినాడు. గుణములకు అనగా ప్రకృతికార్యములకు, రాయి సాక్షిగనున్నది. కాని కర్త కాదు. అట్లేజ్ఞాని ఆకర్మలకు సాక్షియైయుండును. కర్త గానుండడు. 23 వ శ్లోకమున చెప్పినరీతిగా

గుణములు తమపనులు చేయుచున్నవి, అనువిషయమును భావించుచు చలింపడు. అచలుడైయుండును. ఉదాసీనునివలె నుండును. గుణములయందు తన్మయులమైయున్న మనమీస్థితినిగూర్చి ధైర్యపూర్వకముగా కేవలమూహించి తెలియగలుగుచున్నాము. గాని యనుభవింపజాలము. అయినను ఆయూహలు లక్ష్యమందుంచుకొని మనమహంభావము అనుదినము తగ్గించుకొని వచ్చినచో తుదకు గుణాతీతుని యవస్థకు చేరువగాపోయి దానిని తొంగిచూడవచ్చును. గుణాతీతుడు తనస్థితి ననుభవించుచున్నాడు. వర్ణింపజాలడు. వర్ణింపగలవాడు గుణాతీతుడుకాడు. ఏలననగా వానియందు అహంభావముకలదు. శాంతి, ప్రకాశము, ఉపద్రవము-ప్రవృత్తి, జడత్వము మోహము, ఇవి అందరును సులభముగా అనుభవింపగలరు. గీతయందనేకస్థానములయందిది స్పష్టముచేయబడినది. సాత్వికము గుణాతీతుని మిక్కిలి చేరువగల యవస్థకాబట్టి సత్వగుణమును వికసింపచేయుటకై మానవుడు ప్రయత్నింపవలయును. వానికి గుణాతీతావస్థ తప్పక ప్రాప్తించుననియే విశ్వసింపవలయును.

మాంచ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే,
సగుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే. 26

ఏకనిష్ఠతోకూడిన భక్తియోగముద్వారా ఎవడునన్ను సేవించుచున్నాడో, వాడీగుణముల నతిక్రమించి బ్రహ్మస్వరూపుడగుట కర్హుడగుచున్నాడు.

బ్రహ్మణోహి ప్రతిష్ఠాఽహ మమృతస్యావ్యయస్యచ,
శాశ్వతస్య చ ధర్మస్య సుఖస్యైకాంతికస్య చ. 27

మఱియు బ్రహ్మముయొక్క స్థితి నేనే. శాశ్వతమోక్ష స్థితి నేను. అట్లే సనాతనధర్మముయొక్కయు ఉత్తమసుఖము యొక్కయు స్థితిసైతము నేనేయైయున్నాను.

ఓమ్, తత్సత్.

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగ
శాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే గుణత్రయ విభాగ యోగో నామ
చతుర్దశోఽధ్యాయః.

ఈప్రకారము శ్రీమద్భగవద్గీతా-ఉపనిషత్ అనగా బ్రహ్మవిద్యాంతర్గత యోగశాస్త్రమందలి శ్రీకృష్ణార్జున సంవాదమందు గుణత్రయ విభాగ యోగమను పేరుగల. పదునాల్గవ యధ్యాయము ముగిసినది.

———

# పురుషోత్తమ యోగము.

## పంచదశాధ్యాయము.



ఈయధ్యాయమున భగవానుడు క్షరాక్షరములకు పరమైన తనయుత్తమ స్వరూపమును బోధించియున్నాడు.

శ్రీభగవానువాచ:—

ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహు రవ్యయమ్,
ఛందాంసి యస్య పర్ణాని యస్తం వేద సవేదవిత్. 1

శ్రీభగవానుడు చెప్పుచున్నాడు:-దేనిమూలమూర్ధ్వ ముఖమైయున్నదో, దేనిశాఖలధోముఖములైయున్నవో, వేదములు దేనియాకులయియున్నవో, అట్టినాశములేని యశ్వత్థ వృక్షమునుగూర్చి బుద్ధిమంతులు వర్ణించియున్నారు. దానిని తెలిసికొనినవారు వేదము లెఱిగినవారు.

వ్యాఖ్యానము:-"శ్వః" రేపు. "అశ్వత్థ" మనగా రేపటివరకుండని క్షణికప్రపంచము. ప్రతిక్షణమందు ప్రపంచము రూపాంతరము పొందుచునేయున్నది. కనుక అశ్వత్థమని పలికిరి. కాని సదాయిట్టిస్థితియందుండునదియైనను దానిమూలము ఊర్ధ్వము అనగా ఈశ్వరుడైయున్నాడు. కావున అది యవినాశియైయున్నది. వేదములు అనగా ధర్మముయొక్క-శుద్ధజ్ఞానరూపకమగు ఆకులుదానికుండనిచో అదిరాణించదు.

ఇట్లైనదానికి యదార్థమైన ప్రపంచజ్ఞానము కలదో ఎవడు ధర్మ మును తెలియుచున్నాడో వాడుజ్ఞాని.

అధశ్చోర్ధ్వం ప్రసృతాస్తస్య శాఖా గుణప్రవృద్ధా విషయప్రవాలాః
అధశ్చమూలా న్యనుసంతతాని కర్మానుబంధీని మనుష్యలోకే. 2

గుణస్పర్శచే వృద్ధిపొందినదియు, విషయములను చిగురుటాకులుగలదియునగు నాయశ్వత్థ వృక్షముయొక్క శాఖలు క్రిందికి పైకి వ్యాపించియున్నవి. కర్మలను బంధించునట్టి దానిమూలములు, మనుష్యలోకమందు క్రిందను వ్యాపించి యున్నవి.

వ్యాఖ్యానము:- ఈసంసారవృక్షవర్ణన అజ్ఞానదృష్టిగల వానిది. వాడు దాని యూర్ధ్వమందలి యీశ్వరునియందుగల మూలమును జూడడు. కాని విషయరామణీయకమునందు ముగ్ధుడై త్రిగుణములద్వారా యీవృక్షమును పోషించుచు, మనుష్యలోకమున కర్మపాశబద్ధుడై యుండును.

నరూప మస్యేహ తథోపలభ్యతే నాంతో నచాది ర్నచ సంప్రతిష్ఠా,
అశ్వత్థ మేనం సువిరూఢమూల మసంగశస్త్రేణ దృఢేన ఛిత్త్వా. 3
తతః పదం తత్పరిమార్గితవ్యం యస్మిన్ గతా న నివర్తంతి భూయః,
తమేవ చాద్యం పురుషం ప్రపద్యే యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ. 4

దానియదార్థ స్వరూపము కనబడదు. దానికంతము లేదు. ఆది లేదు. ఆధారము లేదు. మిగులలోతుగా బారిన వేళ్లుగల యీయశ్వత్థవృక్షమును, అసంగమనెడి దృఢమగు ఖడ్గముతో ఛేదించి మనుష్యుడు "ఎవడు సనాతన ప్రవృత్తిని-

మాయను వ్యాపింపజేసెనో ఆయాదిపురుషుని శరణుజొచ్చు చున్నాను" అని ప్రార్థించుచు, దేనిని పొందినవాడు జననమ రణ చక్రమున మరల పడవలసి యుండదో అట్టిపదమును గూర్చి వెదుకవలయును.

వ్యాఖ్యానము:-అసంగమనగా అసహాయోగము లేక వైరాగ్యము. మనుష్యు డెంతవరకు విషయములతో నసహా యోగ మొనరింపడో వానిప్రలోభములనుండి దూరముగా నుండడో అంతవఱకు వాడావిషయములయందు చిక్కుకొని యుండును. విషయములతో క్రీడించుచుండుటయు, వాని కంట కుండుటయు పొసగ నేరదనుట ఈశ్లోకాభిప్రాయము.

నిర్మానమోహా జితసంగదోషా అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః,
ద్వంద్వైర్విముక్తా స్సుఖదుఃఖసంజ్ఞై ర్గచ్ఛంత్యమూఢాః పదమవ్యయంతత్.

ఎవ్వడు మానమోహములను విడిచిపెట్టియున్నాడో, ఎవ్వడాసక్తిచే గలుగుదోషములను తొలగించుకొనెనో, ఎవ్వ డాత్మయందు నిత్యనిమగ్నుడైయున్నాడో, ఎవ్వనివిషయము లు శమించియున్నవో, ఎవ్వడు సుఖదుఃఖాది ద్వంద్వముల నుండి ముక్తుడైయున్నాడో అట్టిజ్ఞాని నాశములేని పదమును పొందుచున్నాడు.

నతద్భాసయతే సూర్యో నశశాంకో నపావకః,
యద్గత్వా ననివర్తంతే తద్ధామ పరమం మమ. 6

ఎచ్చటికిపోయిన వారికి పునర్జన్మ కలుగదో, యది నాపరమధామము. అచ్చట సూర్యచంద్రాదులును అగ్నియు ప్రకాశింపజేయ పనిలేదు.

మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః
మనష్షష్ఠానీంద్రియాణి ప్రకృతిస్థానికర్షతి. 7

సనాతనమగు నాయంశమే జీవలోకమందు జీవుడై ప్రకృతియందుండు పంచేంద్రియములను మనస్సు నాకర్షించుచున్నది.

శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః,
గృహీత్వైతాని సంయాతి వాయుర్గంధానివాశయాత్. 8

(జీవుడైయున్న యీనాయంశరూపముగు) ఈశ్వరుడు శరీరము ధరించినపుడుగాని విడిచినపుడుగాని వాయువు చుట్టు ప్రక్క స్థలములనుండి వాసనలను తనలో కొనిపోవునట్లు (మనస్సుతో ఇంద్రియములను) తీసికొని పోవుచున్నాడు.

శ్రోత్రం చక్షుః స్పర్శనం చ రసనం ఘ్రాణమేవ చ,
అధిష్ఠాయ మన శ్చాయం విషయా నుపసేవతే. 9

మఱియు నీజీవుడు చెవులు, కన్నులు, చర్మము, నాలుక, ముక్కులు మనస్సు అనువాని నాశ్రయమును పొంది విషయములు భోగించుచున్నాడు.

వ్యాఖ్యానము:-ఇచట విషయములనగా బీభత్సవిలాసములు కావు. కన్నులుచూచుట, చెవులువినుట, నాలుక రుచి చూచుట. మొదలగు నింద్రియస్వాభావిక క్రియలనియే యర్థము. ఈక్రియలు వికారయుక్తములు, అహంకారయుక్తములయ్యేనేని కలుషితములుగను భయంకరములుగను ఉండును. పసిబాలుడు నేత్రములతో చూచుచుండియు హస్తములతో

స్పృశించుచుండియు వికారమును పొందడు. ఇందుచేతనే యీ క్రింది శ్లోకమున నిట్లు చెప్పుచున్నాడు.

ఉత్క్రామంతం స్థితం వాపి భుంజానంవా గుణాన్వితమ్,
విమూఢా నానుపశ్యంతి పశ్యంతి జ్ఞానచక్షుషః. 10

(శరీరమును) విడుచువానిని, లేక యందుండువానిని, లేక గుణాశ్రియుక్తుడై విషయముల భోగించువానిని (ఈ అంశరూపుడగు నీశ్వరుని) మూఢులుచూడరు కాని దివ్యనేత్రములుగల జ్ఞానులు చూచుచున్నారు.

యతంతో యోగినశ్చైనం పశ్యంత్యాత్మన్యవస్థితమ్.
యతంతోఽప్యకృతాత్మానో నైనం పశ్యంత్యచేతసః. 11

ప్రయత్నముచేయు యోగులు తమలోనున్నవానిని (ఈశ్వరుని) చూచుచున్నారు. ఆత్మశుద్ధిలేని యకృతాత్మలు యత్నముచేయుచుండియు నీశ్వరుని తెలిసికొనజాలరు.

వ్యాఖ్యానము:-దీనికిని తొమ్మిదవ యధ్యాయమున భగవానుడు దురాచారులనుగూర్చి నుడివిన వాక్యములకును విరోధమేమియు లేదు. అకృతాత్ములనగా భక్తిహీనులు. స్వేచ్ఛాచారులు దురాచారులని భావము. వినయముతోను, శ్రద్ధతోను, ఈశ్వరుని భజించువాడాత్మశుద్ధిగలవాడై యీశ్వరుని తెలిసికొనుచున్నాడు. యమ నియ మాదులను లక్ష్యపెట్టక కేవలబుద్ధి ప్రయోగముచే తెలిసికొనదలచు నజ్ఞాని-చిత్త రహితుడు, రామరహితరాముని తెలిసికొనజాలడు.

యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలమ్,
యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్. 12

సకలప్రపంచమును ప్రకాశింపజేయుచున్న సూర్యుని యందలి తేజస్సు, మఱియు చంద్రునియందు అగ్నియందు నున్నట్టి తేజస్సు నా తేజస్సనియే తెలిసికొమ్ము.

గామావిశ్య చ భూతాని ధారయామ్యహమోజసా,
పుష్ణామి చౌషధీస్సర్వాః సోమో భూత్వా రసాత్మకః. 13

పృథ్వియందు ప్రవేశించి స్వశక్తిచేతనే నేనే ప్రాణులను ధరించుచున్నాను. రసోత్పత్తి చేయు చంద్రుఁడనై సమస్త వనస్పతులను పోషించుచున్నాను.

అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః,
ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్. 14

ప్రాణులదేహముల నాశ్రయించి జఠరాగ్నినై ప్రాణాపానవాయువులవలన నాలుగువిధములగు నన్నమును నేను పచనము చేయుచున్నాను.

సర్వస్య చాహం హృది సన్నివిష్టో మత్తః స్మృతిర్జ్ఞానమపోహనం చ
వేదైశ్చ సర్వైరహమేవ వేద్యో వేదాంతకృద్వేదవిదేవ చాహమ్ 15

సకలప్రాణుల హృదయమందధిష్ఠించియున్న నావలన స్మృతి జ్ఞానములున్ను, వాని యభావమున్ను కలుగుచున్నవి. సకలవేదముల చేతనే నే తెలియదగినవాఁడను. వేదములు తెలిసినవాఁడను నేనే. వేదాంతము ప్రకటించువాఁడను నేనే.

ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవచ,
క్షరస్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే. 16

ఈలోకమందు క్షరాక్షరములనెడి (నాశి అవినాశి యనెడి) యిద్దరు పురుషులున్నారు. ప్రాణులన్నియుక్షరుడు. వానియందున్న అంతర్యామిని అక్షరుడందురు.

ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః,
యో లోకత్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః. 17

వీరిద్దరుగాక మరియొక యుత్తమపురుషుడున్నాడు. వానిని పరమాత్మయందురు. ఈయవ్యయుడగు నీశ్వరుడు మూడులోకములందును ప్రవేశించి వానినిపోషించుచున్నాడు

యస్మాత్క్షర మతీతోఽహ మక్షరాదపి చోత్తమః
అతోఽస్మి లోకే వేదేచ ప్రథితః పురుషోత్తమః. 18

ఎందుకనగా, నేనుక్షరునకు బరుడనై యక్షరునికంటె నుత్తముడనగుటచేత వేదములయందును, లోకముల యందును పురుషోత్తముడనుపేర ప్రసిద్ధుడనై యున్నాను.

యో మా మేవ మసమ్మూఢో జానాతి పురుషోత్తమమ్,
స సర్వవి ద్భజతి మాం సర్వభావేన భారత! 19

భారతా, ఎవడు మోహరహితుడై పురుషోత్తముడ నగునన్ను ఈవిధమున దెలిసికొనుచున్నాడో వాడు సమస్తము తెలిసినవాడై పూర్ణభావముతో నన్ను భజించుచున్నాడు

ఇతి గుహ్యతమం శాస్త్ర మిద ముక్తం మయానఘ,
ఏతద్బుద్ధ్వా బుద్ధిమాన్ స్యాత్కృతకృత్యశ్చ భారత. 20

అనఘా, అతిరహస్యమగు నీశాస్త్రమును నీకు జెప్పితిని. భారతా, దీని నెఱిగి మనుష్యుడు బుద్ధిమంతుడై తనజీవితమును సఫలమొనరించుకొనదగును.

ఓమ్, తత్సత్.

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగ
శాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే పురుషోత్తమ యోగో నామ
పంచదశోఽధ్యాయః.

ఈప్రకారము శ్రీమద్భగవద్గీతా-ఉపనిషత్ అనగా బ్రహ్మవిద్యాంతర్గత యోగశాస్త్రమందలి శ్రీకృష్ణార్జున సంవాదమందు పురుషోత్తమ యోగమను పేరుగల పదునైదవ యధ్యాయము ముగిసినది.



# దైవాసుర సంపద్విభాగ యోగము.

## షోడశాధ్యాయము.



ఈయధ్యాయమందు దైవీసంపదయొక్కయు ఆసురీ సంపదయొక్కయు వర్ణనకలదు.

శ్రీభగవానువాచ:—

అభయం సత్త్వసంశుద్ధి ర్జ్ఞానయోగవ్యవస్థితిః,
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయ స్తపఆర్జవమ్. 1
అహింసా సత్య మక్రోధ స్త్యాగ శ్శాంతిర పైశునమ్,
దయాభూతేష్వలోలుప్త్వం మార్దవం హ్రీరచాపలమ్. 2
తేజః క్షమాధృతిః శౌచ మద్రోహో నాతిమానితా,
భవంతి సంపదం దైవీ మభిజాతస్య భారత. 3

శ్రీభగవానుడు చెప్పుచున్నాడు:- భారతా, అభయము, అంతఃకరణశుద్ధి జ్ఞానమునందు యోగమునందు నిష్ఠ, దానము, దమము, యజ్ఞము, స్వాధ్యాయము, తపస్సు, సరళత్వము, అహింస, సత్యము, అక్రోధము, త్యాగము, శాంతి, అపైశునము, భూతదయ, అలోలత్వము, మృదుత్వము, మర్యాద, అచంచలత్వము, తేజము, క్షమ, ధృతి, శౌచము, అద్రోహము, నిరభిమానము అనునీగుణములు దైవసంపదతో బుట్టినవాని యందుండును.

వ్యాఖ్యానము:-దమమనగా, ఇంద్రియనిగ్రహము. అపైశునమనగా ఇతరులను దూషింపకుండుట. అలోలత్వమనగా లాలసత్వము-లంపటము-లేకుండుట. తేజమనగా ప్రతినిషేధముగు నీచవిషయములను బహిష్కరించు నావేశము. అద్రోహమనగా నెవ్వరికిని కీడుతలపకుండుట చేయకుండుట;

దంభో దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్యమేవ చ,
అజ్ఞానం చాభిజాతస్య పార్థ! సంపద మాసురీమ్. 4

పార్థా, దంభము, దర్పము, అభిమానము క్రోధము, పారుష్యము, అజ్ఞానము, అనునివి అసురసంపత్తితోపుట్టిన వానియందుండును.

వ్యాఖ్యానము:-తనలో లేనివాని నగపఱచుట దంభము-మోసము. దర్పమనగా తనకున్న స్వల్పము నెంతో పెద్దదిగా జేసి చెప్పుట. పారుష్యమనగా కఠినత్వము.

దైవీసంపద్విమోక్షాయ నిబంధాయాసురీ మతా,
మాశుచః సంపదం దైవీ మభిజాతోఽసి పాండవ! 5

దైవీసంపద మోక్షమునిచ్చునదియు, నాసురీసంపద బంధమున ద్రోయునదియు నని నిశ్చయింపబడియున్నది. పాండవా, దుఃఖింపకుము. నీవు దైవసంపదతో పుట్టియున్నావు.

ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్ దైవ ఆసుర ఏవ చ,
దైవో విస్తరశః ప్రోక్త ఆసురం పార్థ మే శృణు. 6

పార్థా, దైవమనియు నాసురమనియు రెండువిధములగు సృష్టులు లోకమందున్నవి. దైవసృష్టినిగూర్చి విస్తరించి

చెప్పియుంటిని. ఆసురమునుగూర్చి యిపుడు వినుము.

ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదురాసురాః,
న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే. 7

ప్రవృత్తియన నేమియో నివృత్తియన నేమియో యాసురులకు దెలియదు. ఇట్టిశౌచము, ఆచారము, సత్యము అనువాని దృష్టియు లేదు.

అసత్య మప్రతిష్ఠం తే జగదాహు రనీశ్వరమ్,
అపరస్పరసంభూతం కిమన్య త్కామహైతుకమ్. 8

వారు జగత్తు మిథ్యయనియు, నిరాధారమనియు, నీశ్వరరహితమనియు, కేవల స్త్రీపురుష సంబంధముచే కలిగిన దనియు, దానికి విషయభోగముతప్ప మఱొకకారణ ముండదనియు బల్కుచున్నారు.

ఏతాం దృష్టి మవష్టభ్య నష్టాత్మానో౽ల్పబుద్ధయః,
ప్రభవం త్యుగ్రకర్మాణః క్షయాయ జగతో౽హితాః. 9

భయంకర కార్యములు చేయువారును, మందమతులును, దుష్టులును ఈమతమవలంబించి, జగత్తునకు శత్రువులై తన్నాశనార్థము పుట్టుచున్నారు.

కామ మాశ్రిత్య దుష్పూరం దంభమానమదాన్వితాః,
మోహాద్గృహీత్వాసద్గ్రాహా న్ప్రవర్తంతే౽శుచివ్రతాః 10

తృప్తిపఱచ నశక్యములగు కామములచే నిండినవారును, దంభముగలవారును, అభిమానముగలవారును, మదాంధులును, అశుభ వ్రతులును, మోహముచే దుష్టవాం

ఫల నవలంబించి ప్రవర్తించుచుందురు.

> చింతామపరిమేయాంచ ప్రళయాంతాముపాశ్రితాః,
> కామోపభోగపరమా ఏతావదితి నిశ్చితాః. 11
>
> ఆశాపాశశతైర్బద్ధాః కామక్రోధపరాయణాః,
> ఈహంతే కామభోగార్థమన్యాయేనార్థసంచయాన్. 12

ప్రళయకాల పర్యంతము నాశమే పొందని యట్టి అపరిమితచింతను ఆశ్రయించినవారు కామోపభోగమే ఉత్కృష్టముగా గలవారు, భోగమే సర్వస్వమని నిశ్చయించుకొన్నవారు, వందలకొలది ఆశాపాశములచేత కట్టబడినవారు, నగు కామక్రోధ పరాయణులు విషయభోగార్థ మన్యాయపూర్వకముగా ధనసంచయము చేయగోరుచున్నారు.

> ఇదమద్య మయాలబ్ధమిమంప్రాప్స్యే మనోరథమ్,
> ఇదమస్తీదమపిమే భవిష్యతి పునర్ధనమ్. 13
>
> అసౌ మయా హతశ్శత్రుర్హనిష్యే చాపరానపి,
> ఈశ్వరోఽహమహంభోగీ సిద్ధోఽహం బలవాన్సుఖీ. 14
>
> ఆఢ్యోఽభిజనవానస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా
> యక్ష్యేదాస్యామి మోదిష్య ఇత్యజ్ఞానవిమోహితాః. 15
>
> అనేకచిత్త విభ్రాంతా మోహజాలసమావృతాః,
> ప్రసక్తాః కామభోగేషు పతంతి నరకేఽశుచౌ. 16

నేడునాకిదిలభించెను, ఈమనోరథము (ఇపుడు) ఈడేర్చుకొందును, ఇంతధనము నావద్దకలదు, ఇంకను కొంత ధనము నాదికాగలదు, ఈశత్రువును చంపితిని, ఇతరులను

నైతము చంపెదను, నేను సర్వసంపన్నుడను, భోగిని, సిద్ధుడను, బలవంతుడను, సుఖిని, శ్రీమంతుడను, కులీనుడను, నాకుసమానుడు మఱియొక డెవ్వడున్నాడు, నేను యజ్ఞములు చేసెదను, దానములిచ్చెదను ఆనందమనుభవించెదను అని యజ్ఞానమోహితులైయున్నవారు తలచుచుందురు. వారనేక భ్రాంతులలోబడి మోహజాలమునజిక్కి విషయభోగరతులై యశుభమగు నరకమున బడుచున్నారు.

ఆత్మసంభావితాః స్తబ్ధా ధనమానమదాన్వితాః,
యజంతేనామ యజ్ఞైస్తేదంభేనావిధిపూర్వకమ్. 17

తమకుదాము సంభావించుకొనువారును, స్తబ్ధులును ధనమాన మదముచే మత్కెక్కియున్నవారును, అయినవీరు, విధిపూర్వకముగాని యజ్ఞములను దంభముతో పేరునకు మాత్రము చేయుచున్నారు.

అహంకారం బలం దర్పంకామంక్రోధంచ సంశ్రితాః,
మామాత్మపరదేహేషు ప్రద్విషంతోఽభ్యసూయకాః. 18

అహంకారము, బలము, దర్పము, కామము, క్రోధము గలవారు పరులనిందించువారై వారియందు నితరులయందునున్న నన్ను ద్వేషించువారై యున్నారు.

తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్,
క్షిపామ్యజస్రమశుభా నాసురీష్వేవ యోనిషు. 19

నీచులు, ద్వేషులు, క్రూరులు, అమంగళులునగు ఈ నరాధములను నికృష్టములగు నసురయోనులయందే సారె సారెకు బడవేయుచున్నాను.

ఆసురీం యోని మాపన్నా మూఢా జన్మని జన్మని,
మామప్రాప్యైవ కౌంతేయ తతో యాంత్యధమాంగతిం. 20

కౌంతేయా, ప్రతిజన్మమందును అసురయోనిని పొందుచు నన్ను పొందకపోవుటచేత మూఢులింతకంటెనుకూడ నధికమగు నధమగతిని పొందుచుందురు.

త్రివిధం నరకస్యేదం ద్వారం నాశన మాత్మనః,
కామః క్రోధస్తథా లోభ స్తస్మాదేత త్త్రయం త్యజేత్. 21

కామము క్రోధము లోభము అనునవి ఆత్మను నాశముచేయు మూడునరకద్వారములు కాబట్టి మనుష్యుడీ మూటిని త్యజింపవలెను.

ఏతైర్విముక్తః కౌంతేయ తమోద్వారై స్త్రిభి ర్నరః,
ఆచరత్యాత్మనః శ్రేయస్తతో యాతి పరాం గతిమ్. 22

కౌంతేయా, మూడువిధములుగనున్న యీనరకద్వారములకు దూరముగానుండు మనుష్యుడు, ఆత్మశ్రేయస్కరములగు కర్మల నాచరించుచున్నాడు. ఇందువలన పరమగతిని పొందుచున్నాడు.

యశ్శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః,
న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాంగతిమ్. 23

ఏమనుష్యుడు శాస్త్రవిధులనువిడిచి స్వేచ్ఛగా భోగములయందు లీనుడైయుండునో వాడు సిద్ధినిగాని, సుఖమునుగాని, పరమగతినిగాని పొందజాలడు.

వ్యాఖ్యానము:-శాస్త్రవిధులనగా కర్మజాలముకాదు.

ధర్మశాస్త్రమను పేరుగల గ్రంథములో చెప్పిన యనేకములగు క్రియలు కానేరవు. అనుభవజ్ఞానులగు సత్పురుషులు చూపించిన సంయమమార్గమని తెలియవలయును.

తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే కార్యాకార్యవ్యవస్థితౌ,
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి. 24

కాబట్టి నీవు కార్యము అకార్యము నిర్ణయించునపుడు శాస్త్రమును ప్రమాణముగా దీసికొనవలెను. శాస్త్రవిధి యేదియో తెలిసికొని నీవు కర్మచేయుట యుచితము.

వ్యాఖ్యానము:- పైనుదహరించినదే యిచటనైతము శాస్త్రమున కర్థము. ఎల్లరును తమతమ యిష్టానుసారము నిబంధనలు నిర్మించుకొని స్వేచ్ఛాచారులు కాగూడదు. కాని ధర్మానుభవముగలవారి మాటలనే ప్రమాణములుగ నంగీకరింప వలయును. ఇది ఈశ్లోకముయొక్క అభిప్రాయము.

ఓమ్, తత్సత్.

ఇతి శ్రీమద్భగవద్గీతానూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగ
శాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే దైవాసుర సంపద్విభాగ యోగోనామ
షోడశోఽధ్యాయః.

ఈప్రకారము శ్రీమద్భగవద్గీతా-ఉపనిషత్ అనగా బ్రహ్మవిద్యాంతర్గత యోగశాస్త్రమందలి శ్రీకృష్ణార్జున సంవాదమందు దైవాసుర సంపద్విభాగ యోగమను పేరుగల పదునాఱవ యధ్యాయము ముగిసినది.



# శ్రద్ధాత్రయ విభాగ యోగము.

## సప్తదశాధ్యాయము.



"శాస్త్రమును, అనగా శిష్టాచారమును ప్రమాణము గా నంగీకరింపవలయును" అనువాక్యము వినగానే యర్జునునకు, శిష్టాచార మంగీకరింపజాలక శ్రద్ధతో కర్మలాచరించు వానిగతి యేమగునాయను సంశయము జనించెను. దీనికి ప్రత్యుత్తరమిచ్చు ప్రయత్నమీ యధ్యాయమందుగలదు. కాని శిష్టాచారమను దీపస్తంభమును త్యజించినపిమ్మట నుండెడి శ్రద్ధయందు మిక్కిలి యపాయములుండునని తెలిపి భగవానుడు సంతుష్టుడయ్యెను. కాబట్టి శ్రద్ధను, దాని యాధారమున జరుగవలసిన యజ్ఞము తపస్సు దానము అనువానిని గుణానుసారము మూడు భాగములు చేసి చూపించియున్నాడు. మఱియు ఓమ్, తత్, సత్, అనువాని మహిమనుకూడ గానము చేసి యున్నాడు.

అర్జున ఉవాచ:—

యే శాస్త్రవిధి ముత్సృజ్య యజంతే శ్రద్ధయాన్వితాః,
తేషాం నిష్ఠాతు కా కృష్ణ! సత్త్వమాహో రజస్తమః. 1

అర్జునుడు చెప్పుచున్నాడు:-కృష్ణా, శాస్త్రవిధిని అనగా శిష్టాచారమునువిడిచి శ్రద్ధతోమాత్రము పూజించువారిగతి యెట్టిదగును? సాత్వికమా? రాజసమా? లేక తామసమా?

శ్రీభగవానువాచ:—

త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా,
సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు. 2

శ్రీభగవానుడు చెప్పుచున్నాడు:-మనుష్యునియందు స్వాభావికముగానే సాత్త్వికరాజస తామసములను మూడు విధములగు శ్రద్ధకలదు. దానిని వినుము.

సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత,
శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధ స ఏవ సః. 3

భారతా, ఎల్లరకుశ్రద్ధ వారివారి స్వభావము ననుసరించి యుండును. ప్రతిమనుష్యునియందును కొలదిగనో గొప్పగనో శ్రద్ధయుండియే యుండును. ఎవడెట్టి శ్రద్ధకలవాడో దానికి తగినట్లే వాడుండును.

యజంతే సాత్త్వికా దేవాన్ యక్షరక్షాంసి రాజసాః,
ప్రేతాన్ భూతగణాంశ్చాన్యే యజంతే తామసాజనాః. 4

సాత్త్వికులు దేవతలను భజించుచున్నారు. రాజసులు యక్షరాక్షసులను భజించుచున్నారు. అన్యులగు తామసులు ప్రేతములను భూతములను పూజించుచున్నారు.

అశాస్త్రవిహితం ఘోరం తప్యంతే యే తపోజనాః,
దంభాహంకార సంయుక్తాః కామరాగబలాన్వితాః. 5

కర్శయంత శ్శరీరస్థం భూతగ్రామ మచేతసః,
మాంచైవాంతశ్శరీరస్థం తాన్విద్ధ్యాసుర నిశ్చయాన్. 6

దంభము, అహంకారముగలవారై యెవ్వరు కామరాగబల ప్రేరితులై శాస్త్రవిధుల నతిక్రమించి ఘోరమగు

తపస్సు చేయుచున్నారో ఆమూఢులు శరీరమందుండు పంచ మహాభూతములను, అంతఃకరణమందు వసించుచున్నను కష్ట పెట్టుచున్నారు. అట్టివారిని నాసుర భావము గలవారిగా నెంచుము.

ఆహార స్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః।
యజ్ఞ స్తపస్తథా దానం తేషాం భేద మిమం శృణు. 7

ఆహారముకూడ మూడువిధములుగ ప్రియమగు చున్నది. అట్లే యజ్ఞము తపస్సు దానము మూడువిధములుగ ప్రియమగుచున్నవి. వాని భేదమును వినుము.

ఆయుస్సత్త్వబలారోగ్య సుఖప్రీతివివర్ధనాః,
రస్యాః స్నిగ్ధాః స్థిరాహృద్యా ఆహారాస్సాత్త్వికప్రియాః 8

ఆయువును, సత్వమును, శక్తిని, ఆరోగ్యమును, సుఖమును, రుచిని, వృద్ధిచేయునట్టియు, రసవంతములు, స్నిగ్ధములు, పౌష్టికములు, హృద్యములు, నగునట్టియు నాహారములు సాత్వికులకు ప్రియమగుచున్నవి.

కట్వామ్ల లవణాత్యుష్ణతీక్ష్ణరూక్ష విదాహినః,
ఆహారా రాజసస్యేష్టా దుఃఖశోకామయప్రదాః. 9

చేదుగా, పుల్లగా, ఉప్పగా, మిక్కిలి వేడిగా, కారముగా, చమురు లేనివిగా, దాహముకలుగ జేయునవిగానుండు నాహారములు రాజసులకు ప్రియములు. ఇవి దుఃఖము శోకము రోగము నుత్పత్తి చేయునవిగా నున్నవి.

యాతయామం గతరసం పూతి పర్యుషితంచ యత్,
ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామసప్రియమ్. 10

జామునుండి నిలువయున్నవియు, సారము లేనివియు, దుర్వాసనగలవియు, పాచివియు, ఎంగిలివియు, అపవిత్రమైనవియు నగు నాహారములు తామసులకు బ్రియములు.

అఫలాకాంక్షిభి ర్యజ్ఞోవిధిదృష్టో య ఇజ్యతే,
యష్టవ్య మేవేతి మన స్సమాధాయ స సాత్త్వికః. 11

ఫలాసక్తి లేక విధిపూర్వకముగ కర్తవ్యమని భావించి మనస్సుచేర్చి చేయుయజ్ఞము సాత్త్వికము.

అభిసంధాయ తు ఫలం దంభార్థ మపిచైవయత్,
ఇజ్యతే భరత శ్రేష్ఠ తం యజ్ఞం విద్ధి రాజసమ్. 12

భరతశ్రేష్ఠా, ఫలాసక్తితోను డాంబికముతోను చేయు యజ్ఞము రాజసమని తెలిసికొమ్ము.

విధిహీన మసృష్టాన్నం మంత్రహీన మదక్షిణమ్,
శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే. 13

విధ్యుక్తముకానట్టియు అన్నోత్పత్తి లేనట్టియు, మంత్రము లేనట్టియు, త్యాగము లేనట్టియు, శ్రద్ధ లేనట్టియు యజ్ఞమును తామసయజ్ఞ మనుచున్నారు.

దేవ ద్విజగురు ప్రాజ్ఞ పూజనం శౌచ మార్జవమ్,
బ్రహ్మచర్య మహింసాచ శారీరం తప ఉచ్యతే. 14

దేవతలను, బ్రాహ్మణులను, గురువులను, జ్ఞానులను పూజించుట, శౌచము, ఆర్జవము, బ్రహ్మచర్యము, అహింస

అనునవి శారీరిక తపస్సని చెప్పుచున్నారు.

అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితంచ యత్,
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే. 15

దుఃఖమును గలిగింపనివియు, సత్యములు ప్రియములు హితకరములు నగు వాక్యములను పలుకుట, ధర్మగ్రంథము లభ్యసించుట వీనిని వాచిక తపస్సని చెప్పుచున్నారు.

మనఃప్రసాదః సౌమ్యత్వం మౌన మాత్మవినిగ్రహః,
భావసంశుద్ధి రిత్యేత త్తపో మానస ముచ్యతే. 16

మనస్సుయొక్క ప్రసన్నత, సౌమ్యత, మౌనము, మనోనిగ్రహము భావశుద్ధి వీనినిమానసిక తపస్సనుచున్నారు

శ్రద్ధయా పరయా తప్తం తపస్తత్త్రివిధం నరైః,
అఫలాకాంక్షిభిర్యుక్తై స్సాత్త్వికం పరిచక్షతే. 17

సమత్వముగల పురుషులు ఫలాపేక్షను విడిచి పరమ శ్రద్ధాపూర్వకముగా నీమూడువిధములగు తపస్సును చేయు నపుడు బుద్ధిమంతులు దానిని సాత్త్వికతపస్సను చున్నారు.

సత్కారమానపూజార్థం తపో దంభేన చైవ యత్,
క్రియతే తదిహ ప్రోక్తం రాజసం చల మధ్రువమ్. 18

సత్కారము, మానము, పూజ వీనినిమిత్తము దంభ పూర్వకముగా చేయబడునది, అస్థిరము ననిశ్చితమునగుటచే రాజసతపస్సని యనుచున్నారు.

మూఢగ్రాహేణాత్మనో యత్పీడయా క్రియతే తపః,
పరస్యోత్సాదనార్థంవా తత్తామస ముదాహృతమ్. 19

తన్ను తాను పీడించుకొనుచు, దురాగ్రహముతో, ఇతరుల నాశనముకొఱకు చేయుతపస్సు తామస తపస్సనుచున్నారు.

దాతవ్య మితి యద్దానం దీయతేఽనుపకారిణే,
దేశేకాలేచ పాత్రేచ తద్దానం సాత్త్వికం స్మృతమ్. 20

ఇచ్చుట ఉచితమనితలచి ప్రతిఫలమపేక్షింపక దేశకాలపాత్రము లాలోచించి చేయుదానము సాత్త్వికదానమనుచున్నారు.

యత్తు ప్రత్యుపకారార్థం ఫల ముద్దిశ్యవాపునః,
దీయతేచ పరిక్లిష్టం తద్దానం రాజసం స్మృతమ్. 21

ఏదానము ప్రత్యుపకారార్థమైనను, ఫలమునుద్దేశించియైనను దుఃఖముతో ఇవ్వబడుచున్నదో అది రాజసదానమనబడుచున్నది.

అదేశకాలే యద్దాన మపాత్రేభ్యశ్చ దీయతే,
అసత్కృత మవజ్ఞాతం తత్తామస ముదాహృతమ్. 22

దేశకాలపాత్రముల విచారింపక, సత్కరింపక, తిరస్కార పూర్వకముగానిచ్చు దానమును తామసదానమనుచున్నారు.

ఓం తత్స దితి నిర్దేశో బ్రాహ్మణస్త్రివిధః స్మృతః,
బ్రాహ్మణా స్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా. 23

ఓమ్, తత్, సత్ అను మూడు విధములచే బ్రహ్మము వర్ణితమైనది. పూర్వకాలమందు దీనివలననే, బ్రాహ్మణులును వేదములును యజ్ఞములును నిర్మింపబడినవి.

తస్మా దోమిత్యుదాహృత్య యజ్ఞదానతపఃక్రియాః,
ప్రవర్తంతే విధానోక్తాః సతతం బ్రహ్మవాదినామ్. 24

కావున బ్రహ్మవాదులు "ఓమ్" నుచ్చరించుచు యజ్ఞము దానము మున్నగు తపఃక్రియలు సదావిధ్యుక్తముగానే చేయుచున్నారు.

తదిత్యనభిసంధాయ ఫలం యజ్ఞ తపఃక్రియాః,
దానక్రియాశ్చ వివిధాః క్రియంతే మోక్షకాంక్షిభిః 25

మోక్షార్థులు "తత్" అని యుచ్చరించి ఫలాపేక్ష లేనివారై వివిధ యజ్ఞదాన తపఃక్రియలు చేయుచున్నారు.

సద్భావే సాధుభావేచ సదిత్యేతత్ప్రయుజ్యతే,
ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ యుజ్యతే. 26

పార్థా, "సత్" అనుశబ్దమును సత్యము కల్యాణము అను నర్థమందుపయోగించుచున్నారు. "సత్" శబ్దము సత్కార్మలయందు సైతము వ్యవహృత మగుచున్నది.

యజ్ఞే తపసి దానేచ స్థితి స్సదితి చోచ్యతే.
కర్మచైవ తదర్థీయం సదిత్యే వాభిధీయతే. 27

యజ్ఞమందును, తపస్సునందును దానమందునుకల దృఢస్థితినికూడా "సత్" అనుచున్నారు, "తత్" కొరకే కర్మయున్నది అనునిట్టి సంకల్పమునుకూడా సత్ అనుచున్నారు.

వ్యాఖ్యానము:- పైన మూడుశ్లోకముల భావార్థమిది- ప్రతికర్మయు నీశ్వరార్పణముచేసియే చేయవలయును. ఎందుకనగా, "ఓమ్" అనునదియే "సత్" అయియున్నది. సత్యమై

యున్నది. దానిని అర్పణముచేయుచున్నను ఫలించుచుండును.

అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతంచ యత్.
అస దిత్యుచ్యతే పార్థ! నచ తత్ప్రేత్య నో ఇహ. 28

పార్థా, అశ్రద్ధతో చేసిన యజ్ఞమును, దానమును తపమును, అథవా యితరకార్యమును "అసత్" అందురు. అది ఇహమందుగాని పరమందుగాని నిష్ప్రయోజనమైనది.

ఓమ్, తత్సత్.

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగ
శాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే శ్రద్ధాత్రయ విభాగ యోగో నామ
సప్తదశోఽధ్యాయః.

ఈప్రకారము శ్రీమద్భగవద్గీతా-ఉపనిషత్ అనగా బ్రహ్మవిద్యాంతర్గత యోగశాస్త్రమందలి శ్రీకృష్ణార్జున సంవాదమందు శ్రద్ధాత్రయ విభాగ యోగమను పేరుగల పదునేడవ యధ్యాయము ముగిసినది.



# సన్న్యాస యోగము.

## అష్టాదశాధ్యాయము.



ఈయధ్యాయ ముపసంహారరూపముగ భావింప వచ్చును. దీనియొక్క అనగా గీతయొక్క ప్రేరకమంత్రమిది యని చెప్పవచ్చును:-"సర్వధర్మముల పరిత్యజించి నాశరణు పొందుము". ఇది యదార్థమగు సన్న్యాసము. అయినను సర్వ ధర్మములను పరిత్యజించుట యనగా సర్వకర్మలను పరిత్య జించుటకాదు. పరోపకార కర్మలయందు సైతముగల సర్వో త్కృష్ట కర్మలనన్నింటినికూడ వానికర్పణముచేసి ఫలాసక్తిని త్యజించుటయే సర్వధర్మత్యాగము లేక సన్న్యాస మగు చున్నది.

అర్జున ఉవాచ:—

సన్న్యాసస్య మహాబాహో తత్త్వ మిచ్ఛామి వేదితుమ్,
త్యాగస్య చ హృషీకేశ, పృథక్కేశి నిషూదన. 1

అర్జునుడు చెప్పుచున్నాడు:-మహాబాహూ, హృషీ కేశా, కేశినిషూదనా, సన్న్యాస రహస్యమును త్యాగరహ స్యమును వేర్వేరు తెలియగోరుచున్నాను.

శ్రీభగవానువాచ:—

కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం కవయోవిదుః,
సర్వకర్మఫలత్యాగం ప్రాహు స్త్యాగం విచక్షణాః. 2

శ్రీభగవానుడు చెప్పుచున్నాడు:-కామ్య (కోర్కెల నుండి పుట్టిన) కర్మలను విడుచుటను జ్ఞానులు సన్న్యాసమను పేర దెలిసికొనుచున్నారు. సర్వకర్మ ఫలత్యాగమును బుద్ధిమంతులు త్యాగమని చెప్పుచున్నారు.

త్యాజ్యం దోషవ దిత్యేకే కర్మప్రాహు ర్మనీషిణః,
యజ్ఞదానతపఃకర్మ నత్యాజ్య మితి చాపరే. 3

దోషమయములగుటచే కర్మలు విడువతగినవని విచారపరులగు పురుషులుకొందఱు చెప్పుచున్నారు. మఱికొందఱు యజ్ఞదానతపఃకర్మలు విడువదగినవి కావని చెప్పుచున్నారు.

నిశ్చయం శృణుమే తత్ర త్యాగే భరతసత్తమ,
త్యాగోహి పురుషవ్యాఘ్ర త్రివిధ స్సంప్రకీర్తితః. 4

భరతసత్తమా, యీత్యాగవిషయమై నానిర్ణయమును వినుము. పురుషశ్రేష్ఠా, త్యాగము మూడువిధములుగ వర్ణితమై యున్నది.

యజ్ఞదానతపఃకర్మ నత్యాజ్యం కార్యమేవ తత్,
యజ్ఞోదానం తపశ్చైవ పావనాని మనీషిణామ్. 5

యజ్ఞము దానము తపస్సు అనుకర్మలు విడువదగినవి కావు. కాని చేయదగినవి. యజ్ఞము దానము తపస్సు అనునవి వివేకునిగూడ పావనము చేయునవి.

ఏతాన్యపి తు కర్మాణి సంగం త్యక్త్వా ఫలానిచ,
కర్తవ్యానీతి మే పార్థ! నిశ్చితం మత ముత్తమమ్. 6

పార్థా, ఈకర్మలుసైతము ఆసక్తిని ఫలాపేక్షనువిడిచి చేయవలయుననుట నానిశ్చితమగు నుత్తమాభిప్రాయము.

నియతస్య తు సన్న్యాస కర్మణో నోపపద్యతే,
మోహాత్తస్య పరిత్యాగ స్తామసః పరికీర్తితః. 7

నియతకర్మలను విడుచుట యుక్తముకాదు. ఒకవేళ మోహావశమున వానినివిడిచినచో ఆత్యాగమును తామసమని చెప్పనగును.

దుఃఖ మిత్యేవ యత్కర్మ కాయక్లేశభయా త్త్యజేత్
సకృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్. 8

దుఃఖకారకమనితలచి కాయక్లేశమువలని భయమున కర్మలను విడిచిపెట్టుచున్నవాని త్యాగము రాజసము. ఇందువలన వానికి త్యాగఫలము లభింపదు.

కార్యమిత్యేవ యత్కర్మ నియతం క్రియతేఽర్జున,
సంగం త్యక్త్వా ఫలంచైవ స త్యాగ స్సాత్త్వికో మతః. 9

అర్జునా "చేయవలయును" అని తెలిసికొని సంగమును ఫలమును త్యజించి నియతకర్మలను చేసెనేని ఆత్యాగమును సాత్త్వికమందురు.

నద్వేష్ట్య కుశలం కర్మ కుశలే నానుషజ్యతే,
త్యాగీసత్త్వసమావిష్టో మేధావీ ఛిన్నసంశయః. 10

సంశయరహితుడు, విశుద్ధభావజ్ఞుడు, త్యాగి, బుద్ధిమంతుడు నగువాడు కష్టములగు కర్మలనుద్వేషింపడు. సులభమగు కర్మలయందు లీనుడుకాడు.

నహి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః,
యస్తు కర్మఫలత్యాగీ సత్యాగీ త్యభిధీయతే. 11

కర్మల నెల్లప్పుడు విడిచిపెట్టుట దేహధారి కసంభవము.

కాని కర్మఫలము విడుచువానినే త్యాగియందురు.

అనిష్ట మిష్టం మిశ్రంచ త్రివిధం కర్మణః ఫలమ్,
భవత్యత్యాగినాం ప్రేత్య నతు సన్న్యాసినాం క్వచిత్. 12

త్యాగము చేయువానికి మరణించినపిమ్మట శుభములు అశుభములు శుభాశుభములు అను మూడువిధములుగా కర్మఫలము ప్రాప్తించుచున్నది. త్యాగికి (సన్న్యాసికి) అది యెప్పుడును ప్రాప్తించదు.

పంచైతాని మహాబాహో కారణాని నిబోధ మే,
సాంఖ్యే కృతాంతే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణామ్. 13

మహాబాహూ, కర్మసిద్ధినిగూర్చి సాంఖ్యశాస్త్రము నందైదు కారణములను చెప్పిరి. అవి నావలన వినుము.

అధిష్ఠానం తథా కర్తా కరణంచ పృథగ్విధమ్,
వివిధాచ పృథక్చేష్టా దైవం చైవాత్ర పంచమమ్. 14

అవైదివి:- క్షేత్రము, కర్త, భిన్నభిన్నసాధనములు, భిన్నభిన్నక్రియలు, మఱియు నైదవది దైవము.

శరీర వాఙ్మనోభి ర్యత్కర్మ ప్రారభతే నరః,
న్యాయ్యంవా విపరీతంవా పంచైతే తస్య హేతవః. 15

మనోవాక్కాయ కర్మలచేత నితిసమ్మతముగగాని నీతి విరుద్ధముగగాని మనుష్యుడెట్టి కార్యములు చేసినను ఆకార్యముల కీయైదును కారణములగుచున్నవి.

తత్రైవం సతి కర్తార మాత్మానం కేవలంతుయః,
పశ్య త్యకృత బుద్ధిత్వా న్నసపశ్యతి దుర్మతిః. 16

ఇట్లయినను సంస్కారమునుపొందని బుద్ధిచేత తన్నేకర్త

గా నెవఁడు భావించుకొనుచున్నాఁడో ఆమర్మతి యేమియు నెఱుగఁడు,

యస్య నాహంకృతో భావో బుద్ధి ర్యస్య నలిప్యతే,
హత్వాపి స ఇమాఀ లోకాఀ నహంతి ననిబధ్యతే. 17

ఎవనియందహంకార భావము లేదో ఎవనిబుద్ధి మలినము కలదికాదో అట్టివాఁడీ లోకమును చంపుచుండియు చంపువాఁడుకాఁడు. వాఁడు బంధనమున తగుల్కొనఁడు.

వ్యాఖ్యానము:-ఈశ్లోకము పైపైనచదివినచో మనుష్యుని భ్రమింపజేయునదిగా నున్నది. గీతయందలి యనేక శ్లోకములు కల్పితాదర్శము నవలంబించునవి. వానికి సరియైన నమూనాలు లోకమందు దుర్లభములు. వ్యవహారార్థము లోకమందు కల్పితాదర్శముల యాకృతులుఎట్లు రేఖాగణితమందావశ్యకములై యున్నవో యట్లే ధర్మమందుసైతము వ్యవహారార్థ మావశ్యకములై యున్నవి. కావుననీశ్లోక భావమిట్లు చెప్పవచ్చును. ఎవని బుద్ధి యందించుకంతయు మాలిన్యము లేదో యెవనియహంకారము భస్మమైపోయినదో అట్టివాని విషయమున వాఁడు సర్వప్రపంచమును బాగుగా సంహరించి యున్నాఁడని చెప్పవచ్చును. అయినను ఎవనియందహంకారము లేదో వానికి శరీరమే లేదు. ఎవనిబుద్ధి విశుద్ధమైయున్నదో వాఁడు త్రికాలదర్శి. అట్టిపురుషుఁడు కేవలమొక భగవానుఁడే; వాఁడుకర్తగానున్నను అకర్తయే. హింసించుచున్నను అహింసకుఁడే. ఈకారణమున మనుష్యునిముందు అహింసాత్మకమగు శిష్టాచారమే మార్గముగ నున్నది.

జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా,
కరణం కర్మకర్తేతి త్రివిధః కర్మసంగ్రహః. 18

కర్మప్రేరణమందు మూడుతత్త్వములున్నవి-జ్ఞానము, జ్ఞేయము, పరిజ్ఞాత. కర్మాంగములు మూడువిధములుగ నున్నవి. ఇంద్రియములు, క్రియ, కర్త.

వ్యాఖ్యానము:-ఇందు విచారాచారముల సమీకరణముకలదు. తొలుత మనుష్యుడు కర్తవ్యకర్మను (జ్ఞేయమును), దానివిధిని (జ్ఞానమును) తెలిసికొనుచున్నాడు. అనగా పరిజ్ఞాత యగుచున్నాడు. ఈవిధమున కర్మను ప్రేరేపించిన వెనుక వాడింద్రియములద్వారా (కరణములద్వారా) క్రియలకు కర్త యగుచున్నాడు. ఇది కర్మసంగ్రహము.

జ్ఞానం కర్మచ కర్తాచ త్రిధైవ గుణభేదతః,
ప్రోచ్యతే గుణసంఖ్యానే యథావ చ్ఛృణుతాన్యపి. 19

జ్ఞానము, కర్మ, కర్త గుణభేదానుసారము మూడువిధములు. గుణగణనమందవి యెట్లువర్ణితములగుచున్నవో వినుము

సర్వభూతేషు యేనైకం భావ మవ్యయ మీక్షతే,
అవిభక్తం విభక్తేషు తజ్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్. 20

దేనిచేత మనుష్యుడు సర్వభూతములయందేకమగు నవ్యయభావమును, భిన్నత్వమునందేకత్వమును చూచుచున్నాడో దానిని సాత్త్వికజ్ఞానమని యెఱుగుము.

పృథక్త్వేనతు యత్ జ్ఞానం నానాభావాన్ పృథగ్విధాన్,
వేత్తి సర్వేషు భూతేషు తజ్జ్ఞానం విద్ధి రాజసమ్. 21

భిన్నభిన్నములుగ దోచుకారణమున సకలభూతముల

యందును వేఱువేఱగు నానాభావములను 'దేనిచేత మను
ష్యుడు చూచుచున్నాడో దానిని రాజసజ్ఞానమని యెఱుగుము

యత్తు కృత్స్నవ దేకస్మి న్కార్యే సక్త మహైతుకమ్,
అతత్త్వార్థవదల్పంచ తత్తామసముదాహృతమ్. 22

ఒకే కార్యమందు కారణమేమియు లేక యదియే సర్వ
స్వమను నాభాస దేనివలనకలుగుచున్నదో, ఏదిరహస్య రహి
తము తుచ్ఛమునై యున్నదో యది తామసజ్ఞానమనబడుచున్నది

నియతం సంగరహిత మరాగద్వేషతః కృతమ్,
అఫలప్రేప్సునా కర్మ యత్త త్సాత్త్విక ముచ్యతే. 23

ఫలాపేక్షారహితుడు ఆసక్తి, రాగము, ద్వేషము లేక
చేసిన నియతకర్మను సాత్త్వికమని చెప్పుచున్నారు.

వ్యాఖ్యానము:-వ్యాఖ్యానములు 3, 8 చూడుము.

యత్తు కామేప్సునా కర్మ సాహంకారేణవా పునః,
క్రియతే బహుళాయాసం తద్రాజస ముదాహృతమ్. 24

భోగాపేక్షకలిగియున్నవాడు "నేను చేయుచున్నాను"
అను భావముతో అధికాయాసపూర్వకముగా చేయుచున్న
కర్మను రాజసమని చెప్పుచున్నారు.

అనుబంధం క్షయం హింసా మనపేక్ష్యచ పౌరుషమ్,
మోహా దారభ్యతే కర్మ తత్తామస ముదాహృతం. 25

పరిణామమును, కీడును, హింసను, స్వశక్తిని విచా
రింపక మోహవశుడై మనుష్యుడారంభించుకర్మను తామస
మని చెప్పుదురు.

ముక్తసంగో నహంవాదీ ధృత్యుత్సాహసమన్వితః,
సిద్ధ్యసిద్ధ్యో ర్నిర్వికారః కర్తాసాత్త్విక ఉచ్యతే. 26

ఆసక్తియు, అహంకారమును లేనివాడును, ధైర్యము నుత్సాహమును గలవాడును, ఫలాఫలములయందు హర్షశోకములు పొందనివాడును, సాత్త్వికకర్త యనిపించుకొనుచున్నాడు.

రాగీ కర్మఫలప్రేప్సుర్లుబ్ధో హింసాత్మకోఽశుచిః,
హర్షశోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః. 27

రాగముకలవాడును, కర్మఫలాసక్తి గలవాడును, లోభముగలవాడును, హింసాత్మకుడును, మలినుడును, హర్షశోకములు గలవాడును, రాజసకర్త యనిపించుకొనుచున్నాడు.

అయుక్తః ప్రాకృతః స్తబ్ధశ్శఠో నైష్కృతికోఽలసః,
విషాదీ దీర్ఘసూత్రీచ కర్తా తామస ఉచ్యతే. 28

చలచిత్తుడును, అసంస్కారుడును, జడుడును, శఠుడును, నీచుడును, అలసుడును, అప్రసన్నచిత్తుడును, గంటలో చేయుపని నెలవఱకు చేయువాడును, తామసకర్త యనిపించుకొనుచున్నాడు.

బుద్ధే ర్భేదం ధృతేశ్చైవ గుణత స్త్రివిధం శృణు,
ప్రోచ్యమాన మశేషేణ పృథక్త్వేన ధనంజయ! 29

ధనంజయా, బుద్ధికిని ధృతికిని గుణానుసారము కలుగు మూడు వేర్వేరు విధములను సంపూర్తిగా చెప్పుచున్నాను వినుము.

ప్రవృత్తించ నివృత్తించ కార్యాకార్యే భయాభయే
బంధం మోక్షం యా వేత్తి బుద్ధి స్సా పార్థ! సాత్త్వికీ. 30

ప్రవృత్తి, నివృత్తి, కార్యము, అకార్యము, భయము నిర్భయము, బంధము, మోక్షము, అనువానిభేదమును ఏబుద్ధి (ఉచితరీతిని) తెలిసికొనుచున్నదో అది సాత్త్వికబుద్ధి.

యయా ధర్మ మధర్మంచ కార్యంచాకార్యమేవ చ,
అయథావ త్ప్రజానాతి బుద్ధి స్సా పార్థ! రాజసీ. 31

పార్థా, ధర్మాధర్మముల కార్యాకార్యములను ఏబుద్ధి తప్పుగా వివేచించుచున్నదో యది రాజసబుద్ధి.

అధర్మం ధర్మమితి యా మన్యతే తమసావృతా
సర్వార్థాన్ విపరీతాంశ్చ బుద్ధి స్సా పార్థ! తామసీ. 32

పార్థా, ఏది యంధకారపరివృతమై యధర్మమును ధర్మముగ భావించుచున్నదో, సకలధర్మములను విపరీతముగ చూచుచున్నదో ఆబుద్ధి తామసబుద్ధి.

ధృత్యా యయా ధారయతే మనః ప్రాణేంద్రియక్రియాః,
యోగేనావ్యభిచారిణ్యా ధృతి స్సా పార్థ సాత్త్వికీ. 33

పార్థా, ఏకనిష్ఠతోకూడిన యేధృతిచేత మనుష్యుడు మనఃప్రాణేంద్రియముల క్రియలను సామ్యబుద్ధితో ధరించుచున్నాడో యది సాత్త్వికధృతి.

యయాతు ధర్మకామార్థాన్ ధృత్యా ధారయతేఽర్జున,
ప్రసంగేన ఫలాకాంక్షీ ధృతి స్సా పార్థ రాజసీ. 34

పార్థా, ఏధృతిచేత మనుష్యుడు ఫలాసక్తుడై ధర్మార్థ

కామములను ధరించుచున్నాడో, యది రాజసధృతి.

యయా స్వప్నం భయం శోకం విషాదం మదమేవ చ,
న విముంచతి దుర్మేధా ధృతి స్సా పార్థ! తామసీ. 35

పార్థా, ఏధృతిచేత దుర్బుద్ధిగల మనుష్యుడు నిద్రను, శోకమును, భయమును నిరాశను మదమును విడువజాలడో యది తామసధృతి.

సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ,
అభ్యాసా ద్రమతే యత్ర దుఃఖాంతంచ నిగచ్ఛతి. 36
యత్తదగ్రే విషమివ పరిణామేఽమృతోపమమ్,
తత్సుఖం సాత్త్వికం ప్రోక్త మాత్మబుద్ధిప్రసాదజమ్. 37

భరతర్షభా, ఇక మూడువిధములగు సుఖములను గూర్చి నావలన వినుము. దేనియభ్యాసముచే మనుష్యుడు ప్రసన్నుడైయుండునో, దేనివలన దుఃఖమున కంతముకలుగుచున్నదో ఏదిప్రారంభమున విషయమైతోచి పరిణామమందమృతోప మానమగుచున్నదో, ఏదియాత్మజ్ఞాన ప్రసన్నతవలన నుత్పన్నమగుచున్నదో యది సాత్వికసుఖమనిపించుకొనుచున్నది.

విషయేంద్రియ సంయోగా ద్యత్తదగ్రేఽమృతోపమం,
పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతం. 38

విషయేంద్రియ సంయోగముచే నేదియారంభమందమృతోపమానమై పరిణామమందు విషతుల్యమగుచున్నదో యది రాజససుఖమనిపించుకొనుచున్నది.

యదగ్రే చానుబంధే చ సుఖం మోహన మాత్మనః,
నిద్రాలస్యప్రమాదోత్థం త త్తామస ముదాహృ తం. 39

ఏదియారంభమందును పరిణామమందును ఆత్మకు మోహమును కలిగించునదియో, ఏదనిద్ర ఆలస్యము ప్రమాదము అనువానివలన కలిగినదియో, యది తామససుఖమనిపించుకొనుచున్నది.

నతదస్తి పృథివ్యాం వా దివి దేవేషువా పునః,
సత్త్వం ప్రకృతిజైర్ముక్తం యదేభి స్స్యాత్త్రిభిర్గుణైః. 40

భూలోకమందుగాని స్వర్గలోకమందు దేవతలమధ్యగాని ప్రకృతివలనబుట్టిన యీ త్రిగుణములనుండి ముక్తమై యున్నట్టి దెద్దియును లేదు.

బ్రాహ్మణ క్షత్రియ విశాం శూద్రాణాంచ పరంతప!
కర్మాణి ప్రవిభక్తాని స్వభావ ప్రభవైర్గుణైః. 41

పరంతపా, బ్రాహ్మణక్షత్రియ వైశ్య శూద్రుల కర్మలు నైతము వారిస్వభావ జన్యములైన గుణములనుబట్టియే విభక్తమై యున్నవి.

శమో దమస్తప శ్శౌచం క్షాంతి రార్జవ మేవ చ,
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రహ్మ కర్మ స్వభావజం. 42

శమము, దమము, శౌచము, క్షమ, సరళత్వము, జ్ఞానము, అనుభవము, ఆస్తికత అనునవి బ్రాహ్మణుని స్వభావజన్యములైన కర్మలు.

శౌర్యం తేజో ధృతి ర్దాక్ష్యం యుద్ధేచాప్య పలాయనం,
దాన మీశ్వరభావశ్చ క్షాత్రం కర్మస్వభావజమ్. 43

శౌర్యము, తేజము, ధృతి, దక్షత, యుద్ధమున వెన్ను జూపకుండుట దానము శాసనము అనునవి క్షత్రియుని స్వభావ జన్యములగు కర్మలు.

కృషి గోరక్ష్య వాణిజ్యం వైశ్య కర్మ స్వభావజం,
పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజం. 44

కృషి, గోసంరక్షణము వాణిజ్యము అనునవి వైశ్యుని స్వభావజన్యములగుకర్మలు. సేవ శూద్రుని స్వభావజన్యమగుకర్మ.

స్వే స్వే కర్మ ణ్యభిరతస్సంసిద్ధిం లభ తే నరః,
స్వకర్మనిరత స్సిద్ధిం యథా విందతి తచ్ఛృణు. 45

తనస్వకర్మయందభిరతుడై మనుష్యుడు మోక్షమెట్లు పొందుచున్నాడో వినుము.

యతః ప్రవృ త్తి ర్భూతానాం యేన సర్వ మిదంతతం,
స్వకర్మణా త మభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః 46

ఎవనివలన భూతముల ప్రవృత్తి జరుగుచున్నదో ఎవ్వనిచే సమస్తము వ్యాప్తమైయున్నదో అట్టివానిని స్వకర్మచేత భజించుచున్న వాడు మోక్షముపొందుచున్నాడు.

శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మా త్స్వనుష్ఠితాత్,
స్వభావ నియతం కర్మ కుర్వ న్నా ప్నోతి కిల్బిషం. 47

పరధర్మము సుకరమైయున్నను, దానికంటె, విగుణమగు స్వధర్మము మిక్కిలి మంచిది. స్వభావనియతములగు కర్మలు చేయువానికి పాపములంటవు.

వ్యాఖ్యానము:-స్వధర్మమనగా తనకర్తవ్యము. గీతా

శిక్షయొక్కమధ్య బిందువు, కర్మఫలత్యాగమైయున్నది. స్వ కర్మకంటె మఱియొక అత్యుత్తమకర్తవ్యము నన్వేషించుట వలన ఫలత్యాగమునకు స్థానముండదు. కాబట్టియే స్వధర్మము శ్రేష్ఠమని చెప్పబడినది. సకలధర్మములఫలము తత్పాలన యందు గలదు.

సహజం కర్మ కౌంతేయ సదోషమపి న త్యజేత్,
సర్వారంభా హి దోషేణ ధూమే నాగ్నిరివావృతాః. 48

కౌంతేయా, స్వాభావికముగా ప్రాప్తించిన కర్మములు దోషయుక్తములైనను విడువరాదు. ఎట్లగ్నితో పొగకూడి యున్నదో అట్లే సమస్త కర్మలతోగూడ దోషములున్నవి.

అసక్తబుద్ధి స్సర్వత్ర జితాత్మా విగతస్పృహః,
నైష్కర్మ్యసిద్ధిం పరమాం సన్న్యాసే నాధిగచ్ఛతి. 49

ఎవ్వడన్నింటినుండి యాసక్తి మఱల్చుకొనెనో, ఎవ్వడుకోర్కలను విడిచిపెట్టెనో, ఎవడు మనస్సును జయించెనో వాడు సన్యాసముచేత నైష్కర్మ్యరూపమగు పరమసిద్ధి పొందుచున్నాడు.

సిద్ధింప్రాప్తో యథా బ్రహ్మ తథాఽఽప్నోతి నిబోధ మే
సమాసేనైవ కౌంతేయ! నిష్ఠా జ్ఞానస్య యా పరా. 50

కౌంతేయా, సిద్ధిప్రాప్తించినపిమ్మట, మనుష్యుడెట్లు బ్రహ్మమును పొందుచున్నాడో నావలన సంక్షేపముగా వినుము. అదియే జ్ఞానపరమావధి.

బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాత్మానం నియమ్య చ,
శబ్దాదీన్ విషయాం స్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ. 51

వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయ మానసః,
ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః. 52
అహంకారం బలం దర్పం కామంక్రోధం పరిగ్రహమ్,
విముచ్య నిర్మమ శ్శాంతో బ్రహ్మభూయాయ కల్పతే. 53

విశుద్ధమైయున్న బుద్ధిగలయోగి దృఢపూర్వకముగ తన్నువశపఱచుకొని శబ్దాదివిషయములను త్యజించి, రాగద్వేషములనుజయించి, వివిక్తస్థలమునందున్న వాడగుచు, అల్పాహారుడగుచు మనోవాక్కాయములను స్వాధీనమందుంచుకొని, ధ్యానయోగమందు నిత్యపరాయణుడగుచు, వైరాగ్యము నాశ్రయించి అహంకారము, బలము, దర్పము, కామము, క్రోధము, పరిగ్రహము అనువానిని విడిచి మమకారరహితుడై శాంతుడై బ్రహ్మభావమునుపొంద సర్హుడగుచున్నాడు.

బ్రహ్మభూతః ప్రసన్నాత్మా నశోచతి న కాంక్షతి,
సమస్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్. 54

బ్రహ్మభావమునుపొందిన ప్రసన్నచిత్తుడగు మనుష్యుడు శోకింపడు. ఏదియుగోరడు. భూతములయందు సమభావముకల్గి నా పరమభక్తి పొందుచున్నాడు.

భక్త్యా మా మభిజానాతి యావాన్ యశ్చాస్మి తత్త్వతః,
తతో మాం తత్త్వతోజ్ఞాత్వా విశతే తదనంతరమ్. 55

నేనెట్టివాడనో యెవడనోయని భక్తిచేతవాడు యథార్థము తెలిసికొనుచున్నాడు. అట్లునన్ను యథార్థముగా తెలిసికొని నాయందు ప్రవేశించుచున్నాడు.

సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః,
మత్ప్రసాదా దవాప్నోతి శాశ్వతం పద మవ్యయమ్. 56

నన్నాశ్రయించువాడు ఎల్లప్పుడు సమస్తకర్మలు చేయుచున్నను, నాకృపవలన శాశ్వతమగు నవ్యయపదము పొందుచున్నాడు.

చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః,
బుద్ధియోగ ముపాశ్రిత్య మచ్చిత్తః సతతం భవ. 57

మనస్సుచేత సమస్తకర్మలు నాయందు సమర్పించి మత్పరాయణుడవై వివేకబుద్ధి నాశ్రయించి నిరంతరము నాయందు చిత్తముంచుము.

మచ్చిత్తః సర్వదుర్గాణి మత్ప్రసాదా త్తరిష్యసి,
అథచేత్త్వ మహంకారాన్న శ్రోష్యసి వినంక్ష్యసి. 58

నాయందుచిత్తముంచినపిమ్మట పర్వతములవంటి సమస్తకష్టములను నాకృపవలన తరింపగలవు. కాని యొకవేళ అహంకారవశుడవై నామాట వినకపోతివేని నాశమును పొందెదవు.

యదహంకార మాశ్రిత్య నయోత్స్యఇతి మన్యసే,
మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతి స్త్వాం నియోక్ష్యతి. 59

అహంకారవశుడవై "నేను యుద్ధముచేయను" అని నీవు తలచితివేని యీనిశ్చయము మిథ్యయయినది. నీప్రకృతియే నిన్నాదెసకు బలాత్కారముగా నీడ్చుకొనిపోవును.

స్వభావజేన కౌంతేయ నిబద్ధ స్స్వేనకర్మణా,
కర్తుం నేచ్ఛసి యన్మోహా త్కరిష్యస్య వశోఽపి తత్. 60

కౌంతేయా, నీస్వభావజన్యమైన కర్మలచేత నిబద్ధుడవైయున్న కారణముననీవు మోహవశుడవై దేనినిచేయ గోరవో దానినే యవశుడవై చేయుదువు.

ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి,
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా. 61

అర్జునా, ఈశ్వరుడు సకలప్రాణుల హృదయమందు వసించుచున్నాడు. మఱియు తన మాయాబలమున నాతడు కుమ్మరిసారెపై నెక్కించిన కుండవలె త్రిప్పుచున్నాడు.

తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత!
తత్ప్రసాదా త్పరాంశాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతం. 62

భారతా, నీవు సర్వభావములచేత నాతని శరణు పొందుము. ఆతనియనుగ్రహముచే పరమశాంతి మయమగు నమరపదమును పొందగలవు.

ఇతి తే జ్ఞాన మాఖ్యాతం గుహ్యా ద్గుహ్యతరం మయా,
విమృశ్యై తదశేషేణ యథేచ్ఛసి తథా కురు. 63

ఈవిధముగా గుహ్యములలో గుహ్యమగు జ్ఞానమును నీతోడ నేను చెప్పితిని. దీనినంతయు బాగుగా విచారించి నీకుచితమని తోచినది చేయుము.

సర్వగుహ్యతమం భూయ శ్శృణు మే పరమంవచః,
ఇష్టోఽసి మే దృఢమితి తతో వక్ష్యామి తే హితమ్. 64

మఱియు నన్నిటికంటె గుహ్యమైన యానాపరమవచనమును వినుము. నీవునాకు మిక్కిలి ప్రియుడవుకావున నీహితమునుగూర్చి నీకుచెప్పెదను.

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు,
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే. 65

నాయందు మనస్సుంచుము. నాభక్తుడవగుము. నా కొఱకు యజ్ఞముచేయుము. నన్నుగూర్చి నమస్కరింపుము. నీవునన్నే పొందెదవు. ఇదినాసత్యప్రతిజ్ఞ. నీవునాకుప్రియుడవు

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ,
అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః. 66

సకలధర్మములనువిడిచి నన్నొక్కనినే శరణుపొందుము. నేనునిన్ను సకలపాపములనుండియు ముక్తునిజేయుదును. శోకింపకుము.

ఇదం తే నా తపస్కాయ నాభక్తాయ కదాచన,
నచాశుశ్రూషవే వాచ్యం నచ మాం యోఽభ్యసూయతి. 67

తపస్వికానివానికిని, భక్తుడుకానివానికిని, వినునభిలాష లేనివానికిని, నన్ను ద్వేషించువానికిని, దీనిని (జ్ఞానమును) నీవెప్పుడును చెప్పకుము.

య ఇదం పరమంగుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి,
భక్తిం మయి పరాంకృత్వా మామేవైష్యత్యసంశయః 68

కాని యీపరమగుహ్యమగు జ్ఞానమును ఎవడు నా భక్తులకిచ్చునో వాడునాయందు పరమభక్తి కలిగినవాడగుట చేత నిస్సందేహముగ నన్నేపొందును.

నచ తస్మాన్మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః,
భవితా నచ మే తస్మాదన్యః ప్రియతరోభువి. 69

వానికంటెనాకు అధికప్రియుడగు సేవకుడు మనుష్యుల యందెవ్వడును లేడు. ఈపృథ్వియందు వానికంటెనాకు అధిక ప్రియుడెవ్వడును పుట్టబోవువాడును లేడు.

అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సంవాద మావయోః,
జ్ఞానయజ్ఞేన తేనాహ మిష్టస్స్యామితే మే మతిః. 70

మనయీ ధర్మసంవాదమును ఎవడభ్యసించునో, వాడు నన్ను జ్ఞానయజ్ఞముచే భజించునని నామతము.

శ్రద్ధావా ననసూయశ్చ శృణుయా దపియో నరః,
సోఽపిముక్త శ్శుభా౯ లోకాన్ ప్రాప్నుయాత్పుణ్యకర్మణామ్.

మఱియు నేమనుష్యుడు ద్వేషరహితుడై శ్రద్ధాపూర్వకముగ కేవలమువినునో వాడుకూడ ముక్తుడై పుణ్యవంతులు నివసించు శుభలోకమును పొందగలడు.

వ్యాఖ్యానము:-దీనితాత్పర్యమిది-ఈజ్ఞానమనుభవమునకు వచ్చినవాడే దీనినితరులకీయగలడు. శుద్ధముగ నుచ్చరించుచు అర్థసహితముగ జెప్పువారికి మాత్రమీ రెండు శ్లోకములు కావు.

కచ్చి దేతచ్ఛ్రుతం పార్థ! త్వయైకాగ్రేణ చేతసా,
కచ్చి దజ్ఞానసమ్మోహః ప్రనష్టస్తే ధనంజయ! 72

పార్థా, దీనినేకాగ్రచిత్తముతో వింటివా? ధనంజయా, అజ్ఞానకారణమునకలిగిన ఆ మోహము నశించిపోయెనా?

అర్జున ఉవాచ:—

నష్టో మోహః స్మృతి ర్లబ్ధా త్వత్ప్రసాదా న్మయాఽచ్యుత,
స్థితోఽస్మి గతసందేహః కరిష్యే వచనం తవ. 73

అర్జునుడు చెప్పుచున్నాడు:-అచ్యుతా, నీకృపచేత నామోహము నశించినది. నాకుస్మృతి కలిగినది. సందేహములు తొలగుటచే స్వస్థతపొందితిని. నీవు చెప్పునది చేయుదును

సంజయ ఉవాచ:—

ఇత్యహం వాసుదేవస్య పార్థస్యచ మహాత్మనః,
సంవాద మిమ మశ్రౌష మద్భుతం రోమహర్షణమ్. 74

సంజయుడు చెప్పుచున్నాడు:-ఇట్లు వాసుదేవుని యొక్కయు మహాత్ముడగు నర్జునునియొక్కయు గగుర్పాటును గలిగించు నద్భుతసంవాదమును నేను వింటిని.

వ్యాసప్రసాదాచ్ఛ్రుత వా నేతద్గుహ్యమహం పరమ్,
యోగంయోగేశ్వరాత్కృష్ణాత్సాక్షాత్కథయతస్స్వయమ్. 75

వ్యాసుని యనుగ్రహముచే యోగీశ్వరుడగు శ్రీకృష్ణుని శ్రీముఖమున నేనీరహస్యమగు పరమయోగమును వింటిని.

రాజన్ సంస్మృత్య సంస్మృత్య సంవాద మిమమద్భుతమ్,
కేశవార్జునయోః పుణ్యం హృష్యామిచ ముహుర్ముహుః 76

రాజా, కేశవార్జునుల యీ అద్భుతసంవాదమును స్మరించి స్మరించి మాటిమాటికి నేనానందమును పొందుచున్నాను.

తచ్చ సంస్మృత్య సంస్మృత్యరూప మత్యద్భుతం హరేః,
విస్మయో మే మహాన్ రాజన్ హృష్యామి చ పునఃపునః. 77

రాజా, హరియొక్క ఆ అద్భుతరూపమును స్మరించి

మిగుల విస్మితుడనగుచున్నాను. మాటిమాటికి హర్షమును పొందుచున్నాను.

యత్ర యోగీశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః,
తత్ర శ్రీర్విజయో భూతి ర్ధ్రువానీతి ర్మతి ర్మమ. 78

ఎచ్చటయోగీశ్వరుడగు కృష్ణుడున్నాడో, యెచ్చట ధనుర్ధరుడగు పార్థుడున్నాడో అచ్చటనే శ్రీయును, విజయమును, వైభవమును, నిశ్చలమగు నీతియున్నదని నాయభిప్రాయము.

వ్యాఖ్యానము:- యోగీశ్వరుడగు కృష్ణుడనగా అనుభవసిద్ధమగు శుద్ధజ్ఞానమని తాత్పర్యము. ధనుర్ధరుడగు నర్జునుడనగా తదనుసారిణియగు క్రియయని అభిప్రాయము. ఈ రెంటియొక్క సంగమస్థానమున సంజయుడు తెలిపిన ఫలితములుగాక మరేముండును?

ఓమ్, తత్సత్.

ఇతి శ్రీమద్భగవ ద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగ
శాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే సన్న్యాస యోగోనామ
అష్టాదశోఽధ్యాయః.

ఈప్రకారము శ్రీమద్భగవద్గీతా-ఉపనిషత్ అనగా బ్రహ్మవిద్యాంతర్గత యోగశాస్త్రమందలి శ్రీకృష్ణార్జున సంవాదమందు సన్న్యాస యోగమను పేరుగల పదునెనిమిదవ యధ్యాయము ముగిసినది.

ఓమ్ శాంతిః, శాంతిః, శాంతిః.



# శృంగారసుధాసముద్ర

## పూర్ణచంద్రోదయము.

చాలమంది చందాదారులనుండియు, తదితర భాషాభిమానులనుండియు, పూర్వకవిప్రణీతమైన, ఈమృదుమధుర మనోహర గ్రంథము నతిశీఘ్రముగ ప్రకటింపవలెనని మాకు మిక్కుటముగ జాబులు వచ్చుచున్నవి-సాధ్యమైనంత శీఘ్రముగ చందాదారులకు మిక్కిలి చౌకగా అనగా (0_12_0 ఖర్చులు 0_7_0 వెరసి రూ. 1_3_0 కు) చక్కని కాగితముపై ముద్రించి, మనోజ్ఞముగ దిట్టమగు బైండుచేయించి పంపుటకు ప్రయత్నించుచున్నారము.

ఈ అముద్రిత తాళపత్రగ్రంథము కొంతధనవ్యయము జేసి సంపాదించి, చక్కగ పరిష్కరించితిమి.

గ్రంథకర్త:—చెన్నూరి శోభనాద్రికవి. 200 సం॥లకు పూర్వమువాఁడని కీ॥ శే॥ కం. వీరేశలింగముగారిచే గొనియాడఁబడినవాఁడు.

ఇది 4 అశ్వాసముల మృదుమధుర ప్రబంధము. గద్యపద్యాత్మకము-600 సంఖ్యగలది-చందాదారులు భాషాభిమానులు పరిగ్రహించి ప్రోత్సహించితేని, అణంగియున్న పూర్వకవి ప్రణీతములగు అముద్రిత గ్రంథముల సంగ్రహించి ప్రచురింప బూనుకొందుము-భాషాభిమానులు, చందాదారులు మాకుఁదోడ్పడుదురని విశ్వసించుచున్నారము.

భాగవతుల నృసింహశర్మ,

వేఁకజుక్క గ్రంథమాల, బరంపురం-

వేగుంజుక్క గ్రంథమాల, బరంపురం, (గంజాంజిల్లా.)

# శ్రీ తులసీ రామాయణము.



## మహాత్మా గాంధిగారి యభిప్రాయము:—



ఈరామాయణముగూర్చి శ్రీగాంధిమహాత్ముడు "యంగ్ ఇండియా" పత్రికలో నిట్లువ్రాసెను:—

"మాయింట ప్రతిదినము నీరామాయణమును లాధా మహారాజను బ్రాహ్మణుడు చదువుచుండెను. అతడు కుష్ఠరోగి. ఈ రామాయణ పఠనమువలన దనరోగము నివర్తించునని విశ్వసించి పఠించుచుండెను. నిజముగ, అతడారోగమునుండి విముక్తిగాంచెను."

Mahatmaji Writes in Young India Dated April 27, 1921.

"The Ramayana used to be regularly read in our family. A Brahmin called Ladha Maharaj used to read it. He was striken with leprosy. and he was Confident that a regular reading of the Ramayana would cure him of leprosy, and indeed he was cured of it."

శ్రీగాంధిమహాత్ముడు శ్రీరామనవమినాడు సబర్మతి ఆశ్రమములో నుపన్యసించుచు శ్రీతులసీదాసు రామాయణముగూర్చి తనయభిప్రాయ మిట్లు చెప్పెను.

............తులసీదాసు రామాయణము నాకత్యంత ప్రియమగు గ్రంథము. నేను దానిని అద్వితీయ గ్రంథమని తలంచెదను—మఱియు నొక పర్యాయము చదువ నారంభించిన విసుగుచెందను.

భగవద్గీతను ఒక ఆధ్యాత్మిక శాస్త్రమని తలంచెదను. ఆ విషయమే తులసీదాసు మనకొక సుందర గ్రంథరూపముగా నుపదేశించెను"

Rs 1-0-0
D 23/3/53